శ్రీ రామకృష్ణ శారదా పఠనమందిరము.

శ్రీసీతారామచంద్ర పుస్తకభాండాగారము,

పల్లూరు. (కడప జిల్లా,) స్థాపితము 1930.

పుస్తకము పేరు [illegible]

పుస్తకము సంఖ్య [illegible] పుస్తకము వెల రు [illegible]

1. పుస్తకములు ఒకవారముకన్న ఎక్కువ నిలువుకొనకూడదు.
2. పుస్తకములు యితరులకు మార్చకూడదు లేక బదులుగా యివ్వకూడదు.
3. పుస్తకములు తీసుకపోయినవారు జాగ్రత్తగా అప్పగించవలెను. అట్లు అప్పగించనందున లేక పోగొట్టునంతట వారివద్ద పుస్తకముల ఖరీదు ఖర్చులతో వసూలుచేయబడును.

సరా:—పై నిరతులను లోబడక, పుస్తకములు పోగొట్టినవారికి, తర్వాతనిచ్చుపుస్తకములకు ముందే పూర్తిఖరీదు ఖర్చులు, చెల్లించినగాని, పుస్తకములు యింటికి ఇవ్వబడవు.

పోతేపల్లెవెంగన్న శ్రేష్ఠి,

తేది [illegible] స్థాపక, పోషక, నిర్వాహక, అధ్యక్షులు

# అమెరికన్

# చిత్రకళ

రచన
జేమ్స్ థామస్ ఫ్లెక్సనర్

అనువాదం
పిలకా నరసింహమూర్తి



ప్రతిమా బుక్స్
ముకతాల్ వీధి
మద్రాసు — 7

AMERICAN CHITRAKALA
Protima Books, Madras-7.

September 1964



The Pocket History of American Painting
Telugu Translation by P Narasimhamurthi

ముద్రణ

ఆంధ్ర మహిళా ప్రెస్
7 ఎ, రోజరీ చర్చిరోడ్, మద్రాసు —4

# విషయసూచిక





# పరిచయం

చాలమంది అమెరికన్లదృష్టి యూరోపియన్ చిత్రకళమీదే కేంద్రీకృతమై ఉండేది వారికి తమ చిత్రకళను గురించి తెలియదు, గర్వించ దగిన గొప్ప సంప్రదాయానికి తాము వారసులమన్న విషయమే వారెరగరు మూడు శతాబ్దులుగా ఈ తీర భూముల్లో వికసిస్తూ మన చిత్రకారులు వ్యాప్త మవుతున్న యునైటెడ్ స్టేట్స్‌లోని పదమూడు కాలనీల జీవితాన్ని, స్వప్నాలనీ ఉజ్వలంగా చిత్రించారు దృఢ విశ్వాసంతో వారు భవిష్యత్తుని ఎదుర్కొనగలరని కూడా మనం నమ్మవచ్చును

ఈ చిన్న పుస్తకంలో ఈ జాతి ప్రసవించిన ప్రతి ప్రముఖశిల్పిని గురించి చర్చించగల్గడం అసంభవం అమెరికన్ చిత్రకళకు ప్రాతినిధ్యం వహించగల యాభై యొక్క చిత్రకారులని గురించిమాత్రమే ముఖ్యంగా ఈ పుస్తకం వివరిస్తుంది ఈ 51 మంది చిత్రాలే ఈ పుస్తకంలోఉన్నవి వారి చిత్రాల్ని దర్శించడమేగాక వారి వ్యక్తిత్వాల్నికూడా మనం మననం చేసుకోవాలి వారిని ఆ రూపంలో మలచిన నాగరికతని కూడా మనం పరిశీలించాలి ఆహార విహారాల కలవాటుపడిన శరీరానికి కుంచెని నడిపే హస్తం పట్టుబడి ఉంది స్టూడియోలోనూ, మ్యూజియంలోనూ రూపొందడమేగాక ఇంటా బయటా ప్రసరించే సూర్యకాంతిచే ఉత్తేజితమయ్యే హృదయం చేతకూడా ఆ హస్తం నడప బడుతోంది.

అమెరికన్ చిత్రకారులు తమ యూరోపియన్ సహ చిత్రకారుల కంటె ఎక్కువ అవరోధాలతో కూడుకున్న గొప్ప సాహస కృత్యాలలో పాల్గొన్నారు వారొక క్రొత్త ప్రపంచాన్ని వ్యక్తపరచవలసి వచ్చింది అది ఆ కొసను ఈకొసనుకూడా అత్యంత సూతుకమైనది వాగామచ్చి

కైన కేంద్ర స్థలాల వాతావరణంకూడా యూరోపియన్ దృష్టికోణంలో వింతగా ఉండేవి నిజానికివారు యూరోపియన్‌లు నడిచే సాంస్కృతిక రాజబాటల నుండి, దాని వారసత్వం నుండి భౌగోళికంగా వేరు చెయ్యబడ్డారు అనేచెప్పాలి అయితే ఆ విభాగం ఎన్నడూ సమగ్రస్వరూపాన్ని దాల్చలేదు యూరోపియన్ విచారధార అవసరమైనప్పుడల్లా సలహాలివ్వడానికి వీరికి అందుబాటులోనే ఉండేది, అమెరికన్లని సముద్రం దాటించి తీసుకు వెళ్ళడానికి నౌక లెప్పుడూ తయారుగా ఉండేవి సంపూర్ణ వికాసం పొందిన యూరోపియన్ సంస్కృతిని ఆకళింపుకోడానికి ఇష్టపడని కళాకారుడు మూర్ఖుడే అవుతాడు, అయితే దాన్ని ఆకళింపుకోడానికి ప్రయత్నించే బుద్ధిమంతులు తలక్రిందులవకుండా నిలబడగల్గడం మాత్రం ఎంతేనా అవసరం

కొంతమంది అమెరికన్ చిత్రకారులు తిరిగి తమను యూరప్‌లో ప్రతిష్ఠాపించుకో గలిగారు అట్టివారు చాలవరకు పాతప్రపంచ నాగరికులుగ చెలామణి అయ్యారు కాని మన చిత్రకారులలో ఎక్కువమంది మాతృదేశంలోనే వృత్తుల్ని సేకరించారు విదేశాలలో కళాసాధన చేసేటప్పుడు కొందరు ఒక విధమైన జాతీయ హీనభావానికి గురి అయ్యారు ఇటువంటివారు దేశంతిరిగివచ్చినతరువాత ఉదాత్తతకోసం లేనిపోని ఆరాటంతో అమెరికన్ జీవితాన్నీ, అమెరికన్ స్వప్నాలనీ పూర్తిగా చిత్రరించడానికి ప్రయత్నించారు, వారు చిత్రించిన యూరోపియన్ ఛాయలున్న చిత్రాలు వారి సమకాలికుల ఆత్మగౌరవాన్ని ఆహ్లాద పరిచాయి అయితే అట్టి కృత్రిమ కళకి శాశ్వతత్వం ఎన్నడూ ఉండదు — దాన్ని సృష్టించిన విశిష్ట కౌతూహలంతోబాటు అదీ నశించింది

యూరోపియన్ దృష్టికోణానికి ప్రతిక్రియగా ఇంకొక దృష్టికోణం ప్రచలితమైంది — పైకి ఇది మొదటిదానికి విరుద్ధంగా కనిపిస్తూన్నా ఇదికూడ అదే జాతీయ అస్థిరత నుండి పుట్టుకొంది గట్టిగా డప్పులు కొట్టుకుంటూ కొందరుచిత్రకారులూ విమర్శకులూ దేశగౌరవం నిలుపుకోడానికి అమెరికన్ చిత్రకళ సముద్రాల అవతలినుండి వచ్చే

అన్ని ప్రభావాలనీ తిరస్కరించాలని పట్టుపట్టారు వారి చిత్రాలూ బొమ్మలూ ఈ అంధ విశ్వాసం చేత దెబ్బతిన్నాయి

మన ప్రముఖ చిత్రకారులు జాతీయ లజ్జనీ, జాతీయ దౌర్జన్యమునూ తమ సౌందర్యాన్వేషణలో అడ్డు తగలనియ్యకుండా జాగ్రత్త పడారు స్వీయ సంస్కృతిలో సూస్నాతులైన ఈ విశాల హృదయులు ఇతరదేశాల సంస్కృతుల్ని ఆకళించుకోడానికి ఏ మాత్రం సంకోచించలేదు ఎక్కడ పుట్టినవైనా ఉపయుక్తములైన అన్ని ప్రభావములనూ ఆకళింపుచేసుకుంటూ వారు తాము జీవించిన జీవితాన్ని ఉన్నదున్నట్లుగా వ్యక్తపరచడానికి సాయశక్తులా ప్రయత్నించారు అమెరికన్లు గనుక వారు అమెరికన్ ధరిత్రినుండి శక్తి సంచయం చేశారు, నిరాటంకంగా వారు అమెరికాని వ్యక్తం చేశారు

గతకొద్ది సంవత్సరాలుగానే మన చిత్రకళ మనజాతీయజీవితాన్ని ప్రతిబింబించడం ప్రారంభించిందని రాసే రచయితలు తమ రచనల్ని వారిత్రిక సత్యానికి విరుద్ధమైన ఆధారాలపై నిలిపారని చెప్పాలి ప్రాచీన అమెరికా ఎలా ఉండాలో కల్పించి చూపడానికి బదులు చిత్రకారులు దాన్ని ఉన్నదున్నట్లు చిత్రించారని ఈ రచయితలు విమర్శిస్తున్నారు ఉదాహరణకి గిల్బర్ట్ స్టూవర్ట్ యూరోపియన్ కృత్రిమతకి గురిఅయాడని నిందించబడ్డాడు కారణం, ఆధునిక నవలాకారులు మన విప్లవ వీరులకి కల్పిస్తున్న అసంస్కృత మొరటుతనాన్ని అతను వాషింగ్టన్‌లో చూపక పోవడం స్టూవర్ట్ తను చూసినదాన్నే సువ్యక్తపరచాడు ప్రథమ అధ్యక్షుడు ఉత్తమ సిద్ధాంతములు గల పద్దెనిమిదవ శతాబ్ది పెద్దమనిషి యుద్ధ రంగాల్లోనూ గృహస్థరంగంలోనూ సమానంగా రాణించినవాడు. స్టూవర్ట్ రూపచిత్రం ( చిత్రం 11 ) స్వాతంత్ర్య ఘోషణాపత్రం వలెనే పూర్తిగా అమెరికన్ తత్వంతో కూడుకొన్నది ఇక్కడ ఇచ్చిన అన్య చిత్రాలవలెనే అది సాంఘికమూ సౌందర్య సంయోజితమూ, మన ఉత్తమ చిత్రకారులు ఎల్లప్పుడూ సౌందర్యమునూ చరిత్రనూ, వ్యక్తిత్వమునూ వాతావరణమూ, సర్వకాల సర్వావస్థలలో అన్నిజాతుల చిత్రకళలో వలెనే సమ్మిశ్రితం చేశారు అమెరికన్ చిత్రకళా సాక్షాత్కారమంటే అమెరికన్ జీవన సాక్షాత్కారం

# 1

# మహా ల స్రోతస్సులు

ఉత్తర అమెరికా మొదట్లో కనిపెట్టినప్పుడు అక్కడి కీకారణ్య దృశ్యాలూ వాటిలో నివసించే జాతులూ యూరోపియన్లకి చాలా ప్రేరణాత్మకంగా కనిపించాయి అమెజాన్ అడవుల అద్భుత దృశ్యాల కల్పనా లోకాన్ని రేకెత్తించే నేటి ఫొటోలలాగే ఆ దృశ్యాలు వారిని లోగొన్నాయి ఈ సంభ్రమాకర్షణలకి తోడు స్వస్థానాల్ని విడిచి అసఫల జీవితాలతో పోరాడే ఆనాటివారిని ఆ నవ్య ఖాండం వరప్రసాదిని అవుతుందనే, ఆర్థికావసరాలు పరిస్తాయనే, శాంతిపూర్వకంగా భగవత్ప్రార్థనకవకాశం చేకూరుతుందనే ఆశలతో కూడిన భౌతిక జీవితావసరాలు కూడ సంచలింప జేశాయి,

నేడు 'లైఫ్' పత్రిక ఫోటోగ్రాఫర్లను సంపుతూన్నట్లే 1560 లో ఒక పబ్లిషర్ ఫ్రెంచి వాటర్ కలరిస్టైయిన జార్ లె మోనేని ఫ్లోరిడా పంపాడు, ఆ తరువాక కొన్ని సంవత్సరాలకి ఒక ఇంగ్లీషు చిత్రకారుడు జాన్ వైట్ వర్జీనియాలోని సర్ వాల్టర్ రాలే కాలనీకి గవర్నరు అయాడు యూరోపియన్ మార్కెట్టు కోసం ఈ వ్యక్తులు చిత్రించిన చిత్రాల్లో రెడ్ ఇండియన్లు ఫ్యాన్సీ డ్రస్సులలో యూరొపియన్లలా కనిపించారు. ఆదిమ వలసదారులకు అమెరికన్ దృశ్యాలూ అక్కడి జాతులూ చాలా విచిత్రంగా తోచడంవల్ల వారువాటిని చిత్రించడానికి ఇష్టపడలేదు

అమెరికా అడవుల్లో పరిభ్రమించడమనేది నిజానికి చాలా వింత యైనదీ, వణుకు పుట్టించేదని గుర్తించిన కాలంలోకి చూస్తే మన ఆదిమ వలసదారులు సువర్ణప్రభతో మెట్టువారుకొని మనకి కనిపిస్తారు వారు ఒక శక్తివంతమైన జాతికి పితలు వారి దృష్టిలో మాత్రం వారు కొంది పేదలు దారిద్ర్యం, అసఫలత, గృహ విచ్ఛిత్తుల కారణంగా అప్పటిర.. యితలన్నట్లు వారు "ఈ భయంకరమైన కీకారణ్యం" లోకి బలవంతంగా దూకారు వారి భవిష్యత్తు భయంకరమైనదీ, నిరాశాపూర్ణమైనదీ అంతు పొంతులేని పరిశ్రమ తరువాత వారు చలిమంటలతో ఉజ్వలమైన గదులలో కూర్చున్నప్పుడు తమ కల్పనలని ఆ అడవుల వైపు పరిగెత్తకుండా చేసుకోడానికే ప్రయత్నించారు తాము వదిలిపెట్టి వచ్చిన మాతృభూమి యందలి శ్యామలసస్యాల్నీ, శుభ్రవస్త్రాల్నీ, సువ్యవస్థిత జీవితాన్నీగూర్చి కలలు గనసాగారు ఈ విధంగా ఒకవైపు యూరోపియన్లు అమెరికన్ చిత్రాలకోసం పరితపిస్తుండగా అమెరికన్లు ఆ చిత్రాల్ని ద్వేషించసాగారు స్థానికావసరాలకిగా చిత్రించిన మొట్టమొదటి అమెరికన్ చిత్రాలు క్రొత్త ప్రపంచంలోని మొరటుతనాన్ని కప్పిపుచ్చడానికి ఆదిమ వలసదారులుపడే తాపత్రయాన్ని వ్యక్తపరుస్తాయి

పదిహేడవ శతాబ్దాంతంలో, వలసీ పితలు ఇంకా పరిశ్రమిస్తూ జీవిస్తుండగానే, అట్లాంటిక్ తీరంలో వందలకొలది మైళ్ళ దూరాల్లో విసిరివేయబడిఉన్న ఎన్నో చిన్న నగరాలలో ఆశ్చర్యజనకమైన సంఖ్యలో వ్యక్తులు చిత్రరచనా వ్యాసంగంలో ఉండేవారు బోస్టన్‌లో అయిదుగురు నుంచి పదిమంది వరకూ చిత్రకారులుండేవారు పేరూ ఊరూలేని ఈ విస్మృతవ్యక్తులు ఇళ్ళని పోర్ట్రెయిట్లుగానూ, కంచెలని అలంకరణదృశ్యాలుగానూ చిత్రించడంలో సిద్ధహస్తులు అయినా తమ అవకతవక కుంచెల్ని మిదకి కాన్వాసును ఎక్కించి తమ అభిలషిత అద్భుత వర్ణాల్ని చిత్ర ప్యాలెట్ నుంచి అందుకునేటప్పుడు తిరుమ సౌందర్యాన్ని స్పృశించారనే చెప్పాలి.

'మార్గరెట్ గిబ్స్' (చిత్రం 1) 1670 లో చిత్రించబడింది నివాస యోగ్యంగాని భూఖండంలోని ఒక తాత్కాలిక కుటీరలో ఆ అమ్మాయి విక

సిస్తోంది. అయితే చిత్రాన్ని చూసి మనం పరిహాస్యం ఊహించలేం అంతే కాదు, మనం పాఠ్యపుస్తకాలలో చదివే సైనిక జీవితంలో భాగంగా కూడా ఆమె కనిపించదు ఈ బోస్టన్ వారిక లండన్ ప్రాంగణంలో నిలబడినట్టుగా లేసుతోను అలంకారాలతోను మునిగిఉంది సత్వరభాగ్య సముపార్జనం చేసిన న్యూ ఇంగ్లాండు వర్తక కుటుంబాలు తమ ముందుతరాల దృష్టిలో మోటు వలసదారులుగానూ, మతము పట్టుదల గలవారుగానూ ప్రసిద్ధి పొందడానికి ఇష్టపడలేదు బ్రిటిష్ సామంత ప్రభువులమనే భ్రమకలిగించడమే వారికి నచ్చింది

మార్గరెట్ గిబ్స్ చాలా చదునుగా చిత్రించబడి కాగితపుబొమ్మలా కనిపిస్తుంది అది దాని అపూర్వ సౌందర్యం కోసం ప్రకృతి పునర్నిర్మాణం పై ఆధారపడలేదు, ఆకారివర్ణాలకి సంబంధించిన రేఖాకృతుల పై ఆధారపడింది రచనా విధానంలో ఈ నిలువెత్తు రూపచిత్రం మతగురువులు మధ్యకాలంలో తమ వ్రాతప్రతులలో చిత్రించే భక్తుల చిన్నరూపాలని పోలిఉంటుంది అమెరికన్ వలసదారుల ఇంగ్లీషు ఎల్లపట్టు కళావిషయకంగా చాలా వెనుకబడిఉంది పునర్జాగరణోద్యమాన్ని గురించి వారు చాలా అస్పష్టమైన పుకార్లు వినిఉంటారు ఆదిమవలసదారులు చిత్రకళ, వాస్తుకళ, ఆసన సామగ్రి, గృహాలంకరణలకు సంబంధించిన మధ్యకాలీన అభిరుచినే తమ వెంట తెచ్చారు

అయితే లండన్‌లో మాత్రం మధ్యకాలపు రూపకళ ఉద్యమాల ఫ్లెమింగ్ చిత్రకారుడు వాన్‌డైక్ ద్వారా దిగుమతి చేయబడిన క్రొత్త అభిప్రాయాల ముందు నిలువలేక పోయింది ఇంగ్లాండును తిరిగివస్తూ పోతూఉండే అమెరికన్ వ్యాపారులు నవీనసామంత ప్రభువుల్ని వ్యక్తీకరించడ మెలాగన్నది త్వరలో నేర్చుకున్నారు అప్పటినుంచీ స్వయం శిక్షితులైన కాలనీల చిత్రకారులు రూపచిత్రాలని చిత్రించడం కోసం తమ గృహాలేపన తూలికలని విసర్జించారు వారిపోషకులు మంచి రీవితోగూడిన రూపాలే కోరసాగారు ఎన్నడూ శిల్పాకార విరాప్ని చూడని అనేక మంది చిత్రకారులు ఏ నడిమంత్రపు ధనికవ్యాపారి నిలబడడం కోసమో

కల్పనా లోకంలోంచి వాటిని సృష్టించసాగారు ఫలితం ఎప్పుడూ అను కూలమని చెప్పడానికి వీలులేదు అయినా ప్రతిభావంతులైన చిత్రకారులు సాంఘిక ఔన్నత్యాన్ని స్వప్నాల్లోకి ప్రతిబింబింపజేశారు

1720 ప్రాంతంలో ఒకన్యూయార్కు చిత్రకారుడు, పేరు విస్మరింపబడింది, ఒక ఎంగ్రేవింగుని సంపాదించేడు అందులో లండన్‌లోని గొప్ప సాంఘిక వ్యాపారవేత్త సర్ గాడ్‌ఫ్రే నెల్లర్ గొప్పశాక్విల్ కుటుంబానికి చెందిన ఇద్దరు శిశువులు ఒక వరండాలో నిలచి ఒక లేడి పిల్లని లాలిస్తున్నట్టు చిత్రించాడు అనేకసారులు న్యూయార్కు చిత్రకారుడు స్థానిక బాల బాలికల కోసం ఇటువంటివి చిత్రించాడు అయితే అతని 'డి పైస్టర్ బాయ్' (చిత్రం 2) ని చూస్తే అతని చిత్రాలు గ్రుడ్డి అనుకరణలు కావని మనకి స్పష్టపడుతుంది వాటి హద్దులకో అవి చక్కటి మాధుర్యాన్ని కలిగివున్నాయి. నెల్లర్ ఇద్దరు పిల్లల్ని చూపితే ఈ అమెరికన్ చిత్రకారుడు ఒక పిల్లవానిని చూపడంద్వారా క్లిష్టతరమైన ఆకారాలకి సారళ్యత నాపాదించాడు నాజూకుతనంకంటె అమాయకత్వాన్నీ, ఆనందాన్నీ వ్యక్తపరచే ఉజ్వల వర్ణాలతో చదునైన విశాల సముదాయాల్ని అతడు రూపొందించాడు శాక్విల్ బాలలు లౌకిక పాత్రలుగా కనిపిస్తూండగా డిపైస్టర్ పిల్లవాడు అతను లాలించే లేడి పిల్లలాగే వనదేవతలా కనిపిస్తాడు

అయినా కొంత కృత్రిమత ఉండిపోయింది 'డిపైస్టర్ బాయ్' 'ఏన్నా పోల్లార్డ్' (చిత్రం 4) కంటె తక్కువ శక్తివంతంగాను, మౌలికంగాను కనిపిస్తుంది ఒకే కాలంలో చిత్రించబడినదైనా డాబు దర్పాలకి ఇందులో చోటు కనిపించదు మందంగా కనిపించే ఈ పూటకూటి ముసలమ్మ బోస్టన్ని ముందు నిర్మించినది తనేనని చెప్పుకొనేది ఆమె వారసులు 130 మంది అప్పటికి జీవించి ఉండేవారు చంచల బాలికగా నుండగా ఆమె వలసదారులని తెచ్చిన పడవలోంచి అందరికంటె ముందుగా గట్టుమీదికి దూకింది ఆమె కప్పటికే వంద సంవత్సరాలు దాటడంవల్ల ఆమె చెప్పినది అబద్ధమని చెప్పడానికి ఎవరూ జీవించి లేరు

ఈ షొరి చారిత్రిక జీవితాన్ని ముందుతరాల వారికోసం నిక్షిప్తం చెయ్యడంకోసం ఒక ఆకాశరామన్న చిత్రకారుడు ఆహ్వానించబడ్డాడు అతడు సౌందర్యం కోసంగాని, నాజూకుతనంకోసంగాని ప్రయత్నించలేదు ఫలితంగా ఒక ఆకర్షణీయ చిత్రం తయారైంది ఆకాలపు యూరోపియన్ చిత్రకళనికన్న ఆధునికకళ కిది సన్నిహితంగా ఉన్నట్టు కనిపిస్తుంది జీవితంలో ఉన్నదున్నట్టుగా ఏ పోలికనీ అది వ్యక్తపరచకపోయినా, తీక్షణ స్వభావురాలైన వృద్ధవనిత ఆకారం, వ్యక్తిత్వం బాగా వ్యక్తపరచబడ్డాయి సరళమైన స్థానిక రచనావిధానాన్ననుసరిస్తూ చిత్రకారుడు భవిష్యత్తులో పుట్టబోయే ఒక చిత్రకళోద్యమమైన వ్యక్తీకరణ వాదము యొక్క రహస్యాన్ని కనుగొన్నాడు కళాదృష్టితో అన్నిభాగాల్లో అప్రౌఢులు పరిగియున్న చిత్రానికికూడ తీవ్రతరమైన యదార్థతానుభూతిని కలిగించవచ్చునన్న సత్యాన్ని 'ఏన్నా పోల్లార్డ్' ధృవపరుస్తోంది.

వలసదారులతో నిండిపోతున్న దేశానికి తగినట్లుగానే విదేశాలనుండి అనేక చిత్రకారులు వచ్చారు లాభదాయకమైన వృత్తి కాకపోవడంవల్ల తమ అమెరికన్ సహవాసులవలెనే వారుకూడా అతి వినయులైన కార్మికులుగా ఉండేవారు గస్టేవస్ హెస్సీలియస్ (1682–1755) స్వీడెన్‌నుంచి 1712 లో డెలావేర్‌కి వలసవచ్చాడు అందరికంటే అతను ఎక్కువ శిక్షణపొందినవాడు దివ్యజ్ఞానియైన ఎమాన్యుయల్ స్వీడెన్బోర్గ్‌కి జ్ఞాతియైన ఇతడు విద్రోహులైన అర్చకుల కుటుంబానికి చెందినవాడు అతను దేవునితో తనకుగల సంబంధాన్ని అతి పవిత్రముగా భావించడంవల్ల అతన్ని ఏమతమూ సంతృప్తిపరచలేకపోయింది ఒకశాఖనుండి ఒకశాఖకు అతను నిరంతరంగా మారుతూ వచ్చాడు ఫిలడెల్ఫియాలో ఉన్నప్పుడు అతను ప్రపత్తి ప్రధానమైన మొరేవియన్ మతంలో జేరాడు తన సోదరులయెదుట తన పాపములను ఒప్పుకుంటూ అతను కోపంలో వొళ్ళుతెలియక నీగ్రోను కొట్టినందువల్ల మనశ్శాంతిని గోల్పోయానని వాపోయాడు అతను మేరీలాండ్‌కి ఏకావ్యాసంగంకోసం వెళ్ళడానికి అతని శాఖీయులు ఒప్పుకోలేదు అక్కడి వైభవోపేత ధనికసంఘం అతని ఆత్మని

పంచేస్తుందని హారీభయం ఇంతకీముందు అక్కడఉన్నప్పుడు అతను షోకెలాయైన ఇంగ్లాండు చర్చిలో జేరాడు అతను ఇంకా పూర్వాచార దృక్కోణాన్ని అలవరచుకొంటాడేమోనని మొరేవియన్లు భయపడ్డారు

మతంలోలాగే చిత్రకళలోకూడా హెస్సలియస్ వివిధ సాంప్రదాయాల్లో వెనక్కీ ముందుకీ వ్యవహరించాడు ఒకప్పుడతడు అమెరికన్ ప్లేసర్లని ప్రభువులుగా చిత్రించడానికి శ్రమపడ్డాడు అత్యుక్తి అతని స్వభావానికి విరుద్ధమవడంవల్ల అటువంటి రూపపటాలు కృత్రిమంగా తయారయాయి తన స్థానిక పోటీదారులనేకమంది వలెనే అతనుకూడ యదార్థంగా చిత్రించినప్పుడే ఉత్తమ కృతుల్ని చెయ్యగలిగాడు ఒక వివాద సందర్భంలో పెన్న్ కుటుంబంవారు రెడ్ ఇండియన్ నాయకుల్ని అతనిచేత చిత్రింపజేశారు ఎర్రచర్మంవారిని వారిభూమినుండి పంచించడానికి తెల్లచర్మంవారు చట్టనిర్మాణానికి పూనుకొన్నారు 'లాపోవిన్సా' (చిత్రం 5)లో హెస్సీలియస్ దైవోపహతమైన ఒక ఉన్నత వంశం యొక్క దుఃఖాంతాన్ని సృష్టించాడు నాలుగవవంతు పొడవుగల ఈ రూపచిత్రం మిడతలదండులా వచ్చిపడుతూన్న వింతతెల్లవాళ్ళకి ఆటవిక నీతిని ప్రయోగించయత్నిస్తూ అంతకంతకి అయోమయంలో పడిపోతూన్న ఒక ఆటవికనాయకుని ఆకారంప్రకారాల్ని మనకి చూపుతోంది అంతుపొంతులేని అర్థవిహీనమైన భాషలో మాట్లాడుతూ లగ్నిబాణాలతో బుర్రలు పగలగొట్టేవాళ్ల నాగరికత అతని కర్థంకాలేదు ఆఖరికి లాపోవిన్సా పూర్తిగా మోసగించబడ్డాడు

1729 ప్రాంతాల్లో అమెరికాదేశపు ప్రప్రథమ శిక్షిత చిత్రకారుడు న్యూపోర్ట్‌లో అడుగుపెట్టాడు జాన్ స్మీబెర్ట్ (1688-1751) ప్రతిభావంతుడుకాడు కాని అతను ఇటలీలో శిక్షణపొంది లండనులో మంచి జీవికను గడిపాడు అతను అక్కడ చిత్రించిన రూపచిత్రాలూ, అతను తనవెంట తెచ్చిన పూర్వాచార్యుల కొన్ని చిత్రాల ప్రతివిపులూ న్యూ ఇంగ్లాండులోని స్థానిక చిత్రకారులలో రచనా నైపుణ్యంలో క్రొత్తక్రొత్త రీతులని ప్రవేశపెట్టాయి వారికళ్ళు చూసినదాన్నీ, వారి హృదయాలు

లనుభవించినదాన్ని ఎక్కువ ప్రభావోత్పాదకంగా వ్యక్తపరచడంలో వారు సమర్థులయ్యారు

స్మిబెర్ట్ ఉత్తమ శిష్యుడు రహస్యమయుడైన రాబర్ట్ ఫేకే (1740 నుండి 1750 వరకూ) ఒక వెలుగు వెలిగాడు. అతను 1741 లో ఆకాశంలోంచి ఊడిపడ్డట్లు ఎక్కడినుంచో వచ్చాడు తొమ్మిదేళ్ల తరువాత, ఎలా వచ్చాడో అలాగే మళ్లీ శూన్యంలో ఐక్యమైపోయాడు అతని చిత్రాలు వలసదారుల సంఘంలో ఉండే సామంత వ్యామోహాల్ని అందరికంటే అందంగా వ్యక్తపర్చాయి ఒక సమకాలీనుడు డైరీలో ఇతన్నిగురించి పేర్కొన్నాడు–"ఈ వ్యక్తి చిత్రకారునికి సరియైన నమూనా, పొడుగైన తెల్లని కోలముఖం, మొనతేలిన ముక్కు, ముఖాల్లోకి తీక్షణంగాచూసే విశాలనేత్రాలు, సున్నితమైన ధవళహస్తం, పొడుగు పాటివేళ్ళు" ఈ చిత్రకారునిలోని ఆకర్షణశక్తి 'అజ్ఞాత మహిళ' (చిత్రం 3) వంటి చిత్రాలకి త్రోవతీసింది అతని చిత్రాలు సున్నితమైన వర్ణాలతో సరళంగా తీర్చి దిద్దినట్లుంటాయి ప్రకృతిని చదునుగా కాక స్థూలంగా చూసిన ప్రథమ అమెరికన్ చిత్రకారుడు ఫేకే అయినా అతను ప్రవాస చిత్రకళలోని మూల సారళ్యాన్ని త్రోసిపుచ్చలేదు అతను చేలాంచలాల్ని చిరుగంటలగాను, అసమగ్రతలని కోణాలుగాను, ముఖాల్ని ప్రస్తారిణాలుగాను చిత్రించాడు అతని చిత్రాలు క్యూబిజంని మెచ్చే నేటి ఆధునికులకి అనుకూలంగా ఉంటాయి

17 0 లో ఫేకే అదృశ్యుడయాక అంతవరకూ అమెరికన్ జీవితం అంతర్గర్భంలో పనిచేస్తూన్న నవీనశక్తులు విజృంభించసాగాయి, వలసదారులు యూరోపియన్ సంఘబీజాలని ఇక్కడ నాటారు. క్రొత్త ప్రపంచం పాత ప్రపంచాన్ని కొద్ది మార్పులతో పునస్థాపన చేస్తుందని వారుద్దేశించారు కాని ఆ విచిత్రధరిత్రి విచిత్రమొలకల్ని తలలెత్తింది అడగ్గానే అనేకవందల ఎకరాలు లభించే దేశంలో భూస్వామ్య సిద్ధాంతంపై నిలిచిన ఇగ్లాండులోవలె సామంతవాదం ఎలా స్థాపించబడగలదు? నిజానికి సమర్థ ప్రారంభకులకి అంతులేని మంచి అవకాశాలున్న ఈదేశంలో

ఏవిధమైన సాంఘిక సదుపాయాల చుట్టూ కంచెలు కట్టడం ఎలా సాధ్య మౌతుంది? నాటికీ నేటికీ అమెరికా స్వావలంబకులైన వ్యక్తులదేశంగా ఉండిపోయింది. మొదట్లో ధనికపౌరులు వలసదారుల సహజ సంకోచంతో ఈ వాస్తవాన్ని దాచడానికి ప్రయత్నించారు. ఇప్పుడిప్పుడు వారు దీన్ని సగర్వంగా ఆమోదిస్తున్నారు తాము ఇతరులెవ్వరికీ ఎందులోనూ తీసి పోమని నిరూపించడంకోసం వారు త్వరలోనే విప్లవం లేవతియ్య బోతున్నారు తమను ప్రభువుల వేషాల్లో చిత్రించమని చిత్రకారులను కోరడం వారు క్రమక్రమంగా తగ్గించారు తాము ఎలాఉన్నారో అలాగే వ్యక్తపరచబడటానికి వారు తహతహలాడసాగారు యదార్థవాద దృష్టి కోణం చిత్రకారులకి సహజమైనది.'ఏన్నిపోల్లార్డ్', 'లాపోవిన్సా వంటి శక్తివంతమైన రూపచిత్రాలు చిత్రించబడటానికి ఈ దృష్టికోణమే కారణం ఇది క్రమేణా సాంఘిక రూపచిత్రాలకి ఉపయుక్తం కాసాగింది

యదార్థరూపచిత్రణలో ప్రత్యేక శిక్షణనందిన మొదటి అమెరికన్ జోసెఫ్ బాడ్జర్ (1708-1765) ఇతను గృహచిత్రకారుడుగ నుండి సుప్రసిద్ధఫేకేని విజయవంతంగా ఎదుర్కొనగలిగాడు ఆ తరువాత కళాకాశంలో ప్రతిభావంతమైన ఒక ఉజ్వలతార వెలిగింది

ఒక పేద వితంతు కుమారుడైన జాన్ సింగిల్టన్ కాప్లీ (1738-1815) బొస్టన్‌హార్బర్‌లో లాంగ్వార్ఫ్‌వద్ద కట్టబడిన ఒక చిన్న దుకాణంలో పెరిగాడు. పోటులో ఊగులాడే తన కిటికీలోంచి చిన్న తనంలో అతను నావికులకు మంచి పొగాకు, సిగరెట్లు, దుస్తులు మొదలైనవి అమ్మేవాడు ఆ వాతావరణలోని ఆకర్షణకంటె అందులోని ఘాతుకత్వం అతన్ని ఎక్కువ లోగింది ఆ నావికుల మొరటుతనానికి భయపడి అతను తన దుకాణం దాటి బయటికి అడుగు పెట్టేవాడుకాడు అమెరికా మొదటి ఎంగ్రేవర్ అయిన పీటర్ పెల్హాం అనే నాగరిక ఆంగ్లేయుణ్ణి అతని తల్లి పెండ్లాడమనేది అతనియెడల అదృష్టంగా పరిణమించింది చిత్రకళకంకితమై నగరంలో పరిశుభ్రమైన భాగంలో ఉన్న వలసదార్ల గృహాల్లో ఒకదానిలో కాప్లీ స్థిరపడ్డాడు అతనెంతో

ఆసక్తితో తన సవతి తండ్రి ఎంగ్రేవింగుల్ని అభ్యసించాడు తన సవతి తండ్రి పెళ్లాం స్నేహితుడైన స్మీబెర్ట్ స్టూడియోని అతనెంతో ఉత్సాహంతో వేటాడాడు

త్వరలోనే కాప్లీకి తను అభ్యసించిన విద్యలన్నిటి అవసరం వాగా కలిగింది తన సవతి తండ్రి చనిపోవడంవల్ల కుటుంబ పోషణ భారం అతనిమీద వచ్చిపడింది వృత్తివిద్యకి తగినట్లుగా అతను తన పధ్నాలుగో ఏటే బోస్టన్లోని ప్రథమశ్రేణి చిత్రకారులలో జేరాడు తనయీడు ఆధునికులింకా అరుస్కూళ్లలో ఉండగా అతను అద్భుతంగా రాణించసాగాడు ముందుకి వెడుతోనే తనకనుకూలమైన రచనా విధానాన్ని నిర్మించుకొంటూ ఇంతకిముందెవ్వరూ చిత్రించని గొప్ప చిత్రాన్ని చిత్రించాడు అమెరికా తయారుచేసిన గొప్ప చిత్రకారులలో ఒకడౌటయేగాక కాప్లీ ఆదేశంలో ప్రముఖ కృతికర్తగా ప్రసిద్ధికెక్కాడు వాస్తుకళ, శిల్పకళ, సాహిత్యం, సంగీతంలలో ఇట్టి ప్రతిభావంతుడు ప్రభవించడానికి ఎన్నోతరాలు గడువవలసి ఉంది

సంకోచశీలి, గంభీరస్వభావి, శారీరక శ్రమని ఎప్పుడూ ఓర్చుకోలేనివాడు, కాన్వాసుమీదికి రంగులనెక్కించడంతప్ప వేరేవ్యామోహంలేనివాడుఅయినా కాప్లీ, దేనియల్ బూన్ అలె, సాహసోపేతుడైన అన్వేషకుడు అతనుచిత్రించిన పాల్ రీవేరీ రూపచిత్రం ఽతనుబౌద్ధికంగా ఎంతటిలోతులవరకూ పోయాడో చూపిస్తుంది ఇంగ్లీషు ధనికవాదులూ, వారి అమెరికన్ అనుకరణ కారులూ స్వంతచేతులతో పనిచెయ్యడమనేది అవమానకరంగా భావించేవారు కుష్ఠురోగాన్ని దాచినట్లు వాళ్ళీ అవమానాన్ని దాచేవారు అయితే, కాప్లీ తన కార్మిక దుస్తుల్లో తన పనిముట్ల ప్రక్కని ఉండగా, తను స్వంతంగా తయారుచేసుకున్న టీ త్రాగుతూ రివేరీ రూపచిత్రాన్ని చిత్రించాడు స్వతంత్రతా ఘోషణని కూడ ఇట్టి చిత్రాలు తలదన్నుతాయంటే అతిశయోక్తికాదు సాంప్రదాయానికేమాత్రం కట్టుబడక, శారీరక పరిశ్రమని గౌరవిస్తో తాము తాముగానే ఉండడానికి గర్వించేవ్యక్తులు సుదూర ప్రభుత్వానికి ఎన్నడూ మోకరిల్లరు

యూరోపియన్ రూపచిత్రణస్థాయి తనలో లోపించినా కాప్లీ పలు ప్రాంతాలలో అమలులోవున్న సరళరచనా విధానాలని ఆకళించుకొన్నాడు. లండను కళాచార్యుడైన జోషువా రేనాల్డ్స్ చిత్రించిన వక్తృత్వరూప చిత్రాలతో పోల్చిచూస్తే కాప్లీ చిత్రించిన 'జాన్ హేన్కాక్' (వర్ణచిత్రం) పల్లెటూరి వక్త అపరిష్కృత భాషణంవలె ఉంటుంది అయితే అత్యుక్తులతో కూడిన అద్భుతోపన్యాసాలకంటే స్వల్పంలో గంభీరంగా మాట్లాడిన మాటలు ఎక్కువ ప్రభావాన్ని కలిగి ఉండవచ్చు కాప్లీ తను చిత్రించిన ఒక రూపచిత్రంని లండను ప్రదర్శనానికి పంపాడు. రేనాల్డ్స్ దాన్ని ఒక అద్భుతకృతిగా పేర్కొన్నాడు. యూరప్‌లోని సదుపాయాలన్నీ కలిగియుండికూడ కాప్లీతో సమానంగా చిత్రించగల చిత్రకారుడెవ్వడూ ఇంగ్లండులో లేడని ఆయన ఉద్ఘోషించాడు ఆయన కాప్లీని సత్వరంగా విదేశాలకి రమ్మని ఆహ్వానిస్తూ, ప్రపంచ ఉత్తమ చిత్రకారుల్లో ఒకడుగా అవడానికి కాప్లీ పూర్వాచార్యులతో పరిచయమేర్పరచుకొంటే చాలని ఆయన్ని ధృవపరిచాడు కాని కాప్లీ అప్పట్లో బోస్టన్లో స్థిరపడ్డాడు తాను స్వయంగా కనిపెట్టిన మోటురచనావిధానంలోనే చిత్రరచన సాగించడానికి అతను నడుంకట్టాడు

అప్పట్లో అమెరికా ఒక ప్రముఖ రూపచిత్రణశైలిని కనిపెట్టే ప్రయత్నంలో ఉంది మన చిత్రకారుల్లో సంకుచిత ప్రాంతీయశైలిని ప్రోత్సహించిన అజ్ఞానం క్రమక్రమంగా నశించసాగింది. ఎన్నో ఎంగ్రేవింగ్లూ, అనేక శిక్షణ గ్రంథాలూ, అనేక విదేశ చిత్రాలూ, కళాచార్యులూ అట్లాంటిక్‌ని దాటి రావడంతో కాప్లీ విడదీసిన అనేక కళా సమస్యలు వలస ప్రాంతాల్లో వ్యాప్తినందాయి. యువ చరిత్రకారులు స్వతంత్రాన్వేషణలు కొనసాగించారు నవ్య విజ్ఞానం ప్రాచీన వలస సాంప్రదాయంలో ఆనమాలు పట్టడానికి వీలులేకుండా విలీనమైపోయింది. విదేశీయ విధానాల వెంటబడకుండా చిత్రకారులు తమూ తమ పూర్వీకులు నిరంతరం సాగించిన కళాసాధనలో ఇతోధిక శ్రద్ధాభక్తులతో నిమగ్నులు కాసాగారు

కొద్ది సంవత్సరాలు తేడాతో న్యూఇంగ్లాండులో ముగ్గురు ఉజ్వల చిత్రకారులు జన్మించారు గిల్బర్ట్ స్టూవర్ట్ (1755-1828), జాన్ ట్రంబుల్ (1756 1843), రాల్ఫ్ ఎర్ల్ (1751-1801) ఎర్ల్ చిత్రించిన 'రోగర్ షేర్మన్' (చిత్రం 10) ని బట్టి వారి ఉజ్వల భవిష్యత్తుని మనం చూడ వచ్చును స్వయం శిక్షణద్వారా న్యాయ శాస్త్రాన్నభ్యసించి ఆనాడు ప్రముఖ విప్లవ నాయకుడుగా ప్రసిద్ధికెక్కిన ఒక చెప్పులుకుట్టు వాని రూప చిత్రమది స్వయంసిద్ధ రాజకీయవేత్తని ఘనమైన సూక్ష్మ విధానంలో చూపించడంద్వారానూ, బిగువైనఆకారాలని ప్రాకారాలని గాఢ మైన నల్లనినీడలతో రూపొందించడంద్వారానూ స్వయం శిక్షిత చిత్రకారు డైన ఎర్ల్ తూచాతప్పని రూపచిత్రణకింకేఉత్తమకళని సాధించాడు అసం బద్ధమైనప్పటికీ శక్తివంతమైన ఈ వృద్ధుడు వలవంటి విండ్సర్ కుర్చీలో నిలువుగా నిశ్చలంగా శూన్య సమతల భూమిముందు కూర్చుని, భయం ఎరుంగా, నిర్భయంగా, స్వధర్మములో ఉదారంగా ప్రత్యక్షమైన మూర్తి వంతమైన పవిత్రతా వాదంగా కనుపిస్తాడు

అమెరికన్ చిత్రకళ ఆరోగ్యప్రదంగా వికసిస్తోన్న సమయంలో విప్లవం దావాగ్నిలా దాని మార్గాన్ని అరికట్టింది యుద్ధాలూ, ఆర్థిక దుర్వ్యవస్థలూ చిత్రకారుల ప్రవృత్తుల్ని పూర్తిగా నిరోధించాయి కొద్ది మంది యుద్ధంలో పాల్గొన్నాయి. కాని, యుద్ధం దీర్ఘంగా సాగినకొలదీ ఎక్కువగా చిత్రకారులు విదేశాలకి చేరుకోసాగారు అమెరికన్ చిత్ర కళాకేంద్రం అమెరికా ధరిత్రినుండి లండనుకి మారింది

# 2

# ప్రపంచరంగం

ఒక్కొక్క అమెరికన్ చిత్రకారుడు లండనులో దిగుతూండగా అప్పట్లో ఇంగ్లీషువారిచే ప్రపంచములోకల్లా గొప్ప చిత్రకారుడుగా పేర్కొనబడిన ఒక దేశాభిమాని వారికి స్వాగతం ఇవ్వసాగాడు బెంజమిన్ వెస్ట్ (1738 1820) పెన్సిల్వేనియా పల్లెపట్టులో, కాప్లీ పుట్టిన ఏడే, జన్మించాడు చిన్నపిల్లవాడై ఉండగానే అతను ఎడతెగకుండా బొమ్మలు వెయ్యసాగాడు. వ్యాపార పరిసరాలకి అసామాన్యమైన. ఈ ప్రవృత్తి అందరి దృష్టినీ ఆకర్షించింది అతన్ని ఫిలడెల్ఫియాకి ఆహ్వానించారు. నాగరికతా కేంద్రమయిన ఆ వలస నగరంలోని ప్రముఖ పౌరులు, అతన్ని అసామాన్య బాలకుడుగా భావించి, లాలించారు. తన బాల్యములోనే తను గొప్ప చిత్రకారుణ్ణి కావాలని వెస్ట్ నిశ్చయించుకున్నాడు "రాజులకి, చక్రవర్తులకి సహచరుడు"గా ఉండే చిత్రకారుడుగా ప్రసిద్ధికెక్కాలనే అతని చిన్ననాటి కలలు సమగ్రంగా ఫలించాయి అతను తన ఇరవయ్యో ఏటే ఫిలడెల్ఫియాలో గొప్ప రూప చిత్రకారుడుగా ప్రసిద్ధికెక్కాడు అతను ఇటలీలో కళాశిక్షణను పూర్తి చేసుకోవడంకోసం చందాలు పోగుచేయబడాయి రోము అతనిని "అమెరికన్ రాఫేల్"గా ఉద్ఘోషించింది 1763 లో లండనులో స్థిరపడి అతడు త్వరలోనే జార్జి III కి ఘనిష్ఠ మిత్రుడయాడు, ఆస్థాన చిత్రకారుడుగా అయాడు రాయల్ ఎకాడమీ కళాకేంద్రానికి రేనాల్డ్స్ తరు

పాత అతను అధ్యక్షుడై వెస్ట్‌మిన్స్టర్ అబ్బీలో అంత్య సంస్కారాన్ని పొందాడు

సున్నితమైన అలవాట్లుగల వ్యక్తి, గంభీరంగా, అందంగా ఉంటాడు, నైతిక వర్తనంలో జాగ్రత్తగలవాడు చిన్నపిల్లవాడుగా ఉండగానే వెస్ట్ తన ప్రతిభని గుర్తించాడు ప్రపంచంకూడా అతని ఈ అభిప్రాయాన్ని పంచుకుంది తరువాత వచ్చిన అట్లాంటిక్ యాత్రికుల వలె అతను యూరోపియన్ కళా సాంప్రదాయాలను పట్టుకొని వేళ్లాడ లేదు అతను అటవీ ప్రదేశము నుండి చూచి జయించుటకు వచ్చిన కావ్య నాయకుడు యూరోపియన్ కళా ప్రగతి పథంలో ముందడుగు వేసే ఈ మొదటి అమెరికన్ చిత్రకారుడు సర్వోచ్ఛశిఖరమును అతి త్వరలో ఆరోహించగలిగాడు రాబోయే అర్ధ శతాబ్దిలో ప్రకాశించే సాహసికి ఆత్మల్ని చేరుకోగలిగాడు ఈ పథాన్నే యూరోపియన్ చిత్రకార బృందం అనుసరించింది ఈ మార్గదర్శకిత్వానికి వ్యక్తిగత కారణాలే గాదు, విశాల సాంస్కృతిక కారణాలుకూడా ఉన్నాయి,

ధనికవర్గానికి సంబంధించిన సాంఘికశక్తి ప్రతిచోటా పతనావస్థకి వచ్చింది ప్రాచీనసాంఘిక సాంప్రదాయం ఎన్నడూ వేళ్లపాతుకోని అమెరికాలో మొట్టమొదటిసారిగా ఈమార్పువచ్చింది వలసప్రదేశాలలో సనాతనంగా భావించబడే అభిప్రాయాలు యూరప్‌లో ప్రగతిశీలంగా భావించబడేవి ఇటలీలోనూ, ఇంగ్లాండులోనూ నిలదొక్కుకొనినసాంప్రదాయక కళానైపుణ్యాలు అమెరికన్ వారసులలో లోపించాయి తన మాతృభూమి నుండి కొనివచ్చిన అభిప్రాయాలని వ్యక్తపరచడానికి వెస్ట్ ఈ నైపుణ్యాల్ని వినియోగించుకొన్నాడు లక్షలాదిగా యూరోపియన్ హృదయాల్లోంచి పైకి ఉబికే అభిప్రాయాలను కేన్వాసు మీదికి ఎక్కించిన వాళ్ళలో అమెరికన్ ఒకడు,

సామంత సాంప్రదాయం తనశక్తిని గతంలోంచి వారసత్వంగా పొందుతోంది- ఒక వ్యక్తి తండ్రి రాజు కనుక ఆ వ్యక్తి రాజవుతున్నాడు- కాని మధ్యమ తరగతివారు స్వయం కృషి వల్ల పైకివచ్చినవారు కనుక



4

పర్తమానాన్ని అనుసరిస్తున్నారు. ధనిక చిత్రకారులు అమరత్వం చెందిన పీరుల్ని ఆరాధించారు వారు సమకాలీన సంఘటనలను వ్యక్తపరిచ వలసి వచ్చినప్పుడు గ్రీక్ దేవతలు ఆధునిక రాజులను ఆశ్రయించినట్లూ, సేనాయలకును రోమన్ దుస్తులలోనూ చూపడం ద్వారా చిత్రానికి ప్రాచీనత్వాన్ని ఆరోపించడానికి ప్రయత్నించేవారు జెనరల్ వొల్ఫ్ మృత్యువు అనే చిత్రాన్ని చిత్రించేటప్పుడు వెస్టను జార్జి III, రేనాల్డ్స్ బ్రిటిష్ సైనికులను వాస్తవంగా వారు ధరించిన ఎరుపు దుస్తులలో బూట్లతో చూపించవద్దని వారించారు ఈ చిత్రం ఫ్రెంచి రెడ్ ఇండియన్ యుద్ధ సమయంలోని క్విబెక్ ముట్టడి లోని ఒక దృశ్యం. అట్టి వాస్తవికత సామాన్య ప్రజల కోసం చిత్రించే మొరటు చిత్రకారులకి మాత్రమే తగినదని వారు వాదించారు కాని అమెరికన్ చిత్రకారుడు చలించ లేదు తత్ ఫలితంగా అతను చిత్రించిన చిత్రం సమకాలికమౌటయేగాక ఒక గొప్ప కళా విప్లవాన్ని కలిగించింది. తరువాత వెస్ట్ పూర్తిగా మధ్యమ తరగతి దృశ్యాన్ని పూర్తిగా మధ్యమతరగతి నీతిబోధకంగా చిత్రించాడు. యుద్ధంతో సంధిచేసుకోడంలోని లాభాన్ని చూపించడకోసం 'రెడ్ ఇండియన్లతో విలియం పెన్ సంధి (చిత్రం 6) అనే చిత్రంలో తన జన్మస్థలమైన పెన్సిల్వేయాలోని శాంతిపూర్ణ వాతావరణని చూపించాడు

చిత్రకళ సమకాలీన వీరులని సామాన్య ప్రజలలోంచి ఎన్నుకొంటుందనే విషయాన్ని వెస్ట్ ప్రత్యక్ష పరిచాడు ఈ విధంగా అతను కళారంగంలో ఆధునిక విధానానికి సంబంధించిన అనేక కొత్త పోకడలను ముందుముందు ఫ్రెంచి చిత్రకారులు అవలంబిస్తారనే విషయాన్ని అనేక విధాల వ్యక్తపరిచాడు ఎంగ్రేవింగ్ల రూపంగా విస్తృతప్రచారం పొందిన తన చిత్రాలకి తోడుగా వెస్ట్ తన వ్యక్తిగత ప్రభావాన్ని జోడించాడు అతను ఉజ్వల కళాచార్యుడుగా ప్రసిద్ధికెక్కాడు అమెరికాలోనూ, ఇంగ్లాండులోనూ ప్రసిద్ధికెక్కిన ప్రతి యువచిత్రకారుడూ అతని పాద సాన్నిధ్యంలో శిక్షణ పొందినవాడే.

వెస్ట్ ఎంత మౌలిక విచారశక్తి కలవాడైనా ప్రథమ శ్రేణికి చెందిన చిత్రకారుడు కాదన్నది మాత్రం మనం ఇక్కడ గుర్తుంచుకోవాలి

అతని తరంవారు అతని కళానైపుణ్యానికి విముగ్ధులై అతన్నిగొప్పగొప్ప పూర్వాచార్యులతో పోల్చారు. కాని నేడు అతని చిత్రాల్లోని కొత్తదనానికి ముగ్ధులయే పరిస్థితిలేదు అతను అసామాన్య బౌద్ధిక శక్తి కలవాడవటం చేత 'భావోద్వేగంతోనూ, సౌందర్య లిప్సతోనూ వాళ్లు'మరచి తన అభిప్రాయాల్ని వ్యక్తపరచలేదు అతని వర్ణాలు సుస్నిగ్ధాలు కావు. అతని వ్యక్తీకరణం అతి సరళమైనది అతని ఆకార ప్రకారాలు యథాతథంగా ఉండి శక్తిని గోల్పోయాయి

ఈ విధంగా పుట్టుకతోనే చిత్రకారుడైన కాప్లీ లండను జేరుకొని వెస్టని అతనిస్వంత క్షేత్రంలోనే అతన్ని అధిగమించగలిగాడు చింతనశీలిగాగాక భావుకుడుగా కాప్లీ కూడా అమెరికాలోని అభ్యుదయ సంఘంలో రూపొందాడు అతనుకూడా యూరోపియన్ల సమకాలీనతని దాటిన చిత్రాల్ని సృష్టించాడు అతి సల్పకాలంలో పూర్వాచార్యుల రచనా విధానాల్ని అద్భుతంగా ఆకళించుకోగలిగిన కాప్లీ చూస్తుండగానే ఇంగ్లాండులోని నాటకీయ దృశ్యాల్ని ఉజ్వలంగా వ్యక్తపరచగల ప్రసిద్ధినిపొందాడు

19 వ శతాబ్దపు ప్రముఖ కళా దృష్టికోణం శృంగారవాదం చరిత్రకారుల ఉద్దేశంలో ఫ్రెంచి చిత్రకారుడు జేరికాల్ట్ 1819 లో పారిసు ప్రదర్శనం కోసం చిత్రించిన "దిరాఫ్ట్ ఆఫ్ ది మెడుసా" (The Raft of the Medusa) తో ప్రారంభమైంది కాని ఇంతకు 41 ఏళ్లపూర్వమే జేరికాల్ట్‌కి స్ఫూర్తిదాయకంగా ఉండగల సరిగ్గా ఇటువంటి చిత్రాన్నే ఒకదాన్ని చిత్రించాడు ధనిక వర్గ విచారధారని మెల్లిగా అధిగమిస్తూ కాప్లీ తన 'బ్రూక్ వాటన్స్, షార్క్' (చిత్రం 8) ని విప్లవకాలానికి అనుగుణ్యంగా భావోద్రిక్త విధానంలో చిత్రించాడు ఒక దుష్ట జల జంతువుచే గ్రసించబడే ఒక నగ్న బాలుడు, ఒకచిన్న నావలో ఇరుక్కొన్న ఒక మనుష్యుల గుంపు, తెడ్డుతో జంతువుని ఎదుర్కొంటూ, చిత్రించబడింది కాప్లీ ఈ భయంకర దృశ్యాన్ని చిత్రించడానికి తగిన కారణం ఉంది అతను చిన్నపిల్లవాడుగా ఉన్నప్పుడు బోస్టన్ రేవులో సముద్రంతో పరిచయం ఏర్పడి ఇట్టి అమానుష దృశ్యాలకి స్ఫూర్తినిచ్చింది వెస్ట

చిత్రాలవలె ఈ చిత్రం ఒక వీరుణ్ణి ప్రశంసించడంగాని, ఒక నీతిని బోధించడంగాని చెయ్యడంలేదు, దర్శకుణ్ణి భయంతో కంపింప జెయ్యడమే కాప్లీ ఉద్దేశం ఇట్టి స్పష్ట భావ వ్యక్తీకరణం పద్దెనిమిదో శతాబ్ది సిద్ధాంతవాదానికి విరుద్ధమైనది రంగులు పూసుకొని ఈకలు కట్టుకొని చిత్రకారుడు లండను వీధుల్లో నాట్యమాడినంతటి అపరాధమిది.

మూడవ జార్జితో స్నేహంగా ఉన్నప్పటికీ వెస్ట్ అమెరికన్ దేశభక్తుడుగానే ఉండిపోయాడు బహిరంగంగా వాషింగ్టన్‌ను పొగిడేవాడు రాజు అతని చిత్తశుద్ధిని గౌరవించేవాడు. కాని వెస్ట్ ఇంగ్లీషు అపజయాల్ని చిత్రించడానికి పూనుకోడంతో అతను చాలాదూరం వెళ్లాడని రాజు తలచాడు ఆ చిత్రకారుడు అమెరికన్ విప్లవ గౌరవాన్ని తన శిష్యుడైన జాన్ ట్రంబుల్‌నకు అప్పజెప్పాడు

కనెక్టికట్ లోని ఒక ధనవంతుని కొడుకవడంవల్ల ట్రంబుల్ కళ శారీరిక పరిశ్రమ అవడంవల్ల పెద్దమనుష్యులకి తగని నీచవృత్తిగా భావించే ధనికవర్గ విచారధారలో పెరిగాడు అయినా అతను స్వాభావికంగా ప్రతిభావంతుడు అతని 'స్వాతంత్ర్య ఘోషణాగానం' ఆ దృశ్యానికి తగిన ప్రభావాన్ని అద్భుతంగా వ్యక్తపరుస్తోంది. అతని 'క్విబెక్ ముట్టడిలో జనరల్ మాంట్‌గోమరీ మృత్యువు' (చిత్రం 7) ఆధునిక కాలంలోకూడా గొప్పచిత్రాలలో ఒకటిగా భావించబడుతోంది ఆకారాలు గంభీరమైనప్పటికీ, వర్ణాలు ఉజ్వలమైనప్పటికీ భీభత్సానికీ, కీర్తికీ సమ్మిశ్రణమైన ఈ చిత్రంలో ఒక విధమైన పౌరాణిక సంయమనం కనిపిస్తుంది ఈ యువచిత్రకారుడు ఉన్నత శిఖరాలని అందుకొనే యోగ్యత గలవాడు,

ఐతే అతని పునాదిలోని సంకుచితత్వం అతనికి అడ్డు తగిలింది. విప్లవాన్ని రంగుల్లో చూపించి తాను తన ఉన్నత కళారాధన నుండి ఒక మెట్టు కిందికి దిగినట్టుగా భావిస్తో 1789 లో అమెరికాకు తిరిగివచ్చినప్పుడు ట్రంబుల్ తనయీదేశభక్తి పూర్ణమైన త్యాగానికి సమగ్రదేశీయ సహాయం తనకి రావాలని ఆశించాడు ఐనా తను వ్యక్తపరచిన సౌమ్య

వాద అభిప్రాయాలకి అతను ఆంతరంగికంగా విరుద్ధమవడంచేత గొప్ప ప్రజాసామ్య నాయకుడైన జెఫర్సన్ చేసిన విందులో చాలా అసభ్యంగా ప్రవర్తించాడు ఒక అతివాద సెనేటర్‌తో వాదిస్తో అతడు తన ప్రతివాదిని అతని అపవిత్ర భావాలని తృప్తి పరుచుకోడం కోసం అతడు ఎంత దుర్మార్గత్వానికేనా తయారుగా ఉన్నాడని నిందించాడు 'సర్, పత్నీ సోదరీ పుత్రికల గౌరవాన్ని ఇటువంటి వ్యక్తి చేతుల్లో అప్పగించడానికి నేనెప్పుడూ వప్పుకోను మన పరిచయం ఇంతటితో ఆఖరు' అతను హాలులో పెద్ద అంగలు వేసుకుంటో తిరిగి జెఫర్సన్ మీద లేనిపోని అపవాదులు ప్రచారం చెయ్యసాగాడు. మితవాద నాయకులు అతని ప్రాజెక్ట్‌కి సహాయం చెయ్యడం మానెసెయ్యడంతో అతను తన కుంచెల్ని కింద పెట్టెశాడు ఆమెరికాలో చిత్రకళకి ఎట్టిఆశలేదని అతనుఅరిచాడు. అతను రాజాకీయాలని వ్యాపారంతో ముడిపెట్టాడు అనేక సంవత్సరాలు తరువాత సంఘంలో గౌరవపూర్ణమని భావించబడే వృత్తులలో అసఫలుడై మళ్ళీ బొమ్మలు వెయ్యవలసిన స్థితికి వచ్చాడు అప్పటికి బొమ్మలు వేసే శక్తి అతనిలో పూర్తిగా నశించింది

యూరప్ లో పనిచేస్తోన్న అమెరికన్ చిత్రకారులు నాటకీయ దృశ్యాలలో కూడిన తమ అభ్యుదయ చిత్రాల ద్వారా కీర్తి ప్రతిష్టలు పొందగలిగిన ఆశైలిని యునైటెడ్‌స్టేట్స్‌కి తీసుకురావడంలో వాళ్లు సఫలతనందలేదు వెస్ట్, కాప్లీలు విదేశాలలోనే ఉండిపోయారు ట్రంబుల్ . పరిస్థితులకి లొంగి పోయాడు ఈ దేశంలో కళాసాధనచేసిన ప్రముఖచిత్రకారులంతా వెస్ట్ లండను స్టూడియోలో చాలాకాలం శిక్షణ పొందినవారే ఉత్తమ కళాసాధన కష్టతరమని తెలుసుకోడంతప్ప వారు వాటిని అధిగమించ లేకపోయారు గొప్పచిత్రాల్ని వెయ్యడానికి వారు ముందుకి రాలేదు.

ఛార్లెస్ విల్సన్‌పీల్ (1741–1827) ఒక విడదీయరాని క్లిష్ట సమస్యగా కనిపిస్తాడు మేరీలాండ్ లో వడ్రంగిగా జీవితాన్ని ప్రారంభిస్తో బళ్లు మొదలుకొని టీపాత్రలవరకూ గల అన్ని వస్తువులూ చెయ్యడం అతను నేర్చుకొన్నాడు, ప్రతికొత్తవృత్తి అతన్ని ఇబ్బందుల్లో పడేసింది

అప్పులవల్ల జైలుకి పోకుండా ఉండేందుకు పెరిపోస్తున్న పరిస్థితొచ్చి చిత్రకళని ఆరాధించడం సదుపాయకరమని అతనుకనుగొన్నాడు. ఇతర పనిముట్లకంటె కుంచెల్ని తేలిగ్గా ఒకచోట్నుంచింకొకచోటుకి తీసుకెళ్ల వచ్చు త్వరలోనే అతను చిత్రకారుడుగా ప్రసిద్ధికెక్కాడు. కొంతమంది పెద్దమనుషులు అతనికి లండను, బెంజమిన్ వెస్ట్ వెళ్ళేందుకు డబ్బుసమ కూర్చారు అతను అక్కడ రెండేళ్లున్నాడు తిరిగి 1768లో అతను ఇక్కడికి వచ్చినప్పుడు కొత్త విధానాన్ని తేకపోయినా కొద్దిమార్పులతో కూడిన ప్రాచీన విధానాన్ని తనవెంటతెచ్చాడు మొరటుగా ఉండే వలస ప్రాంత చిత్రకళా రీతులకి యూరోపియన్ నాజూకుతనాన్ని సమకూరుస్తో అతను రూపచిత్రాలు చిత్రించాడు అరవిచ్చిన పువ్వుల్లా అవి ఆకర్షణీ యంగా ఉంటాయి అయితే అవి లండన్‌లో తక్కువరకంగా భావిం చబడతాయన్నది పీల్‌కి తెలియక పోలేదు

విప్లవసైన్యంలో సక్రియ సేవలో ఉంటో మధ్యలో వీధులలో ప్రద ర్శించడానికి పెద్దపెద్ద ప్రచార చిత్రాలు చిత్రించాడు వాటిలో కళ లేదని తెలిసే అతను వాటిపని కాదని వాటిని అవతలపారేసేవాడు శాంతి సమ యంలో అతను కదిలే బొమ్మలని ప్రచారంచేసుకొన్న నౌకాయుద్ధాల్నీ తమ పల్లెపట్టులో చెలరేగే తుఫానునీ, మిల్టన్ పెండిమోనియంనీ, వ్యక్తపరచే పెద్దపెద్ద బొమ్మలాటల కోసం అతను చిత్రించాడు తరువాత ప్రకృతి చరిత్రకి సంబంధించిన మొట్టమొదటి శాస్త్రీయ ప్రదర్శనశాలని అతను స్థాపించాడు ప్రపంచాన్ని చిన్నరూపంలో పునర్నిర్మించడానికి చిత్రించిన, తెరలలో అతను యదార్ధవస్తువుల్ని అమర్చాడు వయస్సు ముదిరినకొద్దీ కొత్త అవసరాలు కనిపించడంచేత పీల్ స్టౌలూ, కళ్లద్దాలూ, కట్టుపళ్లూ కనిపెట్టాడు. చనిపోయేముందుగా పెద్దమనిషిగా తయారవుతాడనే తన మనుమల ఆశల్ని నిరాశచేసి అతను తన అంత్యసమయంలో అమెరికా మొదటి బైసికిల్ మీద కొండల్లో తిరుగసాగాడు. 86 వయేట నాలుగో భార్యకోసం వెతుకుతో శక్తికి మించి పనిచెయ్యడం మూలంగా చని పోయాడు

అతను చాలా రూపచిత్రాల్ని చిత్రించగలిగిన తన సృజనశక్తినంతా పీల్ షణికి వస్తువులను నిర్మించడంకోసం వ్యయపరిచాడు. న్యూయార్క్ స్టేట్ తీరభూమిలో ఆదిమానవుని కాలం నుంచీ ఇప్పటి వరకూ చూడబడని మొట్టమొదటి మేస్టోడన్ యొక్క అస్థిపంజరాన్ని కనుగొన్న సంరంభంలో తన స్వీయానుభవాన్ని వ్యక్తపరచేందుకు అతను చిత్రించిన గొప్ప మానవ సముదాయచిత్రం (చిత్రం 9) నేటికీ నిల్చి ఉంది అతను స్వయంగా ఈ చిత్రం ప్రాముఖ్యతని ఎక్కువగా తీసుకోలేదు అయినప్పటికీ అతను నిర్భయంగా ప్రయత్నం చేసివుంటే అమెరికన్ జీవితంలోని ముఖాలే కాక దృశ్యాల్నికూడ అందంగా అధికారపూర్వకంగా చిత్రించి వుండేవాడన్న సత్యాన్ని ఈ చక్కని చిత్రం వ్యక్తపరుస్తోంది

చిత్రకారులు ఎక్కువ గంభీరమైన చిత్రాల్ని చిత్రించడానికి సంకోచిస్తున్నంతకాలం రూపచిత్రాలు చిత్రకళ ప్రముఖ అంగంగా చలామణీ అయాయి ఇందులో ప్రముఖ సాధకుడు గిల్బర్ట్ స్టూవర్ట్ అతను ఎందుకూ పనికిరాని నశ్యం వ్యాపారి కొడుకైనప్పటికీ, అతను రౌడీ సజ్జుని రెచ్చగొడుతూ వాళ్ళకి నాయకుడుగా న్యూపోర్ట్ తీరభూమిలో పెరిగాడు. ఒక కొత్త చిత్రకళా వైఖరి ఎదైనా ప్రవర్తిల్లినప్పుడు వలసదారులు ఎంతటి అమితోత్సాహంతో దానికి స్వాగతమిచ్చేవారో ఇతని బాల్య చరిత్రని బట్టి మనం తెలుసుకోవచ్చును ఈ బాలుడు బొమ్మలను చిత్రించడం ప్రారంభించగానే అతనికి సహాయంచేయడానికి ఎందరో ప్రముఖ పౌరులు తయారయారు న్యూపోర్టుకి వచ్చిపోతూండే స్కాచ్ కల్పనా సాంప్రదాయానికి చెందిన కాస్మో అలెగ్జాండరు (1724-1772) అను చిత్రకారునితో స్టూవర్ట్ తిరుగుతూ ఉండేవాడు ఈ గురువుతో కలిసి అతను ఎడింబరోకి కూడా వెళ్లాడు అయితే అక్కడ అనతి కాలంలోనే అలెగ్జాండరు చనిపోవడంచేత ఈ బాలుడు ఓడ పని చేసి ఇంటికి జేరుకోవలసివచ్చింది. విదేశ శిక్షణ పొందాననే ఒకవిధమైన గర్వంతో అతను ముమ్మరంగా రూపచిత్రణ సాగించాడు కాని అలెగ్జాండరునుండి పూర్వ సాంప్రదాయిక విధానంలో చిత్రించడానికి అతను నిరాకరించాడని అవి మనకి తేలికగా నిరూపిస్తాయి అక్షరాలా

కొట్టొచ్చినట్లుగా ఉండే అమెరికన్ జాతీయ పద్ధతికి అతి స్వల్పంగా సరళత్వాన్ని ఆపాదించడానికి మాత్రం స్టూవర్ట్ తన గురువు మృదుమధుర శైలిని ఉపయోగించుకున్నాడు

విప్లవం రేకెత్తినపుడు ఈ సాహసిక యువకుడు సముద్రంమీదుగా లండను వెళ్ళి అమెరికాలో తనకి ఖ్యాతి నార్జించిన వికృతి మొరటు రూప చిత్రాలను బ్రిటిష్ పెద్దమనుషుల నెత్తిని రుద్దడానికి ప్రయత్నించాడు, నిరంతర అసఫలతే అతన్ని వెస్ట్ స్టూడియోకి తరిమింది అతనక్కడ తళతళలాడే పట్టుదుస్తులనూ, సజీవమైన మాంస కండరాలనూ యథా తథంగా అనుకరించడం నేర్చుకొన్నాడు నవ్యరచనా విధానాల మేళకు వలు అతని సహజ ప్రతిభని వికసింపజేశాయి అతను చూస్తూండగానే లండనులో అతి ప్రసిద్ధికెక్కిన రూపచిత్రకారులలో ఒకడుగా పేరు పొందాడు

స్టూవర్ట్ యొక్క బ్రిటిష్ సహాధ్యాయులు నెల్లర్‌వలె ఉత్తమశ్రేణి చిత్రకారులుగా కాక ప్రత్యేక వ్యక్తిత్వంతో కూడిన చిత్రకారులుగా ప్రసిద్ధి కెక్కారు కాని వారుకూడా భౌతిక ఔన్నత్యాన్ని వ్యక్తపరచే సుందర దృశ్యాలచేతను, అమూల్య వేషభూషలచేతను ఎక్కువగా ఆకర్షించ బడ్డారు అవసరమని తోచినంతవరకూ అమెరికన్‌లు ఈ శైలిని అనుస రించారు కాని శాస్త్రీయ యదార్థతతో అభ్యసించిన ఆకృతుల ద్వారా పీరు వ్యక్తిగత స్వభావాల్ని వ్యక్తపరచడంలో ఎక్కువ ఆసక్తిని కన బరచారు. అతని రూపచిత్రాలలో అత్యుక్తి ఎంతమాత్రంలేదని అంటూ విమర్శకులు అతను ఇతర చిత్రకారులందరికన్న 'ముఖాన్ని కాన్వాసుకి ఎక్కించడంలో చక్కని నైపుణ్యంగలవా'డని ఒప్పుకున్నారు చాలమంది మధ్యతరగతి ఇంగ్లీషువారు వ్యక్తిగత విచిత్ర తత్వాలు చిత్రించబడాలనే తమ అమెరికన్ సోదరుల అభిప్రాయాన్ని పంచుకున్నారు. జమిందారు లతో కాకపోయినా కనీసం పెద్దమొత్తాలలో ఫీజు చెల్లించగల పెద్దమను షులతో స్టూవర్ట్ స్టూడియో ఎప్పుడూ నిండివుండేది కొందరు అతివాద రచయితలు రేనాల్డ్స్ తరువాత స్టూవర్టే బ్రిటిష్ చిత్రకళా విధానానికి




మార్గరెట్ గిబ్స

చిత్రం 1



డీపైస్టర్ బాయ్
చిత్రం 2



ఏన్వ పోల్లార్డ్

చిత్రం 4



హెస్సెలియస్

లాపోం న్సా

చిత్రం ౫



ట్రంబుల్
మాంట్‌గోమరి మృత్యువు
చిత్రం 7



కాప్లి

వాట్సన్, షార్క్

చిత్రం ౮



స్టూవార్ట్

వాషింగ్టన్

చిత్రం 11



ఆల్‌స్టన్
చంద్రికాధవళిత ప్రకృతి
చిత్రం 12



మోర్స్

లఫాయెటీ

చిత్రం 14



ఫీల్డ్
నీలిపిల్లవాడు
చిత్రం 15

నాయకుడుగా రూపొందగలడని నమ్మారు చారిత్రిక చిత్రకళలో వెస్ట్ సాధించినదానినే స్టూవర్ట్ రూపచిత్రకళలో సాధించాడు ప్రాచీన ప్రపంచపు సాంప్రదాయిక విధానాన్ని కొత్త ప్రపంచపు అతివాద విచార ధారతో మేళవించడం ద్వారా అతను యూరోపియన్ ప్రఖ్యాతిని ఆర్జించాడు

త్రీవ రక్త ప్రసారం స్టూవర్ట్‌ని త్రాగుడులోనికి దింపగా త్రాగుడు ఆతన్ని అప్పులలోనికి దింపింది ఆ అప్పులే ఆతన్ని బ్రిటిష్‌దీవులలోంచి వెళ్ళగొట్టాయి 1783-3 సంవత్సరం సీతాకాలంలో స్టూవర్ట్ అమెరికాకు తిరిగివచ్చాడు అక్కడ పోటీ నెదుర్కోవలసిన అవసరంలేకపోవడంచేత ఆతను స్వేచ్ఛగా చిత్రరచన సాగించాడు యూరోపియన్ చిత్రకళాచార్యుల సన్నిధిలో తాను సాధించిన ఉజ్వల చిత్రరచనా కౌశల్యం ద్వారా ముఖాలకే ఎక్కువ ప్రాముఖ్యతనిస్తూ అతను శరీరముల మీదా, దృశ్యావరణముల మీదా చాలా అశ్రద్ధను కనబరచాడు అతని రూపచిత్రాలు మానసిక తత్వాలని సువ్యక్తం చేశాయి కళా ఖండాలుగా రూపొందాయి శారీరక సౌందర్యాన్ని సముజ్వలంగా, స్వచ్ఛందంగా వ్యక్తపరచడానికి అతను అలంకరణ విధానంమీద ఎక్కువగా ఆధారపడ్డాడు "ఈ ప్రపంచంలో శారీరక వర్ణంతో సరితూగగల వస్తువు ఇంకొకటిలేదు రకరకాల పట్టుదుస్తులలోని మధురాకర్షణా, సజీవంగా కనిపించే రోజువుడ్‌లోని మార్దవం దానిలో కనిపిస్తాయి" అని అతనంటాడు

ప్రభువుల రూపచిత్రాలలో సహజస్వభావం కంటే డాబుదర్పాలు ఎక్కువ ప్రాముఖ్యతని కలిగి ఉండాలని సాంప్రదాయం ఎప్పటికప్పుడు ధృవపరుస్తూ వస్తోంది అటువంటిదే నెపోలియన్ రూపచిత్రమొకదానిని గురించి స్టూవర్ట్ అన్నాడు "ఈ లేసు ఎంతనాజూకుగా చిత్రించబడిందీ! ఇంత ఖరీదైన పట్టు ఎవరైనా ఎప్పుడైనా చూశారా? ఇందులో రాజచిహ్నం అద్భుతంగా కుదిరింది అరే! దానికి ఒకతలకూడా ఉందే!" స్టూవర్ట్ చిత్రించిన సుప్రసిద్ధ 'వాషింగ్టన్' (చిత్రం 11) లో ఒక్క ముఖంతప్ప మనకి ఇంకేం కనిపించదు దృశ్యావరణని పూర్తిచెయ్యడానికి అతను ఎంతమాత్రం ప్రయాస ఎడకపోవడంచేత మనం యునైటెడ్ స్టేట్స్ ప్రెసిడెంటుని చూస్తున్నామని తెలియచేసే బాహ్యాచిహ్నాలేవి

మనకు కనిపించవు మనం అబ్బురపడ్డామంటే దానిలోని సహజస్వాభావికతని చూసే అని చెప్పాలి అటువంటి చిత్రం నిజానికి ఒక నవయుగ సృష్టి. అధికారం వంశ పరంపరగా వ్యక్తికి లభించే వారసత్వంగా ఉన్నంతకాలం గొప్పతనమనేది వ్యక్తిత్వంమీద ఆధారపడి ఉండదు శాసకుని శక్తి అతని వక్తిగత జీవితానికి సంబంధించినదిగానే ఉండాలని నిర్దేసిస్తూ స్టూవర్ట్ హక్కుల చట్టాన్ని ఒక రూప చిత్రంగా అనువదించాడు మనరాష్ట్రపిత చిత్రాలు ఎన్నో విచిత్రమైన పద్ధతుల్లో చిత్రించబడినవి ఉన్నాయి ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా కావాలని స్టూవర్ట్ చిత్రించిన చిత్రాలుకూడా ఇందులో జేరతాయి యూరప్‌లో అభ్యసించిన యునైటెడ్ స్టేట్స్ యొక్క మౌలిక విచారధారకి అనుగుణంగా చిత్రశైలారూపాన్ని పొందిన నిరలంకృతాలయిన ఈ రూపచిత్రాలు జనసాధారణం చేత ప్రేమాదరాలతో ఎన్నడూ మెచ్చుకొన బడలేదు

దేశము స్వాతంత్ర్యాన్ని సాధించిన తదుపరి స్వదేశంలోనూ, పరదేశాలలోనూ ఉన్న అమెరికన్ చిత్రకారులు రచించిన, చిత్రాలు సమకాలీనులచేత మెచ్చుకోబడటమేకాక ఈనాడు రాజకీయ అశాంతితోను కొట్టుకుంటూ కూడా వాళ్ళ ఇంతటి విజయాల్ని సాధించగలిగారంటే శాంతియుత పరిస్థితుల్లో స్వతంత్ర యునైటెడ్ స్టేట్స్ సాహససౌందర్యాల క్రమ వికాసంతో విలసిల్లే స్వతంత్ర సంఘాన్ని ఇతోధికంగా ప్రతిబింబింపజేస్తూ తన చిత్రకళని పెంపొందింప చేసుకొంటుందని మనం ఆశించవచ్చు అయితే భవిష్యత్తు భూతకాలంగా మారే వరకూ ఎన్నడూ నిశ్చితం కాదు

# 3

# అసలు గుణాలూ కల్ర గుణాలూ

వలసదారుల యుగాన్ని విస్మరించిన మొట్టమొదటి ప్రముఖ అమెరికన్ చిత్రకారుడు వాషింగ్టన్ ఆల్‌స్టన్ (1779–1843) దక్షిణ కరోలీనా తోటల యజమాని కుమారుడవడం వల్ల అతను భాగ్యవంతుడు, అందమైనవాడు, ఉదార స్వభావం కలవాడు. అమెరికన్ చిత్ర కళారంగంలో ఇంతవరకూ కనిపించని అలంకార ప్రాయ వ్యక్తి కొత్త జాతి యొక్క వలస వైభవాలు అతని యౌవన జీవితాన్ని ఉద్రిక్తపరిచింది. హార్‌వర్డ్‌లో తన నగ్న వ్యంగ్య చిత్రాల ద్వారా అతను పిమ్న తరగతి వర్గాల్ని విముగ్ధ పరిచాడు చిత్రకారుని అసఫలతకి ముఖ్యకారణం ఆత్మ విశ్వాసంలోపించడమే అని అతను అనేవాడు

1801 లో యూరప్ వెళ్లిన తరువాత అతను కాలెరిడ్జిని కలుసుకున్నాడు అప్పట్లో వర్డ్స్‌వర్త్ సహయోగంతో కాలెరిడ్జి వ్రాసిన భావ గీతాలు ఇంగ్లాండులో మధుర కళోద్యమానికి దోహదమివ్వసాగాయి తన తరువాత వచ్చిన అమెరికన్ చిత్రకారుల వలె ఆల్‌స్టన్ తనమాతృభూమిలోని సాంఘిక ప్రగతివాదం ద్వారా యూరోపియన్ అభ్యుదయ విచారధారని ఆకళించుకునే శిక్షణ పొందాడు చిత్రకారులలో అమెరికన్ ఒక్కడే నవ్యభావస్ఫూర్తితో ప్రకృతిని చిత్రించ సమర్థుడని కాలెరిడ్జి అప్పట్లో స్పష్ట పరిచాడు "భౌతికావరణకి సంబంధించిన మర్త్యాకారాల్ని కాక ఆంతరిక ప్రకృతి జీవితాన్ని సువ్యక్తపరచగల సమర్థుడతడు"

అన్నాడు 'పురాతన నావిక గీతం' వంటి కవితలద్వార రేగిన అద్భుత భావాల్ని రంగులలో బంధించే ఆతురతలో ఆల్‌స్టన్ బౌద్ధిక మైన తాత్విక వ్యక్తీకరణకి స్వస్తి చెప్పి సూటిగా భావోద్వేగాన్ని రేకెత్తించడానికి యత్నించాడు "చర్మ చక్షువుకి అగోచరమైన అనంత భావాలకి" రూపం ఇవ్వడానికి గాయకుడు రాగాలని పలికించేవిధంగా అతను రంగుల్ని మేళ వితంచేయకోరాడు 1819 లో అతను చిత్రించిన 'చంద్రికా ధవళిత ప్రకృతి' ప్రశాంత సుందరమైన ఒకరాత్రిని వ్యక్తపరుస్తోంది అందులో కదిలేమానవాకారాలు ఈ లోకానికి సంబంధించినవిగా కనపడవు ఈ రహస్యమయతని వ్యక్తపరచడం మాత్రంతో ఆగిపోయి ఆల్‌స్టన్ ఇంక ముందుకిపోలేదు ఆ రహస్యతత్వమేమిటో మనమే స్వయంగా తెలుసు కోవాలి రంగుల కలయికలో ఇట్టి భావోద్వేగ శిఖరాల నందుకోడం ద్వారా ఈ అమెరికన్ చిత్రకారుడు డెలాక్రోవంటి భావిఫ్రెంచి చిత్రకారు లని మనకు గుర్తుకి తెస్తారు

వెస్ట్‌కంటె ఆల్‌స్టన్ సతతవ్యాసంగం కల చిత్రకారుడు ఒక విధ మైన నరముల బలహీనతకి గురి కావడంవల్ల అతని వ్యక్తిత్వంలో ఒక సక్రమ పరిణామం ఏర్పడింది అప్పట్లో అతను ఒక ప్రముఖవాద ప్రవ క్తగా రూపొందే లక్షణాలు కనిపించాయి మొదట్లో ఈ పరిణామం అతని రచనా కౌశల్యానికి భంగ కరంగా లేక పోవడమే కాక వెనిషియన్ కళా చార్యుల ననుకరించకుండానే అద్భుతమైన మానవసముదాలని చిత్రించే తమకంలో అతను ప్రకృతి దృశ్య చిత్రణ యెడ తనకుగల వ్యామో హాన్ని అణచుకోగలిగాడు పాత బైబిల్ కి సంబంధించిన అమానుష ఘటనలని పునర్నిర్మించే అతని విధానం ఇంగ్లీషు అభిరుచికి అనుగుణ్యంగ కన్పించింది లండనులో అతని చిత్రాలకి బహుమతులు రావడం ద్వారా అతను సుప్రసిద్ధవ్యక్తి అయాడు

1818 లో అతను మెసచూసెట్స్‌కి తిరిగి వచ్చినప్పుడు "బెల్ షజ్జర్ విందు" అనే అసంపూర్ణ చిత్రాన్ని వెంటతెచ్చాడు అప్పటికే అది ఎంతో ప్రసిద్ధికెక్కిన దవడంవల్ల బోస్టన్ పౌరులుదాన్ని కొనుక్కోడా నికి అతి ఉత్సాహంతో 10,000 డాలర్లు పోగుచేశారు అతి కృతజ్ఞతతో

చిత్రకారుడు ఆ చిత్రాన్ని పూర్తిచెయ్యడానికి పూనుకొన్నాడు కాని అది పూర్తికాలేదు అతను ఎంతో ఎక్కువ శ్రమపడికొద్దీ అంతగా ఆ చిత్రం గందరగోళంలో పడిపోయింది అతనిలో కంగారు ఎక్కువ కాసాగింది. "ఒక రాక్షస హస్తం నా చిత్రంలోంచి ముందుకి చాచుకుని నన్ను నేల లోకి అణగద్రొక్కేస్తున్నట్లుగా అనిపించేది" అని ఆతడు అనేవాడు. "బెల్ షజ్జర్ విందు" ఏళ్లు గడచిన కొద్దీ అతని శక్తిసామర్థ్యాలని నశింపజేయసాగింది కాని అతను మరణించినప్పుడు అతని ప్రాణ స్నేహితుడన్న మాట గమనార్హము "ఈ మృత్యువువల్ల భీభత్స దృశ్యమూ, భయంకర స్వప్నమూ, ప్రాణాంతకమూ అయిన అసంపూర్ణ చిత్రం పీడ అతనికి వదిలింది" అది ఈనాటికీ సగం సగం రూపుమాసిన అసంబద్ధ అకారాలతో ఆ చిత్రం అలాగే ఉంది

కాకతాళీయంగా సంయుక్తరాష్ట్రాలకి తిరిగి వచ్చిన క్షణంనుంచీ ఆల్స్టన్ కళాకౌశలం నశించడాన్ని పురస్కరించుకొని, ఆ తరువాతి ప్రవాసులు హెన్రీ జేమ్స్ అన్నట్లు "అమెరికాలోని క్రూరవాతావరణలో చిత్రకళ క్షీణించి పోతుం"దన్న నిర్ణయానికి వచ్చారు కాని వాస్తవానికి విదేశాల్లో ఉండగానే ఆల్స్టన్ కష్టాలు ప్రారంభమయాయి యూరోపి యన్ జీవితంతో సరియైన ఐక్యత పొందలేని పరిస్థితిలో అతను చాలా అశాంతిని అనుభవించాడు ఆఖరుకి కట్టలుతెగిన దేశభక్తితో అతను స్వదేశానికి వచ్చేశాడు కాని సంయుక్తరాష్ట్రాలు తనకి అసహ్యకరమైన పద్ధతుల్లో నడుస్తూన్నట్లు అతను కనిపెట్టాడు వ్యాపార సంస్కృతికి విరుద్ధంగా దండెత్తిన తను తన స్వంత ఆస్తి పోవడంవల్ల ధన సంపా దనకోసం చిత్రించవలసి వచ్చినందుకు అతను చాల చిన్న బుచ్చుకున్నాడు ఏ కొద్దియుద్ధ సంఘటనలోతప్ప అమెరిన్ చరిత్రలో చిత్రించడానికి యోగ్యమైన ఘటనలే లేవని అతను వాపోయాడు మెస్సచుసెట్స్ పల్లెపట్టులో అతను స్పేనిష్ బాలికలనీ శిధిలావశేషాలతో నిండిన ఇటా లియన్ పర్వతాల్ని చిత్రించాడు "నేను నా దేశపు బలహీనతల నెరు గుదును వాటి విషయంలో నేను బాధపడినంతగా బాధపడేవాళ్లు చాల తక్కువమంది ఉంటారు మన ప్రభుత్వ విధానంమీద నాకున్నంత

తప్పక వ విశ్వాసం కలవాళ్లుకూడ ఎక్కువమంది ఉంటారు' అని ఒక నొక సందర్భంలో పేర్కొన్నాడు. తను యాత్రలుచేసిన పాతప్రపంచం తోటి తను తిరిగిజేరుకొన్న కొత్త ప్రపంచంతోటి ఆల్‌స్టన్ సంబంధం లేకుండా అయిపోయాడు మూలోచ్ఛేదితమై అతనికళ క్షీణించింది

కాలం గడచినకొలది ఆల్‌స్టన్ నిష్ఫల జీవితగాథ అతని ప్రసిద్ధిని ఇనుమడించింది సంస్కృతిని గురించి గొప్పగా మాట్లాడే అమెరికనులు ఆల్‌స్టన్ కళాదర్శానికి విముగ్ధులై పోయారు కయ్యానికి కాలుదువ్వే ఈ కొత్త దేశంలో తమ వలెనే అతనూ అసంతృప్తుడుగా ఉండి చిత్రరచన చెయ్యలేకపోవడం వారికి గర్వకారణమైంది భావుకత్వానికి ప్రమాణంగా అతను అసఫలుడవడం, తద్వారా అతనిలోని చిత్రరచనా శక్తి నశించడం ద్వారా అతను అమెరికా ఏకైక ప్రముఖ చిత్రకారుడుగా భావించబడ్డాడు

ఆల్‌స్టన్ ప్రియ శిష్యుడు శామ్యుయల్ ఎఫ్ బి మోర్స్, (1791-1872) తాను ముందు ముందు టెలిగ్రాఫ్‌ని కనిపెడతానన్న విషయాన్ని ఇంకా కలగనని ఉత్సాహవంతుడైన చిత్రకారుడతను సుప్రసిద్ధ మతాచార్యుడైన అతని తండ్రి చిత్రకళ తనకొడుకు వంటివానికి తగిన వృత్తి కాదని తలచాడు అమెరికన్ చిత్రకారులు సాంప్రదాయికంగా స్వయం శిక్షితులైన పరిశ్రామికులు అయితే సుసంస్కృతుడైన ఆల్‌స్టన్ ప్రత్యక్ష ప్రమాణంగా ఉండడాన్నిబట్టి అతని తండ్రి ఏదో విధంగా సమ్మతించాడు తన గురువుతో లండను జేరిన ఆ యువకుడు సంయుక్తరాష్ట్రాలలోవలె గాక ఇంగ్లాండులో చిత్రకళకి సముచిత స్థానమున్నదని తెలుసుకున్నాడు. అమెరికాలో చిత్రకళ నిమ్న తరగతి వ్యక్తులకు మాత్రమే తగినవృత్తిగా భావించబడుతూండగా ఇంగ్లాండులో ఉన్నత తరగతికిచెందిన మహిళలు నిస్సంకోచంగా బహిరంగంగా చిత్రించ బడడాన్ని బట్టి చిత్రకళకి ఎట్టి ఉన్నతస్థాన మియ్యబడిందో అతనికి తెల్సింది

తన ముందుతరం అమెరికన్లకు రూపచిత్రణమే ప్రధానోద్దేశ్యంగా రూపొందినప్పటికీ మోర్స్ దానిని చాల నీచవృత్తిగా భావించాడు "కళని

వ్యాపారంగా చేసేటంతటి అధమస్థితికి నేనెన్నడూ రాను గౌరవయుతంగా నేను జీవికని గడపలేకపోతే గౌరవయుతంగా నేను తిండిలేకమాడతాను రాఫేల్, మైకేల్ ఎన్జిలో, టిటియాన్ వంటి ప్రతిభావంతులు నెదుర్కొన గలిగి 15 శతాబ్ది వైభవాన్ని తిరిగి ప్రతిష్ఠాపించగల గొప్పచిత్రకారు లలో ఒకడుగా ఉండడం నా మహదాశయం" అంటూ అతడు తన కళా దర్శాన్ని వ్యక్తపరిచాడు తన మత విశ్వాసానికి అనుగుణ్యంగా మత సంబంధ విషయాల్ని గ్రహించడానికి ఇష్టంలేక తన అపరిపక్వ మాతృ దేశాన్ని వ్యక్తపరిచే భావాలని దరికి రానివ్వకుండా మోర్స్ 'మరణిస్తూ న్న హెర్క్యులస్' 'జూపిటర్ తీర్పు' అనే చిత్రాల్ని చిత్రించాడు 1815 లో ఆర్థిక పరిస్థితులకి లోనై సంయుక్త రాష్ట్రాలకి తిరిగివచ్చి నప్పుడు అతను వెనకపడిన తన దేశస్థులకోసం ఉత్తమ సంస్కృతిని తెస్తున్నానని భావించాడు కాని త్వరలలోనే తనదేశస్థుల అభిరుచి విహీ నులని అతనికి తెలిసింది—అధమ పక్షం అతనల్లా అనుకున్నాడు వారు అతని నల్పిత పురాణ మిశ్రమ చిత్రాల్ని కొనడానికి నిరాకరించారు,

పోలికలు వాటికోసం మాత్రమే అని తలుస్తూ గంభీర సాధనకి అవి లగివనే నమ్మకంతో అతను క్రమక్రమంగా తన శక్తుల్ని సంస్థా సంబంధవిషయాల్లో కేంద్రీకృతం చేశాడు 1800 తరవాత కూడ చిత్ర కారులు శిక్షణ పొందడానికీ తమచిత్రాన్ని ప్రదర్శించుకోడానికీ అన్యచిత్ర కారుల చిత్రాల్ని చూడడానికీ అనువైన సంస్థలులేనే లేవు అఖరికి క్రమ క్రమంగా ధనిక పౌరులు ఏకత్రితమై స్థానిక ఎకాడెమీలని స్థాపించారు. వాటికోసం వారు చిత్రాల్నీ, శిల్పాల్నీ దిగుమతి చెయ్యసాగారు. అప్పు డప్పుడు తమ అభిరుచుల కనుగుణ్యమైన అమెరికన్ సమకాలీన చిత్రాల్ని కూడ వాటిలో ప్రదర్శించేవారు చిత్రకారులకీ ఈ నిరంకుశ సంస్థాధికారు లకీ మధ్య 1825 నాటికి ఘోర సంఘర్షణ చెలరేగింది అమెరికన్ లలిత కళా ఎకాడెమీ అధ్యక్షుడుగా జాన్ ట్రంబుల్, చిత్రాకళా శిక్షణాధికారాన్ని కోరిన విద్యార్థులకి "ముష్టివాళ్ళకి నిర్ణయాధికారంలే" దని జవాబిచ్చాడు అనతోడి చిత్రకారుల కంటె తను జన్మతహా ఉత్తముణ్ణని ట్రంబుల్ భావించాడు. కాని అతనితో సమానంగా ఉత్తమకుల సంజాతుడైన మోర్,

తనతోటి చిత్రకారుల్ని తనసహోదా స్థాయికి తెచ్చేందుకు ప్రయత్నించాడు అతను అసంతుష్ట చిత్రకారుల నాయకుడుగా ప్రజాస్వామ్య పద్ధతుల పై జాతియకళా ఎకాడెమీని స్థాపించాడు దాన్ని తమ స్వాధీనంలో ఉంచుకొని ఆచిత్రకారులు ఒక ప్రత్యేక వ్యక్తి స్వార్థసిద్ధికోసం కాక కళాభిమానులందరి ఉన్నతికీ పాటుపడాలని విజ్ఞప్తి చేశారు త్వరలోనే మోర్స్ అధ్యక్షతలో జాతీయ ఎకాడెమీ సంయుక్తరాష్ట్రాలలో మంచి పలుకుబడిగల సంస్థగా రూపొందింది

తన ఉన్నత పదవిలో నుండి మోర్స్ తన అసంతృప్తుల్ని బాగా ప్రచారం చేశాడు విదేశాలలో శిక్షణ పొందిన చిత్రకారుడు హృదయ హీనమైన శుష్కమైన అమెరికా ఎడారికి తిరిగి వచ్చినప్పుడు చిత్రకారునకు ముఖావములో కూడిన ఏకాకి తనానికీ నిరుత్సాహానికీ గురిఔతాడని అటన్నాడు అతని ప్రతిపక్షులు అతని గొప్పతనాన్ని కావాలని తెలిసికోకుండా నిర్లక్ష్యం చూపిస్తున్నారని అతని నమ్మకం యూరప్‌లో పేరుఊరూలేని కొంతమంది అనామకులు ఏదోవిధంగా అమెరికన్లని తృప్తి పరుస్తూ తనను మించాలని ప్రయత్నిస్తున్నారని కూడా అతను వాపోయాడు అతని సమకాలీను డొకడు దీన్ని అవమానంగా తలచి విదేశాలలో శిక్షణపొందిన తన బృందాన్ని మోసపుచ్చడం అంత తేలికకాదని గట్టిగా జవాబిచ్చాడు వాదవివాదాలు చెలరేగాయి అయితే ఇరుపక్షాలవాళ్లూ అమెరికన్ అభిరుచి "జాతీయం" కాదన్న విషయంలో మాత్రం ఏకీభవించారు

అనేక సంవత్సరాల అసంతృప్తి తరువాత తను చిరకాలంగా కోరుకుంటూన్న ఒక గొప్ప చిత్రాన్ని చిత్రించేపని మోర్స్‌కి లభించింది అతి ఆతురతతో అతను కుంచెల్ని చేతికి తీసుకున్నాడు అయితే త్వరలోనే అతను వాటిని కింద పెట్టేశాడు తన గురువు ఆల్‌స్టన్ వలె తను కూడా ఏదో మానసిక సమస్యకి గురిఅయినట్లుగా అతను తెలుసుకున్నాడు తన గొప్ప చిత్రాన్ని ప్రారంభించడంకూడా చేతగాక అతను చిత్రకళని త్యజించాడు, "చిత్రకళ అనేకమందికి క్రూరార ప్రేయసిగా ఉండడం నేనెరుగుదును అయితే అది నా విషయంలో క్రూరార వేశ్యగా పరిణమించింది నేను ఆమెని త్యజించలేదు, ఆమె నన్ను వదిలిపెట్టిం"దని అతను

వాపోయాడు తన ఆదర్శాలు అతి ఉన్నతమైన వవుటచేతనే తనకి అస పలత ప్రాప్తించిందని అతను నమ్మాడు

అమెరికన్ జీవితాన్ని భౌతికమని కొట్టిపారేస్తూ పాతకాలపునాటి చచ్చు సిద్ధాంతాలని బోధించడంద్వారా మోర్స్ తనసాటి పౌరులను బాగు పరచడానికి ప్రయత్నించాడు. కానీ అతను కళను వదిలిపెట్టిన తర్వాత పూర్తిగా భౌతికమైన ఆధునిక వృత్తి పరిశోధన వేపు తన దృష్టిని మర ల్చాడు అప్పుడు అసఫలత సఫలతగా రూపొందింది, అతను టెలి గ్రాఫ్ని కనిపెట్టాడు అతనిలా ఫేటీ (చిత్రం 14)ని బట్టి అతను ఉపయో గితవాదాన్ని అనుసరించినట్లుగా సౌందర్యాన్ని కూడా ముక్కుకి సూటిగా వక్తపరచడానికి పూనుకుంటే అతనెట్టి చిత్రాలు చిత్రించేవాడో మనం గ్రహించగలం ఈ రూపచిత్రానికి గొప్ప ఔన్నత్యాన్నీ స్వాభావిక రీవినీ ఇవ్వడానికి ప్రయత్నిస్తూ మోర్స్ సూర్యుడు అస్తమిస్తూన్న ఆకాశాన్నీ, స్తంభాలలో కూడిన పిట్టగోడనీ, అర్ధశిల్పాలనీ, సుందర పాత్రలనీ, సూర్యకాంతపుష్పాలనీ అందులో సమకూర్చాడు కాని ఈ అలంకారాలన్నీ చిత్రం గొప్పదనాన్ని మరుగుపరుస్తున్నాయి. చిత్రం గొప్పతనం కాల్ప నిక వస్తువులని చిత్రించడంలో గాక యదార్థ జీవితాన్ని చిత్రించడం లోనే ఉంటుంది కొట్టవచ్చినట్లు కనిపించే వాతావరణలో వలెగాక వయ స్సులో ఉన్న ఆ వీరుని ముఖమూ ఆకారమూ, గంభీరంగానూ శక్తివం తంగానూ కనిపిస్తాయి. అమెరికా భౌతిక చిత్రకారులని అనేకమందిని తయారు చేసింది కాని మోర్స్ వారిలో ఒకడుగా చెలామణి అయేందుకు పుట్టలేదు అతని పరిశోధనలు అతని హృదయంలో యదార్థవాది యని మనకు ఋజువు ఎరుస్తాయి, తెచ్చిపెట్టుకూన్న ఎవోలేనిపోని సిద్ధాంతాలు అతని చుట్టూఉన్న సామాన్య జీవితాన్ని అతని చిత్రించకుండా అడ్డుకొని ఉండకపోతే అతను గొప్పచిత్రకారుడు అయేవాడు

వేలు వంచకుండా పైకి ఎత్తడానికి వీలులేని టీ కప్పుతో చిత్రకళ సమానమైనదనే అభిప్రాయం అనేకమంది జీవితాల్ని పాడుచేసింది ఇంకొక ఉజ్వల ప్రారంభకుడు జాన్ వేండర్లిన్ (1775–1852) లండన్లోనో

రొములొనొ కొకి పారిస్‌లో శిక్షణ పొందిన మొదట అమెరికన్ చిత్రకారుడవడంచేత అతను నగ్న చిత్రాలచిత్రణలో ప్రవీణత సంపాదించాడు దీనికి అమెరికాలో ఎక్కువప్రచారం లేదు అమెరికాలో ఇది అసహ్యించుకొనబడుతుంది అతని ఏరియానే (చిత్రం 13) తన ప్రేమికుడు ప్రవాసమందున్న ఒక పురాణనగ్న నాయిక నిద్రిస్తూన్నట్లుగా చిత్రింపబడింది 1815 లో అతను దీన్ని స్వదేశానికి తెచ్చినప్పుడు అక్కడివారికది చాలా ఘోరంగా కనిపించింది అమెరికన్ల వాదస్త మొకటే అతని అసఫలతకి ముఖ్యకారణంకాదు అనేక శతాబ్దులుగా యూరప్‌లో పాదుకొన్న కళాబీజాల్ని అమెరికన్ ధరిత్రిలో నాటడానికి వేండర్లిన్ దృఢసంకల్పించుకొన్నాడు ఆబీజాలు మొలకలెత్తినినాడు కొత్త భూమిలో నాటుటకనువైన ఇతరబీజాల్ని అతను వెతకలేదు భూమిగొడ్డుపోయినదని అతను నిర్ణయించాడు "వీధి చిత్రకారుడు తప్ప ఇంకెవరూ అమెరికాలో చిత్రించడానికి అవకాశంలే 'దని వేండర్లిన్ తన ఆత్మని తృప్తిపరుచుకొన్నాడు

మిసిసిపీ, ఓహియో లోయలలో అమెరికా మానవమాత్రునిచే ఎన్నడూ నటించబడని ఒకగొప్ప నాటకాన్ని నటించింది మొట్టమొదట తుపాకులతో అన్వేషకులు వచ్చారు తరువాత గొడ్డళ్లతో కొంతమంది వచ్చారు ఆ తరువాత చక్రాల ఇళ్లన్ కట్టే నిర్మాతలు వచ్చారు కొన్ని సంవత్సరాలక్రితం వరకూ ఆకుల మర్మరధ్వనులతో నిండిన స్థలంలో త్వరలో గొప్పనగరం ధ్వనించింది ప్రాచ్య ఆవాసాలకి ధనం ప్రవహించింది ప్రాచ్య హృదయాల్ని కంపింపజేసె ఆలోచనలు రేకెత్తాయి సరిహద్దుల ఉత్పత్తికి నీడయైన ఆంద్రూ జాక్సన్ వైట్ హౌస్‌కి దగ్గరలో జేరాడు హెర్క్యులస్‌ని కలలుగనే చిత్రకారులు అద్భుత బలశాలియైన పాల్ బనియన్ అడవులలో తిరగడం గమనించలేదు

పరిష్కృత చిత్రకారుల్లో ఒక్క రూపచిత్రకారులే అమెరికాకి సంబంధించిన కొన్ని విషయాలని చిత్రించారు వ్యక్తిగత మహాత్మ్యం మూల జాతీయ లక్షణంగా ఉండడంవల్ల వారి వ్యాపారం అద్భుతంగా సాగింది అయినా మోర్స్ వంటి ఆదర్శాన్నిగాక యథార్థతని వ్యక్తపరచే పోలికలు నిమ్నశ్రేణికి చెందిన కళగా భావించడం వారుకూడ తమ ఆద

ర్థంగా పెట్టుకున్నారు తమ వ్యక్తిత్వాన్ని వ్యక్తపరిచే ఒందడిలో వారు రూపచిత్రాలకి కూర్చునే వ్యక్తుల్ని తృప్తిపరచలేక పోయారు మేథ్యూ హారిస్ జౌట్ (1788–1827), రెంబ్రాంట్ పీల్ (1778–1860) వంటి చిత్రకారులు అలంకరణ లేని ముఖాలని ఉన్నది ఉన్నట్లుగా చూపించడంలో అమెరికన్ కౌశల్యాన్ని మనకి వ్యక్తపరుస్తారు అయితే వారు ఉత్తమ కళాదర్శాన్ని అందుకోడానికి ప్రయత్నించడం అనవసర కాల వ్యయమని భావించారు, ఏకాకారానికి అమర్చిన అంగాలుగాక తీవ్రయాదార్థ స్థితిని వ్యక్తపరచడం 19వ శతాబ్దపు రూపచిత్రకళయొక్క విశిష్టతత్వం

థామస్ సల్లీ (1783–1872) ఇందుకు వ్యతిరేకంగా కనిపిస్తాడు ప్రత్యక్ష దృశ్యాన్ని కాక అతను చిత్రప్రభావానికి ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చాడు కాని అతనిలో కూడ గంభీరత లోపించననే చెప్పాలి ఫియాం కాగాపేనీ కెంబల్ (చిత్రం 16) ని మనం చూడగానే అతను చిత్రించిన ఆ నాటక నాయకిని మనం ప్రేమిస్తాం. కాని సరిగా చూస్తే అందులోని శూన్యత్వం మనకి వ్యక్తమౌతుంది ఉజ్వలకాంతి, గొప్ప తూలికా నైపుణ్యం, ఉన్నప్పటికీ సల్లీ తన సోదరిని గొప్ప నటీకురాలుగా చేసిన భావోద్వేగం యొక్క లోతుని అతను చూపించలేక పోయాడు సల్లీ చిత్రాలు అవ్యక్తితో కూడుకొని యుండడచేత సౌందర్యాన్ని గోలు పోయాయి అతనొక చక్కని చిత్రకారుడు

ప్రముఖ చిత్రకారులెవ్వరికీ తమముందు తరాల అమెరికన్ చిత్రకారుల విషయం పట్టినట్టు కనిపించదు అమెరికన్ రూపకళాపితామహుడైన గిల్బర్ట్ స్టూవర్ట్, కాప్లీ బోస్టన్ చిత్రాల్ని హేళన చేశాడు శారీరకవర్ణాలు ''రంగువేసిన చర్మాల''వలె ఉంటాయనిఅతనన్నాడు 1810లో సంయుక్త రాష్ట్రాల చిత్రకార సమితి యేర్పడినప్పుడు అక్కడ జేరిన చిత్రకారులంతా వెస్ట్ యూరప్ వెళ్లినప్పుడే అమెరికన్ కళా ప్రారంభమైందని అంగీకరించారు మన సుప్రసిద్ధ చిత్రకారులనేకమంది కావాలని తమ స్థానిక సంబంధాలని తెగ తెంచుకున్నారు

అయితే స్వల్ప ఆర్థిక స్థలంలో కాలనీల దృక్కోణం జయించిం దనే చెప్పాలి తమ యింటికి వచ్చిన దేశద్రిమ్మరులైన చిత్రకారులదగ్గర సామాన్య ప్రజలు రకరకాల బొమ్మలు కొంటూ ఉండేవారు ఒక్కొక్క ప్పుడు చిత్రాల మూల్యానికి బదులుగా భోజన వసతి, సదుపాయాలతో చిత్రకారులు సంతృప్తి పొందేవారు అనాటి చిత్రాలకి అమెరికన్ ప్రారం భిక చిత్రాలని పేరు వచ్చింది ఇట్టి చిత్రాలని కళాభిమానులు బాగా సేక రించేవారు ఎరస్టస్ శాలిస్టరీ ఫీల్డ్ (1805—1900) అనే కనెక్టికట్ చిత్ర కారుడు చిత్రించిన నీలి పిల్లవాడు (చిత్రం 15) ఇట్టి చిత్రాలకి చక్కటి ఉదాహరణ ఇది 1840 లో చిత్రించబడినా దానికి చాలా పూర్వం చిత్రిం చబడ్డ ఏన్ పోల్లార్డ్ (చిత్రం 4) వంటి చిత్రాలను పోలి ఉంటుంది ఇది ఎంతవరకూ ప్రత్యక్ష ప్రభావ ఫలితమో లేక స్వతంత్ర వికాసమో చెప్ప డం కష్టం అన్నికాలాలలో అన్నిచోట్లా అశిక్షిత చిత్రకారులు ఈ పద్ధ తిలో చిత్రించడం సహజం చిన్న పిల్లలవలె వాళ్ళు ముందు రేఖా చిత్రాన్ని చిత్రించి దాన్ని రంగులతో నింపుతారు, క్లిష్టమైన ప్రకృతినుంచి వారు అత్యవసరమని తోచిన కొన్ని వివరాలని మాత్రమే తీసుకుంటారు, వాటిని బల్ల పరుపు ఆకారాలో వ్యక్తవరుస్తారు కాన్వాసుమీద ఒకదాని పక్క ఒకదాని నమర్చడం వల్ల ఈ ఆకారాలు కంటికి తృప్తికరంగా కన్పిస్తాయి దానికి కారణం అవి యదార్థతని ప్రతిబింబిస్తున్నాయనికాదు. ఆకారాలను మళ్ళీ మళ్ళీ రకరకాల విదానాల్లో అమర్చడమే దీనికి కార ణం, అందుచేత నీలి పిల్లవాని చెవులు అమానుషంగా కనిపిస్తున్నా అతని దుస్తులతో అవి చక్కగా మేళవితమౌతున్నాయి

వలసయుగంలో చిత్రకారులంతా ఇతర సంపర్కం లేకపోవడం వల్ల ఆదిమ విధానాలలో చిత్రించేవారు. ప్రస్తుతం ముఖ్య నగరాలన్నిట్లో కళా ఎకాడెమీలు ఉన్నాయి, కుశల చిత్రకారులూ ప్రముఖ చిత్రాలూ దేశ మంతటా వెదజల్లబడి ఉన్నాయి చిత్రకారుడు ఆదిమ స్థితిలో ఉండవల సిన ఆవసరంలేదు. విమర్శకులుకూడా అతన్నావిధంగా ఉండమని కోర డంలేదు. సరళత్వాన్నీ అపశ్రుతినీ ఆకళించుకొన్న 20 యో శతాబ్దంతో 19 వ శతాబ్దం అంగీకరించలేదు. చిత్రకారుడు ఎదురుగా కనిపిస్తూన్న

వస్తువు యదార్థమైనదని కన్ను మోసపోయేట్లా చెయ్యడం 19 వ శతాబ్దం ఆదర్శం ఆదిమ చిత్రకారులు స్వయంగానే తమని ఎందుకూ పనికి రాని చేతిపనివారిగా భావించుకునేవారు వారిలో అనేకమంది శిక్షణఅంటే ఏమిటో తెలుసుకోడానికి తాపత్రయ పడేవారు వీలైనంత త్వరలో వారు నాజూకు పరిస్థితిల్లోకి జేరుకొనేవారు సమర్థుడైన చిత్రకారుడు ఆదిమ పరిస్థితిలో ఉన్నాడంటే కావాలని భావుకత్వం వల్లగాక వేరే కారణాల చేత అల్లా ఉండి వుండేవాడు

ఉదాహరణకి ఎడ్వర్డ్ హిక్స్ (1780–1849) మతవిషయికంగా పట్టుదలకలవాడు పెన్సిల్వేనియా రైతుకి బిడ్డగా అతను కోచిబండ్ల వడ్రంగికి సహాయకుడుగా జేరాడు తరువాత సైన్ బోర్డుల చిత్రకారుడుగా తయారయాడు ఏపిల్ పళ్లుకోయుట, బట్టలునేయుట, అగ్గిపెట్టెలు తయారుచేయుట, మొదలైన అనేకరకాల తక్కువ వృత్తులను చేబట్టుటచే హిక్స్ ఒక విధమైన పశ్చాత్తాపముతో ఇతర ప్రారంభకులంతా ఉన్నత శిక్షణను పొందే సమయంలో అతను తీవ్ర మతవిశ్వాసముగల వ్యక్తిగా తయారయాడు అసలైన క్రిష్టియన్ దృష్టికోణంతో చిత్రకళ మంచివృత్తి కాదనీ దురాశా గర్వమూ గలవారి వృత్తి అనీ అతను నమ్మాడు కుంచెలు విసర్జించి అతను భూమిని సంపాదించాడు కాని అతని పొలాలకి తెగుళ్లు తగిలాయి తనలో మతోపదేశం, శక్తి అద్భుతంగా ఉందని తెలుసుకొన్న క్షణంలో దారిద్ర్యం ఆవరించుకోడానికి తయారుగాఉంది అప్పట్లో అతను తనయందు శ్రద్ధా భక్తులుగల ప్రజలకి సంయుక్త రాష్ట్రాలలోనూ కెనడాలోనూ తిరుగుతూ భగవద్విషయాన్ని ప్రచారం చెయ్యడంద్వారా ప్రసిద్ధికెక్కాడు

కాని హఠాత్తుగా అతనిగొంతు మూగతనం వహించింది. అభిమానమనే పాపానికి తను గురి అయాననే విషయం అతను గ్రహించాడు ప్రజలద్వారా సన్మానం పొంది తను వారిచేత అనవసరవ్యయం చేయించానని అతను బాధపడ్డాడు ఆనాటి క్రిష్టియనులు తమచేతులతో పనిచేసి జీవించేవారు అతనుకూడా ఆ విధంగా చేసేవాడే అయితే అతని

"విశిష్ట చిత్రకళా నైపుణ్య'మే అతనికి చేటైన గతి ' 1819 ప్రాంతాల్లో అతను తిరిగి చిత్రకళను చేపట్టాడు కాని పాపభీతి అతన్ని బాధిస్తూనే ఉంది అతను తన డైరీలో వ్రాసుకొన్నాడు, "అయ్యో ' ఎంత దయనీయ పరిస్థితి ! దేవుని దయ క్షమార్పణతప్ప నా జీవితానికి వేరు ఆధారమేమీలేదు నేను చేసిన ధర్మకృత్యాలేవీ లేవు నేనొక పనికిమాలిన పేరూ ఊరూ లేని పేద చిత్రకారుణ్ణి "

హిక్స్ ఉద్దేశములో మిథ్య అనేది అమాయకత్వాన్ని నాశనం చేసేందుకు దెయ్యం చేతిలో ధరించిన ఆయుధం, అందుకే అతను చిత్రకళాశిక్షణపొందలేదు అతని అంతరాత్మనమ్మిన జీవితవిధానానికి అతను తన కుంచెని అంకితంచేశాడు అతననేక శాంతి సామ్రాజ్యాలు (ర గుల చిత్రం) సింహమూ, మేకపిల్లా ఒకే చోట శాంతి పూర్వకంగా నివసిస్తాయి- అనే బైబిలు భవిష్యద్వాణిని వ్యక్తపరుస్తూ చిత్రించాడు కృత్రిమనీతివాదుల చవుక ఉపదేశాలవలె గాక ఈ చిత్రాలు పాత సమస్యని విస్మరించడంలేదు దైనిక జీవితంలో స్వీయ భావోద్వేగాలతో అనుదినం సంఘర్షణ పొందుతూన్న హిక్స్ సింహమూ, మేకపిల్లా ఒకచోట నివసించడమన్నది ఎంతకష్టమో తెలియనిది కాదు అతని చిత్రాలలోని సాధువులైన గోవులూ, మేక పిల్లలతో పోల్చిచూస్తే అందులోని క్రూర జంతువుల నిశ్చల దృష్టులలో తీవ్రరూపంగా వ్యక్తమమే సంయమనం మనకి స్పష్టంగా కనిపిస్తుంది అటువంటి ఉత్తమ ఉపమానాలతో పోల్చి చూస్తే మోర్స్, వేండర్లిన్ చిత్రించిన పౌరాణిక చిత్రాలు పేలవంగానూ సంకుచితంగానూ కనిపిస్తాయి చిత్రకళని తిరస్కరించిన వ్యక్తి తన హృదయాన్ని సంచలింపజేసిన అభిప్రాయాల్ని వ్యక్తపడుస్తూ మౌలిక చిత్రాల్ని సృష్టించాడు ఇందుకు వ్యతిరేకంగా సుశిక్షితులైన చిత్రకారులు చిత్రకళవంటి ఉత్తమ వృత్తిలేదని నమ్ముతూ తమ స్వంత నమ్మకాల్ని వ్యక్తపరచేందుకు సాహసించలేక పోయారు. నేటి విమర్శకులనేకులు వారి చిత్రాలకన్నా మొరటుగాకన్పించే హిక్స్ చిత్రాలని ఎక్కువఉద్వేగ పూరితాలుగా నిర్ణయించారు

ఆ రోజుల్లో గొప్ప సంచలనం కలగ జేసిన అమెరికన్ చిత్రకారుడు హిక్స్ ప్రతిద్వంద్వి జాన్ జేమ్స్ ఆడుబన్ (1785–1851). అతనుకూడా తీవ్రమైన లలిత భావాలకి చలించకుండా నిలబడ్డాడు అతను శాంటో డొమింగోలో ఒక ఫ్రెంచి తోటయజమానికి అతని క్రియోల్ ఉంపుడుకత్తెకు పుట్టాడని చారిత్రికాధారాలు చెప్తున్నాయి కాని అతను ఈ నిమ్న జన్మాన్ని ఒప్పుకోలేదు తను ఒక గొప్ప జమీందారుననే స్వప్నంలో అతను విహరించాడు–బహుశా ఫ్రాన్స్ సామ్రాజ్యానికి ఒక వారసుడు–బహిర్గతంగా బయటపడ కుండా ఉండేందుకు అతని పుట్టుపూర్వోత్తరాలు రహస్యంగా ఉంచబడ్డాయి ఇటువంటి పరిస్థితుల్లో ఉన్న వ్యక్తి వ్యాపారానికి ఏళికిగానీ అందుబాటులోకి రావడం అసంభవం ఫ్రాన్స్‌లో బాల్యావస్థలో అతను సర్దాగా పక్షులబొమ్మల్ని గీసేవాడు ఈ సరదా క్రమంగా వృత్తిగా మారుతుందనే ఆశతో అతని తండ్రి సుప్రసిద్ధ జాక్ లూయీ డేవిడ్ యొక్క పారిస్ స్టూడియోలో అతన్ని చేర్పించాడు తత్ఫలితంగా ఆడుబన్ స్వంతమాటల్లో అతను "ఉత్తమకళా శాఖలను సాధించే శిక్షణను త్రోసిరాజన్నాడు

తరువాత అతని తండ్రి అతన్ని అమెరికా పంపి వ్యాపారంలో పెట్టాడు కాని ఆ యువకుడు అక్కడ పగలల్లా అడవుల్లో పక్షుల్ని వేటాడుతూ రాత్రిళ్లు వాటి శరీరాల్ని బొమ్మలుగీస్తూ గడిపాడు తత్ఫలితంగా అతను దివాలా తీశాడు అప్పులు తీర్చలేక ఆడుబన్ జైలుకి వెళ్లాడు విడుదలైన తరువాత అతనికి అతని చిత్రాలు తప్పవేరే ఆధారం లేక పోయింది అతను వాటినెంత వరకూ పెద్దమనిషి సేకరించిన ఆలంకరణాలుగా భావించాడేతప్ప వాటి ప్రయోజనాన్ని గుర్తించలేదు ఇప్పుడు జీవికకి వాటినాధారంగా గుర్తించవలసివచ్చింది 1820 లో అమెరికన్ పక్షుల సంపూర్ణ శాస్త్రీయ సంకలనాన్ని ప్రచురించాలని అతను నిశ్చయించుకున్నాడు అతను నూతనోత్సాహంతో అడవుల్లో పరిభ్రమించాడు

అడుబన్ తన చిత్రాల్ని (చిత్రం 17) ఎన్నడూ కళారచనలుగా తీసుకోలేదు అవి లండన్ లో ప్రదర్శింపబడే వరకూ ఇతరులెవరూ కూడా ఆలా భావించలేదు అతను వాటిని ఎంగ్రేవ్ చేయించడానికి లండన్

వెళ్ళాడు "అసలైన సురుచి పూర్ణమైన కొత్త ప్రపంచపు సందర్శనం" అని అత్యుత్సాహంగా అతని ప్రదర్శనం శ్లాఘింపబడింది "దృశ్య చిత్రాలు సమగ్రంగా అమెరికన్‌వి చెట్లూ, పువ్వులూ, గడ్డి, ఆఖరికి ఆకాశపు రంగులూ, అసలైన జీవనంతో ప్రవహించే నీళ్లూ అన్నీ విశిష్టమైన ట్రాన్స్ అట్లాంటిక్ సృష్టి" ఈ విధంగా పొగడ్తల నంది ఒచ్చి సాంప్రదాయిక విధానంలోఅతను ఒక మృగ చిత్రాన్ని చిత్రించడానికిప్రయత్నించాడు, కాని అతను దాని పరిణామాన్ని గురించి వ్రాశాడు "నాతల వాగా వేడెక్కిపోయింది అది మసిపూసి మారేడుకాయ అయింది" "సహజమైన దైవదత్తమైన తన అశిక్షిత విధానంలోనే" అతను చిత్రించడానికి నిశ్చయించుకున్నాడు

మోర్స్ పరిష్కృత విధానం కంటె హిక్స్ ఆదిమ విధానానికే ఆడుబన్ సమీపంగా కనిపిస్తాడు రాఫిల్ తన నీటిరంగుల చిత్రాల్ని గురించి ఏమనుకుంటాడా అని అతనెన్నడూ ఆలోచించలేదు రోమన్ స్తంభాల పైగాక అడవుల్లో చెట్లు మీద విహరించాయని అతను తన పక్షుల్ని ఎన్నడూతక్కువ చూపు చూడలేదు కళనీ ప్రకృతినీ సమ్మిశ్రితం చేసి అతను అతివాస్తవికతని సుందర చిత్రాలుగా తయారుచేశాడు, నీటిరంగులుక్రేయన్ యొక్క సమ్మిశ్రణమైన అతని మీడియం అతని ప్రత్యేక అవసరాలకి అనుగుణ్యంగా ఏర్పడింది. సాంప్రదాయిక దుస్తులవలె అది అతనికళకి చక్కగా అతికింది కళతో సంబంధం లేకుండానే అతను అమెరికా యొక్క అభిమాన చిత్రకారుల్లో ఒకడుగా పేరుపొందాడు

ఇంతయినా ఆడుబన్ ఆకర్షణీయమైన కళలో కౌశల్యం లోపించింది హిక్స్ వలెనే అతని రచనా విధానం నియమితమైనది శతాబ్దులుగా ప్రతిభావంతులైన తరతరాల చిత్రకారులు ఏర్పరిచిన రచనావిధానాల్ని ఎంత సమర్థుడైనా చిత్రకారుడు వ్యక్తిగతంగా స్వయంగా కనిపెట్టలేడు మోర్స్ వలె ఆడుబన్ హిక్స్ సుశిక్షితులై యుండినచో నిస్సందేహంగా వారు అతన్ని మించిని చిత్రకారులు అయేవారు అలాగే మోర్స్‌కూడా సమకాలీన జీవితాన్నీ సమాకాలీన సమస్యలనీ వారివలె గంభీరంగా తీసుకొని ఉంటే ఎంతో లాభము పొంది ఉండేవాడు.

అనుకున్న విధంగా జాతీయ స్వాతంత్ర్యం అమెరికన్ చిత్రకళని సుదృఢ పరచకపోవడమేగాక వినాశాత్మకమైన ఆత్మగౌరవంచేత దెబ్బ తింది కాలనీల కాలంలో తమ దృక్కోణాల్ని రూపొందించుకొన్న వెస్ట్ కాప్లీ వంటి ప్రారంభిక చిత్రకారులు రాజనైతిక విప్లవ సమయింలో కూడ మాతృ దేశానికి బైట జన్మించిన యూరోపియనులుగా తమను భావించుకున్నారు మహత్తర చిత్రకళా సాంప్రదాయాలకి వారసులమన్న విషయంలో వారికెంత మాత్రం సందేహం లేకపోవడంవల్ల ప్రాచీన సంస్కృతిని ఆధునికావసరముల కనుగుణ్యంగా మలచుకోడంలో వారు స్వేచ్ఛగా ప్రవర్తించారు ప్రాచీనాచార్యులనుండి నేర్చుకొన్న పాఠాలను తాము స్వయంగా నమ్మేదాన్ని వ్యక్తపరిచేందుకు ఉపయోగించుకున్నారు అయితే సంయుక్తరాష్ట్ర పౌరులు యూరపుకు ఒక కొత్త దేశానికివెళ్ళి నట్లుగానే వెళ్ళేవారు తమ శిశు దేశానికి పరిపక్వ సంప్రదాయం లేదన్న విషయం దృష్టిలో పెట్టుకొని సంస్కృతి అనేదీ విదేశాలలో సీసాల కెక్కించబడిన అమృతమని హడ్సన్, ఓహియోల నీటివల్ల అది చెడి పోతుందనీ వారు తలచారు సంయుక్తరాష్ట్రాల పేరే ఎన్నడూ విన నట్లుగా వారు నటించడానికి ప్రయత్నించారు

అంత శ్రద్ధాభక్తులతో అమెరికనులు దిగుమతిచేసుకున్న సౌందర్య కళలు పాతప్రపంచంలో కూడా శుష్కంగా భావించబడేవి. ఫ్రెంచి విప్ల వమూ, నెపోలియన్ యుద్ధాలూ యూరోపియన్ విచారధారని మితవాది త్వమువేపు వాస్తవిక వాదంవేపూ నడిపాయి వర్తమాన దుఃఖ జీవితాన్ని విస్మరించడానికి ప్రయత్నిస్తూ ప్రాచీనకాల మహత్వాన్ని స్మరిస్తూ చిత్ర కారులూ, వారి అభిమానులూ శుష్కంగా, నిస్తేజంగా పరిణమించిన ఒక క్రొత్త తరగతిని శరణుపొందారు వెస్ట్, కాప్లీ వంటి వ్యక్తులు ప్రచారం చేసిన అభ్యుదయ భావాలనేకం తాత్కాలికంగా పనికిమాలినవయాయి సుప్రసిద్ధ మానవచిత్రకారులు తాము జీవితంలో ఎన్నడూ నమ్మని శిథిల దేవాలయాల్లోంచి బయటికిలాగారు సౌందర్యమూ, వాస్తవికతా ఎన్నడూ ఒకటి కావని విమర్శకులు ప్రచారం చేశారు

సంయుక్త రాష్ట్రాలలో ఈ రోగం ఇంకా వినాశనకారిగా ప్రసరించింది. ఈ తీరిభూములకి తిరిగిరాగానే ప్రాచీన విధానంలో పునర్నిర్మించవలసిన సిద్ధాంతముల విషయంలో చిత్రకారులు విభిన్నాభిప్రాయాల్ని వ్యక్తపరచడమేగాక వారి విప్లవ ప్రపంచం యూరపుకంటే గట్టిగా పాతకాలపు కళా సమస్యల కొత్త పరిష్కారంకోసం అరవసాగారు చిత్రకారులు ఇందుకు ఒప్పుకోగా వారు ఇంకా అపక్వ వారిగా, ఎనికిమాలినవారిగా చూడబడసాగారు వారు తమ అసలు రూపాలకి విరుద్ధంగా కనిపించడానికి ప్రయత్నించారు, వారి సమర్థులు అన్నట్లుగా వారి దృష్టికోణం అంతర్జాతీయంకాదు తీవ్ర జాతీయత్వంతో గూడిన ఆత్మవంచన తత్వం మాత్రమే ఈ తత్వానికి వశపడి నలుగురిలో ఎలా మెలగాలో తెలియని వ్యక్తులు ఒక ప్రత్యేక సంఘంలో చేరేందుకు తాపత్రయపడేటట్లు చిత్రకారులు చాలా ప్రభావంగా అయారయారు యూరప్‌లో శాశ్వత కళాస్థాపనకోసం యుద్ధానికి నడుముకట్టిన తీవ్ర విప్లవకారులు అమెరికాలో లేరు స్వయంశిక్షితులైన పారిశ్రామికులు లలితకళలతో సంబంధం పెట్టుకోడానికి తమవంటివారు తగరనే సంకోచభావంతో తమకళ్లు చూస్తోన్న దానిని, తమ హృదయాలని సంచలితపరచే దానిని హృదయపూర్వకంగా చిత్రించారు

సర్కసులో ప్రక్క ప్రదర్శనలోని స్త్రీ వలె అమెరికన్ చిత్రకళ రెండుగా కోయబడింది పై భాగానికి మంచి ఆలోచనలతో కూడిన తలవుంది కాని నేలమీద నిలబడేందుకు కాళ్లులేవు క్రిందిభాగం భూమికి సమీపంలో ఉన్నా నేర్పరితనము, దృష్టి దానికిలోపించాయి చిత్రకళ స్థిరపడాలంటే తిరిగి ఆ స్త్రీ రెండు భాగాలనీ జతపరచాలి

# 4

# అమెరికా సాక్షాత్కారం

ఒకానొకప్పుడు విప్లవదృశ్యాల ఉజ్వలచిత్రకారుడుగా ప్రసిద్ధికెక్కిన జాన్ ట్రంబుల్ తనకాలాన్నీ తనప్రతిభనీ అధిగమించి జీవించాడు అతను యువచిత్రకారుల నిర్జీవత్వాన్ని పంచుకొన్నాడు 1825 లో ఒక న్యూయార్క్ వీధిలో తిరుగుతూ తానుఎన్నడూ కనీవినీఎరుగని చిత్రకారుడు థామస్ కోల్ (1801–1848) చిత్రించిన ఒక అమెరికన్ జలప్రపాతచిత్రాన్ని ఒక దుకాణపు కిటికీలో చూశాడు వృద్ధచిత్రకారుడు విస్తుపోయి చూశాడు "ఈ యువకుడు నేను నా జీవితమంతా ప్రయత్నించి చిత్రించలేని చిత్రాన్ని చిత్రించాడు" అని అతను అన్నాడు

బహుశా ఇంగ్లాండులోపుట్టి తన 18వ ఏటివరకూ అమెరికా రాని కోల్ మోర్స్‌నీ వేండర్లిన్‌నీ విసుకెత్తించిన నరకని అడవులూ, కలకల ప్రవహించే సెలయేళ్లూ, చూసి బాగా సంచలనం పొంది ఉంటాడు ఈ అద్భుతాల్ని చిత్రించడానికి స్వయంశిక్షణనందుతూ అతను తన పూర్వీకులవలె పూర్వాచార్యుల పుట్టుపూర్వోత్తరాల్ని గాలించడానికి ప్రయత్నించలేదు చాలాకాలంగా అమెరికన్ ధరిత్రితో పెనవేసుకొన్న సామాన్య సంప్రాదాయాల వేపే అతను దృష్ట సారించాడు.

ప్రసిద్ధ చిత్రకారులు ముఖాలనీ, చారిత్రిక దృశ్యాలనీ చిత్రించేందుకే తమ శక్తిసామర్థ్యాలని వినియోగించినా దృశ్యచిత్రాలుకూడా కొన్ని చిత్రించబడకపోలేదు ప్రారంభిక వలసయుగంలో ఇంకా రూపచిత్రకారులు

జమీందారీ దర్జాలకి తంటాలు పడుతూండగానే అలంకరణ చిత్రకారులు విదేశాల దృశ్యాలను రకరకాల సైజులలోనున్న కోటలతోనింపి అమాయకులైన తమ కొనుగోలుదారులను తృప్తిపరచసాగారు కాని సంవత్సరాలు గడచినకొలదీ అమెరికన్‌లు ఎక్కువగా తమస్వదేశ చిత్రాల్ని చూసేందుకుతహతహ లాడసాగారు సుశిక్షిత చిత్రకారులు సాధారణంగా అమెరికన్ దృశ్యాలు చిత్రించేందుకు తగినంత అందమైనవికావని అనుకోవడంచేత అపని సామాన్య పనివారు చెయ్యసాగారు వారిదృష్టిలో కళాకృతులు కాక స్థలాల నిరూపణగానే ఆ చిత్రాలు భావించబడ్డాయి, సూక్ష్మాతిసూక్ష్మమైన దూరపు స్థలాలనికూడ కొనుగోలుదారు ఇష్టానుకూలంగా వారు తమ చిత్రాలలో గుర్తించేవారు ఈ వివరాల గందరగోళంలో ప్రకృతిలోని ఐక్యత అడుగునబడేది

యూరప్‌లో దృశ్య చిత్రణ కొత్త జీవితాన్ని పోసుకోసాగింది. మానవకృత్యాలకి ప్రాధాన్యతనిచ్చే 18వ శతాబ్దం ప్రకృతిచిత్రాల్ని అప్రధానంగా తీసుకుంది చిత్రకారుడు దృశ్యాన్ని చిత్రించడానికి చెట్లనీ ఆకాశాన్నీ,భవనాలనీ మానవనిర్మిత ఉద్యానవనములోవలె పడికట్టుకూర్పులతో నిలబెట్టి దానికి ఆదర్శరూపం ఇవ్వడానికి ప్రయత్నించేవాడు అయితే వికసిస్తూన్న భావవాదతరం ప్రకృతి ముఖంలోకి చూడ్డమంటే భగవంతుని ముఖంలోకి సూటిగా చూడ్డమేనని నమ్మింది కవులు డెఫాడల్స్‌నిగూర్చి ఖండకావ్యాలు వ్రాశారు చిత్రకళలో నవీనదృష్టికోణానికి ప్రవక్త జాన్ కాన్స్టబుల్ 1803 ప్రాంతాల్లో అతను ఇంగ్లీషు దృశ్యాలని కంటికి కన్పించినట్లు యధాతధంగా వ్యక్తపరచసాగాడు అతని ప్రతిభ ఫ్రాన్స్‌కు పాకింది అక్కడ కారట్, బార్బిజాన్ శైలికి సంబంధించిన సౌందర్యవిహీనమైన ప్రకృతిదృశ్యాలని పూర్తిగా తారుమారు చేసింది.

బార్బిజాన్ శైలి రూపొందకముందే తన ప్రాంతీయ అమెరికన్ శైలిని తన పద్ధతిలో వికసింపజేసుకొని కోల్ ప్రపంచరంగంలో ప్రవేశించాడు కోల్ నూతన దృక్కోణానికి పూర్తిగా వశపడలేదు అతనూ ప్రకృతిలో దేవుణ్ణి చూశాడు కాని అతపసుస్నాతశాద్వల దృశ్యాలలోంచి ప్రకృతి వాణిని పైకిరానివ్వలేదు. అతను ఆమెలోని ఉద్వేగక్షణా

లచేత ఎక్కువ ఆకర్షించబడ్డాడు ఆవరిస్తూన్న నిటారుకొండలనీ, గర్జిస్తూన్న తుఫానులనీ, వెలుగునీడల అద్భుత నడకల్నీ అతను ఎన్నుకున్నాడు కనెక్టికట్ మెలిక (చిత్రం 20) చిత్రానికి అతను ప్రేక్షకులకి స్వాభావికంగా ఎదురుగా సాక్షాత్కరించే చక్కని పట్టుని ఎన్నుకున్నాడు ఘోర తుఫాను దృశ్యావరణకి శ్రుతికలుపుతూ నల్లని వృక్షచ్ఛాయలు నిలిపాడు విశిష్టమైన చిన్నచిన్న మానవాకృతులు అడవుల్లో తిరుగుతూ ఆశ్చర్యజనకంగా మనకంటబడతాయి ఈ చిత్రము అనేక విధాలుగా మొరటుగా ఉన్నప్పటికీ ఆల్‌స్టన్ కావాలని చిత్రించిన "చంద్రికా ధవళిత ప్రకృతి' (చిత్రం 12) తో పోల్చిచూస్తే వన్యప్రకృతినీ వన్యఖండాన్నీ ఇది ఎంతతీవ్రంగా వ్యక్తపరుస్తోందో మనకి తెలుస్తోంది, ఇట్టి చిత్రాలకి హర్షిస్తూ అమెరికన్ జనసామాన్యం కోల్‌కి బ్రహ్మరధంపట్టింది

అతను యూరపులో శిక్షణ పొందాలని తెలియజేసినప్పు డతని మిత్రులు చాలామంచి ఎంతో విచారించారు విలియం కల్లెన్ బ్రియాంట్ ఆతన్ని ఈ క్రింది కవితతో హెచ్చరించాడు

నీ కళ్లు సుదూరాకాశాల కాంతుల్ని చూస్తాయి
అయినా నీ హృదయం యూరపు తీరాల విహరిస్తుంది
నీ మాతృభూమికి జీవంత ఉదాహరణం
నీ స్వకీయ ప్రోజ్వల కాన్వాసులో అది మూర్తీభవించింది
ఏకాంత కాసారాలూ—మహిషాల కాలవాలాలువిస్తృత మైదానాలు
గ్రీష్మకుసుమమాలలతో గిరికన్యలు ప్రశాంత - నిర్ఝరులు
అరిచే ఎడారి డేగలు ఎగిరే ఆకాశాలు-
వసంత వికాసం సముజ్వల శైశిక నికుంజనివహం
నీ వెక్కడికి వెళ్ళినా సుందర దృశ్యాలు స్వాగతమిస్తాయి—
కాని దీనికి భిన్నంగా అంతటా మానవ సముదాయం,
మార్గాలు, గృహాలు, శిధిలాలు, శ్మశానాలు,
చిరులోయల మొదలు చండ ఆల్ప్సైన్ శిఖరాల వరకూ
మానవ జీవితం వికసించి వెదజల్లబడింది
నేత్రాలశ్రుపూరితాలై హృదిమెదిలే వరకు

వాటిని సందర్శించు మోయా కోల్ !
కాని నీ ప్రథమ సముజ్వల పసిఎఋయు
మరచిపోకు సుమా ఎన్నటికిని

తన ప్రాంతీయ అమెరికన్ పెద్దల నుంచి సంక్రమించిన అస్పష్ట రేఖలూ బూడిద వర్ణమూతో ఇంకా బాధ పడుతూన్న కోల్ యూరోపియన్ అభ్యుదయ కళా సాధనతో ఎంతో నేర్చుకొని ఉండవలసింది కాని అతను మితవాదుల మాటలువిని తాను చిత్రించిన ప్రకృతిదృశ్యాలు ఉత్తమకళకి యోగ్యమైనవి కావేమోనన్న భయముతో బాధపడ్డాడు మాతృదేశానికి తిరిగివచ్చిన తరువాత అతను తన ప్రకృతి దృశ్యాలకి బహిర్గతమైన అర్థాన్ని తెచ్చేందుకు ప్రయత్నిస్తూ భావోద్వేగ పూరితమైన అర్థంలేని పెద్దపెద్ద ఉపమానాలకిని ఆశ్రయించాడు

హడ్సన్ నదీశైలిని రూపొందించేందుకు కోల్‌తో కలిసిన అతని సహచరులు - ఆషెర్ బి డురాండ్ (1797–1886), జాన్ ఎఫ్ కెన్సెట్ (1816–1872), జాన్ డబ్ల్యు కాసిలీయర్ (1811–1893) ఈ ఆర్భాటపుశైలికి వెనుకంజ వేశారు డురాండ్ ప్రకృతితో ఘనిష్ఠ సంబంధాన్ని ఏర్పరచుకోడానికి తహతహలాడేడు పెన్సిల్ గీతల ఆధారంతో స్టూడియోలో ప్రకృతి దృశ్యాలని రచించే విధానాన్ని అతను పరిత్యజించాడు అతను బైట చిత్రించసాగాడు ఎంగ్రేవరుగా అనేక సంవత్సరాల సాధన ఫలితంగా అతని కలవడిన కఠిన రేఖల ఛాయలున్నప్పటికీ డురాండ్ చిత్రాలు గంభీరంగా నిశ్చలంగా తీవ్రంగా కనిపిస్తాయి విశేషంగా వృక్షాలమీద ఇష్టం కలవాడవటంచేత అతను తన ప్రతిచిత్రంలోనూ అధమపక్షం ఒక్కచెట్టునేనా యథాతథంగా చేర్చాడు 'ప్రకృతి దేవతలు' (చిత్రం 18) అనే అతని చిత్రం ఒక అడవి అఘాతాన్ని పరిశీలిస్తోన్న కోల్‌ని, బ్రియాంట్‌నీ చూపిస్తుంది ఇది క్రమక్రమంగా తమ మాతృభూమిని సాక్షాత్కారం పొందుతూన్న చిత్రకారులనీ, కవులనీ ఘనిష్టపరిచే స్నేహాన్ని జ్ఞప్తికి తెచ్చే చక్కని చిత్రం. ఫ్రెడరిక్ ఈ. చర్చ్ (1826–1900) హడ్సన్ నదీ శైలిలోని అభిప్రాయాలను ముందు తరంవరకూ తీసుకుపోతూ డురాండ్ యదార్థ వాదాన్ని కోల్ అత్యుక్తివా

దంతో మేళవితంచేశాడు ప్రకృతిని యథాతథంగా చిత్రించేందుకు అను వుగా అతను దృశ్య శాస్త్రమూ, వాతావరణశాస్త్రమూ, భూతత్వశాస్త్రమూ, దేశపటచిత్రణమూ నేర్చుకొన్నాడు అతను దక్షిణఅమెరికాలోని అడవు లనూ, ధృవమైదానాలనూ అన్వేషించాడు ఈచర్యలు ఆకాలపు శాస్త్రీయ పక్షపాతాన్ని తెలియజేస్తోన్నప్పటికీ, అతను ప్రధానంగా భావపక్షపాతి అతను కోల్ యొక్క కృత్రిమ ఉపమానాల్ని త్యజించినప్పటికీ అతను కూడా ఉజ్వలరూపంలో వ్యక్తమయే ప్రకృతిని ఆరాధించాడు అతను 'ఆండిన్ గర్భం' (చిత్రం 19) ఒకేచిత్రంలో "గొప్పపర్వతాలనీ, సుందర లోయలనీ, శ్యామలశాద్వలాలనీ, ఆకాశంలో తలలాడించే వృక్షాలనీ, శుభ్రస్వచ్ఛజలాలనీ, రంగురంగుల పక్షుల్నీ, పువ్వుల్ని, మనోహరము లైన కంటికింపైన దృశ్యాలనీ" ప్రత్యక్షపరుస్తుంది అది చాలాపెద్ద చిత్రం అవడంవల్ల అచ్చులో దాని ఒకభాగాన్ని మాత్రమే చూపించడానికి వీలవు తుంది ప్రత్యక్ష ప్రకృతి దృశ్యం ద్వారా అడుగడుక్కీ కళ్లు మిరుమిట్లు గొల్పే అంశాలని మనిషి చూడగలిగినట్లు ఈ చిత్రంలో మనదృష్టి ఇటూ అటూ పరుగెడ్తుంది, లోతునీటిని ప్రతిఫలింపచేసే సూర్యకాంతిని బంగారు మంచుతెరలోంచి ప్రస్ఫుట పరచడమనేది చర్చికి అభిమాన విషయం అతడు ఈ నేర్పరితనాన్ని అనేక చిత్రాల్లో అతివిజయవంతంగా చూపిం చాడు

ముఖ్యంగా మనం గమనించవలసింది అమెరికాలో పుట్టి శిక్షణ పొందిన చర్చి సౌందర్యాన్వేషణలో ప్రపంచమంతా పరిభ్రమించాడు, కాని అతను మన రాకీ పర్వతాలని ఎన్నడూ దర్శించలేదు ఆ సుప్రసిద్ధ పర్వత ప్రాంతాన్ని చక్కగా చూపించినవారు ఇంగ్లిషు–అమెరికన్ థామస్ మోరన్ (1837–1926), జెర్మన్–అమెరికన్ ఆల్బర్ట్ బీర్‌స్టాట్ (1830–1902) బీర్‌స్టాట్ డ్యూసెల్‌డార్ఫ్‌లోనూ, రోములోనూ శిక్షణపొందినప్పటికీ విశుద్ధ అమెరికన్ పద్ధతులనుండి చర్చి కనిపెట్టిన శైలిని ఇతనిశైలి పోలి ఉంటుంది ఉన్నత శిక్షణ పొందడం వల్ల బీర్‌స్టాట్ మంచి రచనా కౌశల్యాన్ని సంపాదించాడు కాని అతని కుశల చిత్రాల్లో చర్చి చిత్రాల లోని ప్రచండ శక్తి లోపించింది

వాటిని సందర్శించు మోహా కోల్ !
కాని నీ ప్రథమ సముజ్వల వినిర్మాణ
మరచిపోకు సుమా ఎన్నటికిని

తన ప్రాంతీయ అమెరికన్ పెద్దల నుంచి సంక్రమించిన అస్పష్ట రేఖలూ బూడిద వర్ణమూతో ఇంకా బాధ పడుతూన్న కోల్ యూరోపియన్ అభ్యుదయ కళా సాధనతో ఎంతో నేర్చుకొని ఉండవలసింది కాని అతను మితవాదుల మాటలువిని తాను చిత్రించిన ప్రకృతిదృశ్యాలు ఉత్తమకళకి యోగ్యమైనవి కావేమోనన్న భయముతో బాధపడ్డాడు మాతృదేశానికి తిరిగివచ్చిన తరువాత అతను తన ప్రకృతి దృశ్యాలకి బహిర్గతమైన అర్థాన్ని తెచ్చేందుకు ప్రయత్నిస్తూ భావోద్వేగ పూరితమైన అర్థంలేని పెద్దపెద్ద ఉపమానాలకిని ఆశ్రయించాడు

హడ్సన్ నదీశైలిని రూపొందించేందుకు కోల్‌తో కలిసిన అతని సహచరులు - ఆషెర్ బి డురాండ్ (1797-1886), జాన్ ఎఫ్ కెన్సెట్ (1816-1872), జాన్ డబ్ల్యు కాసిలీయర్ (1811-1893) ఈ ఆర్భాటపు శైలికి వెనుకంజ వేశారు డురాండ్ ప్రకృతితో ఘనిష్ఠ సంబంధాన్ని ఏర్పరుచుకోడానికి తహతహలాడేడు పెన్సిల్ గీతల ఆధారంతో స్టూడియోలో ప్రకృతి దృశ్యాలని రచించే విధానాన్ని అతను పరిత్యజించాడు అతను బైట చిత్రించసాగాడు ఎంగ్రేవరుగా అనేక సంవత్సరాల సాధన ఫలితంగా అతని కలవడిన కఠిన రేఖల ఛాయలున్నప్పటికీ డురాండ్ చిత్రాలు గంభీరంగా నిశ్చలంగా తీవ్రంగా కనిపిస్తాయి విశేషంగా వృక్షాలమీద ఇష్టం కలవాడవటంచేత అతను తన ప్రతిచిత్రంలోనూ అధమపక్షం ఒక్క చెట్టునేనా యధాతధంగా చేర్చాడు 'ప్రకృతి దేవతలు' (చిత్రం 18) అనే అతని చిత్రం ఒక అడవి అఖాతాన్ని పరిశీలిస్తోన్న కోల్‌ని, బ్రియాంట్‌నీ చూపిస్తుంది ఇది క్రమక్రమంగా తమ మాతృభూమిని సాక్షాత్కారం పొందుతూన్న చిత్రకారులనీ, కవులనీ ఘనిష్టపరిచే స్నేహాన్ని జ్ఞప్తికి తెచ్చే చక్కని చిత్రం. ఫ్రెడరిక్ ఈ చర్చ్ (1826-1900) హడ్సన్ నదీ శైలిలోని అభిప్రాయాలను ముందు తరంవరకూ తీసుకుపోతూ డురాండ్ యదార్థ వాదాన్ని కోల్ అత్యుక్తవా

దింతో మేళవితించేశాడు ప్రకృతిని యథాతథంగా చిత్రించేందుకు అను వుగా అతను దృశ్య శాస్త్రమూ, వాతావరిణశాస్త్రమూ, భూతత్వశాస్త్రమూ, దేశపటచిత్రణమూ నేర్చుకొన్నాడు అతను దక్షిణఅమెరికాలోని అడవు లనూ, ధృవమైదానాలనూ అన్వేషించాడు ఈచర్యలు ఆకాలపు శాస్త్రీయ పక్షపాతాన్ని తెలియజేస్తోన్నప్పటికీ, అతను ప్రధానంగా భావపక్షపాతి అతను కోల్ యొక్క కృత్రిమ ఉపమానాల్ని త్యజించినప్పటికీ అతను కూడా ఉజ్వలరూపంలో వ్యక్తమయే ప్రకృతిని ఆరాధించాడు అతను 'ఆండిన్ గర్భం' (చిత్రం 19) ఒకేచిత్రంలో "గొప్పపర్వతాలనీ, సుందర లోయలనీ, శ్యామలశాద్వలాలనీ, ఆకాశంలో తలలాడించే వృక్షాలనీ, శుభ్రస్వచ్ఛజలాలనీ, రంగురంగుల పక్షుల్నీ, పువ్వుల్నీ, మనోహరము లైన కంటికింపైన దృశ్యాలనీ" ప్రత్యక్షపరుస్తుంది అది చాలాపెద్ద చిత్రం అవడంవల్ల అచ్చులో దాని ఒకభాగాన్ని మాత్రమే చూపించడానికి వీలవు తుంది ప్రత్యక్ష ప్రకృతి దృశ్యం ద్వారా అడుగడుక్కీ కళ్లు మిరుమిట్లు గొల్పే అంశాలని మనిషి చూడగలిగినట్లు ఈ చిత్రంలో మనదృష్టి ఇటూ అటూ పరుగెడ్తుంది. లోతుసీటిని ప్రతిఫలించచేసే సూర్యకాంతిని బంగారు మంచుతెరలోంచి ప్రస్ఫుట పరిచడమనేది చర్చికి అభిమాన విషయం అతడు ఈ నేర్పరితనాన్ని అనేక చిత్రాల్లో అతివిజయవంతంగా చూపిం చాడు

ముఖ్యంగా మనం గమనించవలసింది అమెరికాలో పుట్టి శిక్షణ పొందిన చర్చి సౌందర్యాన్వేషణలో ప్రపంచమంతా పరిభ్రమించాడు, కాని అతను మన రాకీ పర్వతాలని ఎన్నడూ దర్శించలేదు ఆ సుప్రసిద్ధ పర్వత ప్రాంతాన్ని చక్కగా చూపించినవారు ఇంగ్లీషు–అమెరికన్ థామస్ మోరన్ (1837–1926), జెర్మన్–అమెరికన్ ఆల్బర్ట్ బీర్‌స్టాట్ (1830–1902) బీర్‌స్టాట్ డ్యూసెల్‌డార్ఫ్‌లోనూ రోములోనూ శిక్షణపొందినప్పటికీ విశుద్ధ అమెరికన్ పద్ధతులనుండి చర్చి కనిపెట్టిన శైలిని ఇతని శైలి పోలి ఉంటుంది ఉన్నత శిక్షణ పొందడం వల్ల బీర్‌స్టాట్ మంచి రచనా కౌశల్యాన్ని సంపాదించాడు కాని అతని కుశల చిత్రాల్లో చర్చి చిత్రాల లోని ప్రచండ శక్తి లోపించింది

అయితే బాగా అభివృద్ధిపొందిన యూరొపియన్ ంళతో పోల్చి చూస్తే ఈ ఇద్దరు చిత్రకారుల పద్ధతులూ అపరిపక్వంగా కన్పిస్తాయి అమెరికన్ దృశ్య చిత్రకళని వెలుగుకి తెచ్చిన శ్రేయం చర్చి సమకాలికుడైన జార్జి ఇన్నెస్ (1825-1894)కి దక్కింది తన నిరంతర యూరోపియన్ యాత్రల సందర్భంలో అతను గొప్ప ప్రతిభావంతుడైన విదేశ విద్యార్థిగా ప్రసిద్ధికెక్కాడు అతను ముఖ్యంగా కాన్సబుల్, కారట్‌ల కళని ప్రశంసించాడు వారు ప్రకృతిని ప్రత్యేక అసాధారణ ఘట్టాలలో కాక అపరిష్కృతమైన సాధారణ నిత్యరూపంలో చిత్రించారు అయితే ఇన్నెస్ ఈ గురువులకుగూడ పూర్తిగా లొంగిపోలేదు వారి అనేక అద్భుతమైన చిత్రకళావిధానాల్లోంచి తనకి కొత్తప్రపంచ స్వరూపాన్ని వ్యక్తపరచడానికి కావలసినవాటిని మాత్రమే తీసుకొన్నాడు

చిత్రం ఎల్లా చిత్రించాలి అనే విషయంలో ఇన్నెస్‌కి చాలా సిద్ధాంతాలుండేవి కాని అవి ఈరోజున్నట్లు రేపుండేవికావు చిన్నప్పటి నుంచి మూర్ఛరోగంతో బాధపడడంవల్ల అతను మానసికంగా ఎప్పుడూ నిలకడగా ఉండలేదు మానసికితత్వవేత్తలు "స్వేచ్ఛా పద్ధతి" అని చెప్పే పద్ధతిలో అతను తన చిత్రాలని చిత్రించినట్లు కనిపిస్తుంది ఖాళీ కాన్వాసుమీద చిత్రం మొదలుపెట్టడం అతనికి కష్టంగా ఉండేది కాని ఆ చిత్రానికి ఏదో ఒక రూపం ఏర్పడగానే అతని హృదయం గంతులేసేది సృజనశక్తితో అతను గుంపులనీ రంగులనీ ఒకదానితో ఒకటి సరితూగేట్లా వెలుగుకి ప్రతిగా నీడనీ, నీడకి ప్రతిగా వెలుగునీ చూపించేవాడు జుట్టు అతని మొహంమీదకి పడేది అతని చొక్కా చివళ్లు పేంటులోంచి వెలికి పడి రంగులుతుడిచే గుడ్డలుగా తయారయేవి. చిత్రం మొదలుపెట్టాడంటే ఇక ఆగేవాడుకాడు—"మంచు దృశ్యం వసంతదృశ్యంగా మారేది, ఆవులు ఇళ్లయేవి, ఇళ్లు అడవులయేవి ప్రతీ కొత్తాకారం కొత్త దృశ్యాన్ని చూపించడంతో రాత్రుళ్లు పగళ్లయేవి కాన్వాసుమీద రంగుమాసి అతను ఉప్పొంగుతూండడంవల్ల సాటి చిత్రకారులు అతన్ని తమ స్టూడియోలకి రాకుండా బహిష్కరించారు అతన్ని బొమ్మలు పాడుచేయకుండా ఆపేందుకు వాళ్లు కుంచెలు దాచేసేవారు.

అతని 'డిలావేర్ సీటికయ్య'ని కోల్ 'మెలిక' (చిత్రాలు 21, 20)తో పోల్చి చూస్తే ఇన్నెస్ అమెరికన్ చిత్రకళకి సమకూర్చిన గొప్ప తనాన్ని మనం గ్రహించ కలుగుతాం కోల్ బూడిద ఛాయలని దరి జేరనివ్వకుండా ఇన్నెస్ ప్రకృతిలోని ఉజ్వల వర్ణాల్ని ఉపయోగించేవాడు. సూర్యకాంతి లోపలికి రానివ్వడానికి అతను ఒకఛాయని తగ్గించేవాడు కోల్ వాతావరణని ముఖ్యంగా తీవ్రవిరుద్ధతల్ని చూపించేవాడు ప్రకాశా నికి విరుద్ధంగా తుఫానుని చూపించేవాడు ఆకాశంయొక్క ఉజ్వలత్వాన్ని అన్నివస్తువులమిదా ప్రకాశించేట్లా చేశేవాడు గంభీరంగా అంకితపరచిన వస్తువులు కోల్ చిత్రాల్లో ప్రముఖంగా కనిపిస్తాయి వస్తువుయొక్క ఆకారంకంటె విభిన్న ప్రకాశగతుల్లో అని కన్పించే పద్ధతినే ఇన్నెస్ ప్రధానంగా చూసేవాడు ఈ విశేషం ప్రసిద్ధులైన తన యూరోపియన్ మిత్ర చిత్రకారులనుండి అతను గ్రహించాడు అయితే అతని ఆఖరు రోజులలో మంచుచేతా మసకచేతా పూర్తిగా కప్పబడిన ఛాయాదృశ్యాల వంటి చిత్రాల్ని చిత్రించే పద్ధతిలోకి దిగాడు

ఛాయావృతమైన రహస్య ప్రకృతిని చూసినప్పుడు ఇన్నెస్ కోల్ కంటె ఆల్స్టన్‌కి ఎక్కువ సన్నిహితుడయ్యేవాడు ఐతే ప్రారంభిక రహస్యవాదులవలె అతను సమకాలీన వాస్తవికతతో సంబంధాన్ని తెగతెం చుకోలేదు అతని స్టూడియో కిటికీలోంచి కన్పించే పొలాలు అతని అంతర్ దృష్టిని ప్రభావితం చేశాయి. ఈ విషయంలో తన కాలంలోని అభ్యుదయ భావాలనే ఇన్నెస్ అనుసరించాడు

ఆదర్శం యొక్క సాంప్రదాయిక సిద్ధాంతాలు విజ్ఞానయుగం తోనూ సామాన్య మానవునితోనూ సమన్వయపరచ బడవనే విషయం పాశ్చాత్య ప్రపంచమంతటా పోనుపోను స్పష్టపడింది. అయిష్టతతో గూడిన సమస్యతో చిత్రకళ పౌరాణికతనీ సిద్ధాంతవాదాన్నీ త్యజిస్తూ ఆధునికతగ వాస్తవికతకీ ఉన్ముఖంగా నడిచింది మూర్తి చిత్రణలో ప్రారంభకుడు డేవిడ్ విల్కీ అనే స్కాచ్ వ్యక్తి అతను 1800 ప్రారం భంలోనే సామాన్య ప్రజల దైనందిన చర్యలని వర్ణించే ఇంగ్లీషు నవలా కారులని అనుసరించాడు అమెరికాలో చిత్రకారులుగా రూపొందిన ఇద్దరు

బ్రిటిష్ చిత్రకారులు అతన్ని బాగా బలపరిచారు రాబర్ట్ ఆర్ లెస్లీ (1794-1859) ఫిలడెల్ఫియాలో పెరిగాడు, గిల్‌బర్ట్ స్టూవర్ట్ న్యూటన్ (1794-1835) తన పినతండ్రియైన గిల్‌బర్ట్ స్టూవర్ట్ దగ్గర బోస్టన్‌లో శిక్షణ పొందాడు అయితే ప్రారంభిక ప్రవాసియైన వెస్ట్ వలె ఒకేసారి ఇంగ్లీషువారమనీ అమెరికన్‌లమనీ వారుభావించలేదు, అటోఇటో నిర్ణయించుకోవలసివచ్చి వారు అమెరికన్ విధానాలనుండి పూర్తిగా విడిపోయారు. లెస్లీ వెస్ట్ పాయింట్‌లో చిత్రకళా బోధకుడుగా ఉద్యోగం స్వీకరించిన విషయం నిజమేకాని, అతను తను పుట్టిపెరిగిన దేశంలో దుఃఖ జీవితాన్ని గడపలేక ఆఖరుకి ఇంగ్లాండు పారిపోయాడు

ప్రపంచవ్యాప్త విప్లవాలన్నిటివలెనే మానవచిత్రకళా విప్లవం వివిధ దేశాల్లో వివిధ రకాలుగా వ్యాపించింది 19వ శతాబ్దపు తొలి రోజుల్లో అధికార ఫ్రెంచి చిత్రకళ నెపోలియన్ అధీనంలో ఉన్న పారిస్‌ని సీజర్ కాలపు రోము వలె వ్యక్తపరచింది ఇంతకుముందు మనం చూసినట్టుగా అమెరికన్ చిత్రకారులు అమెరికన్ జీవితాన్ని చిత్రించడం అవమానకరంగా భావించారు మన సంఘంలో సుందరచిత్రణానికి గలఅవకాశాలను మొట్టమొదట గుర్తించినది జాన్ లెవీస్ క్రిమ్మెల్ (1787-1821) అనే జెర్మన్ చిత్రకారుడు 1810లో అతను వచ్చేరావడంతో ఫిలడెల్ఫియా ఆచారవ్యవహారాలనూ వీధులదృశ్యాలనూ చూపే చక్కని చిత్రాలు చిత్రించాడు. అతని చిత్రాలు ప్రజల దృష్టిని ఆకర్షిస్తూండగా తన ఇరవైనాలుగవ ఏట ఒక మడుగులో ఈదుతూ మునిగి చనిపోయాడు, పేరుపొందిన చిత్రకారు లెవరూ అతని కృషిని ముందుకి సాగించలేదు అమెరికన్ జీవితం ఒక్క రచయితలకే చెందిన సొత్తు ఐంది వాళ్లుకూడా ప్రాచీన వర్ణనలకే ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చారు కూపర్ అదృశ్యులైన రెడ్ ఇండియనులను గురించి వ్రాశాడు ఇర్వింగ్ న్యూయార్క్ ప్రారంభిక జీవితాన్ని వర్ణించాడు ఈ రచయితలు యువకతరానికిచెందిన చిత్రకారులని ఆకర్షించారు. విదేశాలలో వలెనే ఇక్కడకూడా ప్రకృతిని ప్రత్యక్షంగా చూడడానికిబదులు పుస్తకాలలోని ఘటనలు చిత్రించడం ఎక్కువ సదుపాయకరంగా భావించారు

జాన్ క్వీడర్ (1801–1881) ప్రారంభిక దృశ్య చిత్రకారుడు కోల్ చిత్రాకళారంగంలో ప్రవేశించిన సమయంలోనే కళాసాధనకి పూను కొన్నాడు అతను ఇర్వింగ్‌ని అనుసరించాడు కొన్ని సంవత్సరాలపాటు నేషనల్ ఎకాడెమీలో సామాన్య సఫలతని ప్రదర్శించాడు 1850 లో సరియైన విషయాన్ని సాధించిన తరుణంలో అతను తన జీవిక కోసం స్వచ్ఛంద అగ్నిమాపక సంస్థలకి ఇంజన్‌ల చిత్రాల్ని చిత్రిస్తూ సంతృప్తి చెందవలసి వచ్చింది అమెరికా ఇంతవరకూ ప్రసాదించిన ఉత్సాహవం తులైన చిత్రకారులలో ఒకడైన క్వీడర్ ఎక్కువ ప్రతిభావంతుడవడం వల్ల తన సమకాలీన చిత్రకళాభిమానుల్ని తృప్తిపరచలేక పోయ్యాడు వారంత వరకూ ప్రశంసించడానికి అలవాటుపడ్డ సుసంస్కృత కళకీ ఇతని కళకీ పోలిక వారికి కన్పించలేదు

క్వీడర్ కళా ప్రపంచంలో ప్రతి ఆకారమూ తీవ్రమైనదీ తీవ్ర చలనముకలదీ పురుషులూ స్త్రీలూ చెట్లూ, ఇళ్లూ, పురాతన పర్వతాలూ తమను సాంప్రదాయిక చతుష్కోణములో బంధించడానికి ప్రయత్ని స్తూన్న చట్రాలని పగలగొట్టడానికి ప్రయత్నించే విపరీత రూపాలలో ఊగుతూ తూగుతూ మనకి కన్పిస్తాయి అతని మొరటుశక్తి అత్యుక్తితో కూడిన వ్యంగ్య ఇర్వింగ్ భావాల్ని చిత్రించేవాడుగాకాక మార్క్ ట్వెయి న్‌కి ఎక్కువ సన్నిహితుడుగా అతన్ని కన్పింపచేస్తాయి నిజంచెప్పా లంటే అతని చిత్రాల్లో నాట్యం చెయ్యడానికి కారణభూతమైన సంగీతం 20 వ శతాబ్దంలో అమెరికా సంగీత గోష్టుల్ని కనిపెట్టే వరకూ మానవ మాత్రులెవరూ వినలేదు.

క్వీడర్ చిత్రం 'వోల్ఫెర్ట్ పీలు' (చిత్రం 22) ఇర్వింగ్ వర్ణిం చిన ఒక వృద్ధలోభిని మనకి చూపిస్తోంది అందులోని లోభి మరణ శయ్యపైనుండి తనవకీలుచేత తనమరణశాశనాన్ని వ్రాయిస్తూ ఉంటాడు మధ్యలో వకీలు అతను కొత్తగా కొన్న పొలం అతి త్వరలో ఎక్కువ ధరని తెస్తుందని చెప్తాడు. చనిపోయే వోల్ఫెర్ట్ మృత్యుద్వారమునుంచి అప్పుడే ముందుకొక అడుగు వేసిన ఆ క్షణాన్ని చిత్రం చూపిస్తుంది అతని కళ్లు మెరుస్తాయి పక్కమీదలేచి కూచుంటాడు తన ఎర్రటోపీని

పైకి ముడుస్తాడు వకీలుకేసి పెద్దకళ్ళతో చూస్తాడు ఇంతకీ తను చావ కూడదని వోల్ఫెర్ట్ నిర్ణయించుకుంటాడు

కుశలవ్యక్తీకరణకి క్వీడర్ వర్ణాలకంటే రేఖలపై ఎక్కువ ఆధారపడ్డాడు అతని చిత్రాలలో గంభీరంగా కన్పించేరేఖలు అతని ఫ్రెంచి సమకాలిక వ్యంగ్య చిత్రకారుడు డామియర్‌ని జ్ఞప్తికితెస్తాయి. క్వీడర్ అతని పేరూ ఊరూ ఎన్నడూ వినలేదు—అయితే క్వీడర్ కంటె డామియర్‌లో సారళ్యం సంయమనం ఎక్కువగా కనిపిస్తాయి. డామీయార్ కళ పారిస్ వీధులలోంచి వికసించినట్లే క్వీడర్ కళ న్యూయార్క్ వీధుల్లో సహజంగా రూపొందింది.

క్వీడర్ కళాక్షేత్రంలో అడుగుపెట్టిన కొన్ని సంవత్సరాలకే ఇంకొక అమెరికన్ దృశ్యచిత్రకారుడు విలియం సిడ్నీమౌంట్ (1807–1868) కళారంగంలో ప్రవేశించాడు. ముందుతరం వారికంటే ఎక్కువ యదార్థవాదియైన మౌంట్ అత్యుక్తికి బదులు సహజత్వానికి ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చాడు. అట్టహాసంకంటె అతని దృష్టిలో మందహాసం మంచిది. అతను సాహిత్యక ప్రమాణాల ఆధారంపై కాక దేశసోదరుల జీవితంలో తను పరిశీలించిన అమెరికన్ జీవన తత్వాలనిమాత్ర మేచిత్రించాడు. అయితే ఒక సుసంస్కృత రూప చిత్రకారుడుగా అతను జానపద ఘటనల్ని చిత్రించాడు అందులో యదార్థత ఉన్నప్పటికీ అదిఅత్యుక్తితో మేళవితమైంది దేశద్రిమ్మరుల్ని అతను జీర్ణవస్త్రాలలో చిత్రించినా ఆ జీర్ణ వస్త్రాలు శుభ్రంగా మంచిరంగులలో అందంగా ఉంటాయి. కళ్లాలలో పాలేర్లు నాట్యభంగిమల్లో నృత్యం చేస్తారు. వరి కట్టలు అతిజాగ్రత్తగా అమర్చి ఉంటాయి. 'గుర్రపుబేరం' (చిత్రం 23) లో మానవ మూర్తులు కలకలలాడుతూ చక్కగా కనిపిస్తాయి వర్ణాలు ఉజ్వలంగా ప్రకాశిస్తాయి దృశ్యావరణలోని స్థలం గాలితోనూ నిండి ఉంటుంది కళ్లం ఎక్కువ వివరాలలో నిండి ఉన్నా చక్కగా కనబడుతుంది అయితే ఈ సుందర చిత్రం భావ విహీనంగా కనిపిస్తుంది మౌంట్ చిత్రించిన కర్షకులు మానసికంగానూ ఆర్థికంగానూ చికు చింతలు లేని వాళ్లు వల్లె జీవితపు లోతుల్లోకి

పోకుండా అపురూపపు దృశ్యాలని ప్రవేశపెట్టడం ద్వారా అతను కులాసా జీవితాన్ని చూపించడమే తన ఆదర్శంగా పెట్టుకున్నాడు

మౌంటు చిత్రించిన సరళచిత్రాలు మన్ననల్నందాయి, అమ్ముడు పోయాయి పట్నవాసులు ఊహించే పద్ధతిలో గ్రామ్య జీవితాన్ని చూపించడం ఇంకా అప్పటికి ప్రచారంలో ఉంది, నగరవాసులు పట్నజీవితపు వాస్తవికతనుండి తప్పించుకొని ప్రశాంతమైన పల్లెపట్టులో తలదాచుకోవాలని కలలుగనేవారు ఉదాహరణకి ఫ్రాంసులో అన్నివస్తువుల్నీ అందంగా చూపించాలనే ఆదర్శాన్ని అకాడెమీ సిద్ధాంతంగా పెట్టుకోవడం వల్ల కర్షకజీవితాన్ని చిత్రించే చిత్రకారుల అవసరం కలిగింది కర్షకుల్ని యధాతధంగా చిత్రించిన ప్రధమ ప్రముఖ చిత్రకారుడు మిల్లెట్ మౌంట్ కంటే చిన్నవాడు అతని అంజేలస్ వంటి చిత్రాలు పారిస్‌లో మొట్టమొదటిసారి ప్రదర్శించబడినప్పుడు అవి వికృతాలుగానూ నిమ్నజాతికిచెందినవి గానూ భావించబడ్డాయి కారణం వాటిలో పరిశ్రమకి వంగిన వీపులూ మొద్దుబారిన చేతులూ చిత్రించబడడం యదార్ధవాదం అప్పటికింకా పుట్టలేదు

అధికార చిత్రకళకి ప్రతిపక్షాన్ని లేవదీసిన సౌందర్యోపాసక చిత్రకారుడు డెలాక్రాక్స్ పౌరాణికవాదులవలె ఫ్రెంచి దైనందినజీవితం యెడల అయిష్టతని కనబర్చాడు కల్పనాలోకాల్లో విహరిస్తూ మొరాకో బజారులనీ, అంతఃపురాలనీ చిత్రించాడు అమెరికాలోకూడా అతని అభిరుచి కనుకూలమైన ఘాతుక విచిత్ర తత్వాల కాటపట్టయిన సుదూర పశ్చిమం ఉంది అక్కడ రెడ్ ఇండియన్‌లు దున్నపోతుల్ని వేటాడుతారు వర్షాన్ని ఆహ్వానిస్తూ నృత్యం చేస్తారు కాని మన సంస్కరణవాద చిత్రకారులు వీటివిషయంలో మోజుపడలేదు ఎవరైనా పలుకుబడిగల చిత్రకారుడు రెడ్ ఇండియన్ జీవితాల్ని ఎక్కడైనా చూపిస్తే దాన్ని మాత్రం వారు ఆదిమకళగా అంగీకరించారు

1830 లో జార్జ్ కాట్లిన్ (1796–1872) అనే పెన్సిల్వేనియన్ చిత్రకారుడు ఆడుబన్ అమెరికన్ పక్షులకిచ్చిన గౌరవాన్ని అమెరికన్ రెడ్ ఇండియన్‌లకి ఇవ్వడానికి నిశ్చయించుకున్నాడు శాస్త్రీయంగానూ

సూక్ష్మంగానూ యథాతథంగా చిత్రాలలో వాటికి శాశ్వతత్వం ఇవ్వడం అతని ధ్యేయం కాని ఆడుబన్‌లో ఉన్న ఉదాత్త గాంభీర్యం కాట్లిన్‌లో లేదు అంతరంగికంగా అతడు విచిత్ర వస్తువుల ప్రదర్శనాన్ని సృష్టించ జూచే ప్రదర్శకుని వంటివాడు, పశ్చిమదేశములలో ఐదుఋతువులలో అతను అద్భుతమైన ప్రతిభతో రెడ్ఇండియన్ నాయకుల రూపచిత్రాలూ వారి ఆచార వ్యవహారాలకి సంబంధించిన దృశ్యాలు, తదితర దృశ్య చిత్రాలూ అయిదువందల వరకూ చిత్రించాడు అతని చిత్రాల్ని ఈ దేశంలో ఎక్కువగా ప్రదర్శించకుండా లండన్ వెళ్ళాడు అక్కడ ఈ చిత్రాలకితోడు సజీవ రెడ్ఇండియన్‌లని కూడా ప్రదర్శించడంద్వారా అతను భయంకర పశ్చిమ ప్రదర్శనాలకి ప్రారంభకుడయాడు ప్రజలకి మోజు తగ్గగా అతను అంతకంతకి డాబుసరి దృశ్యాల్ని చూపిస్తూ పెద్ద పెద్ద కథలు ప్రచారంచేయసాగాడు ఆఖరుకి అతని ప్రఖ్యాతి అదృశ్యమై దివాలా తీయవలసి వచ్చింది

ఇతర చిత్రకారులందరికంటె రెడ్ఇండియన్ జీవితాన్ని ఎక్కువ ఆకర్షణీయంగానూ, యథాతథంగానూ భద్రపరచడం వల్లనూ, తను స్వయంగా తయారుచేసిన ప్రతికృతులూ ఎంగ్రేవింగ్‌లూ ద్వారా అతని చిత్రాలు బహుళ ప్రచారం పొందడంవల్లనూ కాట్లిన్ అమెరికన్ కల్పనా క్షేత్రంలో మాసిపోని ముద్రను వెయ్యగలిగాడు అతని రెడ్ఇండియన్‌లు కూపర్ వర్ణించిన మన ప్రియజానపదగాథలలోని నాటకీయ పాత్రలతో సరిసమానంగా తూగుతారు. హిక్స్ ఆడుబన్‌లవలె కాట్లిన్ స్వీయ నిర్మిత విధానంలో రచన సాగించాడు ఐతే, సారళ్యతలోంచి కచ్చాతనాన్ని విడదీసే శక్తి అతనిలో లేదు, 'మరణాసన్నుడైన రోగిని బతికించే యత్నంలో ఉన్న నేటివ్ వైద్యుడు' (చిత్రం 24) అనేఅతని చిత్రంలోని అతని భావ వ్యక్తీకరణ శక్తివంతమూ మంచి కదలికలతో కూడినది, ఐతే అంతర్నిగూఢమైన వికృతత్వంతో ఆతని సారళ్యత మొరటు బారింది

తండోపతండాలుగా వచ్చిపడే వలసదారులకి ముందుగా సమర్థుడైన చిత్రకారుడెవడూ రెడ్ఇండియన్ జీవితాన్ని చిత్రించడానికి పశ్చి

ఒం ప్రయాణించలేదు ఐతే మిస్సిసిపిలోయ వలసదారులు మొట్టమొదటి ప్రఖ్యాత పశ్చిమదృశ్య చిత్రకారుడుగా తమ కళాచార్యుడు జార్జ్ కాలెబ్ బింఘాం (1811–1879) ని మనకిచ్చారు అతను తన బాల్యాన్ని అతు కుల బొతుకు పొలాలతో కూడి అప్పట్లో మిస్సూరీ అనబడేచోట అతి బీదతనంతో గడిపాడు ఒక వడ్రంగి దగ్గర సహాయకుడుగా పనిచేస్తూనే స్వయంకృషి ద్వారా రూపచిత్రకళ నభ్యసించాడు ఫిలడెల్ఫియా, వాషింగ్టన్‌లలో సఫల సాధకుడుగా సమర్థత సంపాదించేవరకూ అతను తన కృషిలో క్రమక్రమాభివృద్ధి నందాడు కాని 33 వఏట నవనాగరిక తూర్పు నగరాలలో పేరుప్రఖ్యాతులు గడించాలనే తనఆశకి తిలాంజలి ఇచ్చి తన శాలైన్ గ్రామ నివాసానికి వచ్చి జేరుకున్నాడు అక్కడే అతడు దృఢ గాత్రులు ఐన తన ఇరుగు పొరుగువారి జీవిత చిత్రణకి పూనుకొన్నాడు. తానింతకు పుందు ప్రసిద్ధికెక్కని ప్రాచీన కేంద్రాలలో అతను అతిత్వర లోనే ప్రఖ్యాతి నందాడు

ప్రాచ్య చిత్రకళాశాలల స్నాతకులు 'కళాత్మకాలంకృతు' లను నిర్మిస్తూన్న సెంట్ లూయీ సమావేశాలు బింఘాం చిత్రకళని ఆకర్షించ లేక పోయాయి మిస్సూరీ తీరభూముల్లో తిరుగుతూ అతను పడవల వాళ్ళ చిత్రాలు, వాళ్ళు చేపల్ని పట్టుతూన్నట్లూ తాగుతూన్నట్లూ, తందనా లాడుతున్నట్లూ, పడవ సామానుల ప్రక్క చతికిల బడినట్లూ రకరకాలుగా గీశాడు అతని కుంచె సుదూర పశ్చిమవనాల నుంచి తిరిగివస్తూన్న ఉన్ని వ్యాపారులని చిత్రించింది. స్వయంగా రాజకీయవేత్త గనుక వాగ్ధోరణితో త్రాగుడు మేళవితమైన అనేక ఎన్నికల దృశ్యాల్ని చిన్నపిల్లలూ కుక్కలూ వాటిలో కనిపించే సహజమైన గందరగోళానికి దోహద మిచ్చాయి అతని 'మాంసంకోసం కాల్పులు' (చిత్రం 25) ఒక చక్కని సరిహద్దు వేటని మనకి చూపుతుంది లేడిని మాంసంగా మార్చినతర్వాత అందరికంటే బాగా పేల్చిన వాడికి మంచి ముక్క దొరుకుతుంది

శ్రమిక దృశ్యాల కంటే విశ్రామిక దృశ్యాలని ఎక్కు ఇష్టంగా చిత్రించే బింఘాం వాలుపడవల్లో పేకాడుకుంటూ ఇంటికివచ్చే పడవవాళ్లని ఎక్కువగా చిత్రించాడు కాని ఎదురుపడవల్లో ఒంగిన భుజాలతో

పడవల్ని త్రోసే దృశ్యాల్ని అతడెన్నడూ చూపించనేలేదు ఐతే మౌంట్ చిత్రాల్ని బలహీనపరచే మౌంట్ చిత్రాలలోని సారళ్యం అతనికి ఎన్నడూ అడ్డు తగలలేదు ఈ విషయంలో అతను సఫలుడనే చెప్పాలి అతను ప్రత్యేక వ్యక్తుల చిత్రాల్ని విడివిడిగా పూర్తిచేసి వాటిని తిరిగి మంచి శక్తివంతాలైన గుంపుచిత్రాలుగా తయారుచేశేవాడు దీన్నిబట్టి మనకి అతను పూర్వాచార్యుల చిత్రాల్ని ఏదోవిధంగా బహుశః – ఎంగ్రేవింగ్‌లద్వారా–, బాగా అభ్యసించినట్లు మనకుతెలుస్తుంది ఐతే అతనుతన స్వంతపద్ధతిలో చిత్రించిన చిత్రాలలో ఈ అనుకరణ మనకెంతమాత్రం కనిపించదు అతను ఒక మంచి శక్తివంతుడైన చిత్రకారుడు

ప్రౌఢ వయస్సులో బింఘాం ఆఖరికి సాంప్రదాయానికి లొంగి పోయాడు అతను డూస్సెల్‌డార్ఫ్ అనే వెనుకబడ్డ యూరోపియన్ చిత్ర కళా కేంద్రానికి యాత్రసాగించాడు. అక్కడ ఎమాన్యుయెల్ లుజ్జ్(1816–1868) డెలావేర్‌ని దాటుతో హషింగ్టన్ అనే తన నాటకీయ చిత్రానికి వృత్తిలోనున్న జెర్మన్ మోడల్స్‌ను ఆకాలంలోనే అధ్యయనం జేశాడు. అదిచూసి మన మిస్సూరియన్ కూడా అదేపద్ధతిలో పనిచెయ్యసాగాడు, అతని బొమ్మలలోని అతిగా వ్యక్తమైన కదలికలు జీవితంలోని సాదా అందం గల చక్కని కదలికల్ని అదృశ్య పరచాయి అతని బొమ్మలలో చక్కగా వ్యక్తమయే సమర్ధత భావాత్మక పక్షమూ ఏవిధంగా నశించి పోయాయో చూస్తే హృదయవిదారకంగా ఉంటుంది బహుశః అదే మాత్రలో అతని ఉత్సాహంకూడా నశించిఉండాలి తత్ఫలితంగానే మిస్సూరీ తిరిగివచ్చాక బింఘాం దృష్టి కళనుంచీ రాజనీతికి మరలి ఉంటుంది

అమెరికన్ చిత్రకారులు అమెరికా సాక్షాత్కారం పొందినప్పటి నుంచీ వారిచిత్రాలు బాగా అమ్ముడుపోసాగాయి ఒకావొకప్పుడు రూప చిత్రాలతోనే సంతృప్తి పొందిన కుటుంబాలు తమకి ప్రియమైన పరిచిత సామాన్యజీవితదృశ్యాలకోసం తహతహలాడసాగారు మోర్స్ వేండర్లిన్ చిత్రించిన పౌరాణిక చిత్రాలని పోగుచేసుకున్న ప్రజాసామాన్యం కోల్ యొక్క కౌట్స్‌కిల్ దృశ్యచిత్రాలకోసం మౌంట్ యొక్క లాంగ్ అయిలాండ్ పొలాల దృశ్యముల కోసం కొట్టుకుపోసాగింది త్వరలోనే



ఆడుబన్

పిట్టలు

చిత్రం 17



డురాండ్

ప్రకృతి దేవతలు

చిత్రం 18



చర్చ
ఆండీస్ గర్భం
చిత్రం 19



కోల్

కనెక్టికట్ మెలిక

చిత్రం 20



ఇన్నిస్

డిలా వేర్ నీటికయ్య

చిత్రం 21



మౌంట్

గుర్రపుబేరం

చిత్రం ౨౩



కాట్లీన్
నేటివ్ వైద్యుడు
చిత్రం 24



బింఘాం

మాంసంకోసం కాల్పులు

చిత్రం 25



కేసట్

మాతృత్వం

చిత్రం 26



విస్లర్

నలుపు బూడిదిరంగుల ఏర్పాటు

చిత్రం 27



లాఫార్జ్
స్వర్గారోహణము
చిత్రం 28



రైడర్
నల్లని తెరచాప
చిత్రం 30



సార్జెంటు
మద్రాంగ్రోతూ
చిత్రం 32

ప్రాంతీయ చిత్రకారులమీద అభిమానం గుర్తుపట్టగల స్థానికదృశ్యాలమీది అభిమానంగా పరిణమించింది చర్చ్‌యొక్క దక్షిణఅమెరికా, మధ్యధరా తీర దృశ్యచిత్రాలు బీర్‌స్టాట్ చిత్రించిన రాకీపర్వత దృశ్యచిత్రాలవలె మంచి వెలకి అమ్ముడుపోసాగాయి ఆ రోజుల్లో అన్నిటికంటా బాగా అమ్ముడుపోయినవి కోల్ నైతికచిత్రాల ప్రతిలిపులు, రెడ్‌ఇండియన్‌ల జిల్లాలలోకూడా అవి ఆదర్శగృహాలంకరణలుగా చలామణీ అయాయి 19వ శతాబ్దమధ్యంలో మన చరిత్రలో ఇంతకుముందెన్నడూ కనీవినీ ఎరుగని విధంగా అమెరికన్‌లు అమెరికన్ చిత్రాల్ని కొనడంలో ఎక్కువ శ్రద్ధ చూపారు. మన జాతీయ ఆదాయంలో అభివృద్ధి కారణంగా చాలా మంది పౌరులు చిత్ర సేకరణ సాగించారు ఐతే అప్పటికింకా మన ధనవంతులు ప్రాచీన ఆధునిక సుప్రసిద్ధ విదేశీయ నమూనాలని కొనడంలో యూరోపియన్‌లతో పోటీపడగలిగినంతగా ధనవంతులు కాలేదు లాటరీలలో ఎమకారీన అమెరికన్ చిత్రాల్ని అమ్మే కళాసంఘాలు మధ్యతరగతి వారిని బొమ్మలమార్కెట్టుకి వచ్చేట్లా చేసేవి ప్రతివ్యక్తి ఏ ఎంగ్రేవింగో కొనేవాడు ఎక్కువ అదృష్టవంతులు ప్రసిద్ధ కళావేత్తలు మెచ్చుకున్న గొప్పచిత్రాలతో ఇంటికి జేరుకొనేవారు ఈ సంస్థలు విజయవంతంగా పనిచేశాయి దూరదృష్టిలేని సంస్కర్తలు దాన్ని జూదపు వ్యాపారంగా నిర్ణయించి అరికట్టేలోపుగా ఈ సంస్థలద్వారా సుప్రసిద్ధ చిత్రకారులచిత్రాలు దేశం మారుమూలాలకీ వ్యాపించాయి

1860 నాటికి మన చిత్రకళ శక్తి సామర్థ్యాలతో ఒత పోత్రమై ఉంది, సారళ్యం కంటె సామర్థ్యానికి ఎక్కువ ప్రాధాన్యత ఏర్పడింది తమతమ వ్యక్తిత్వాలని చూపించాలనే సాహసం చిత్రకారులలో ఎక్కువైంది ఐతే ఇంకా గంభీరసమస్యలు ఉండిపోయాయి ఇన్నెస్ వంటి ఏ కొంతమంది ప్రత్యేక వ్యక్తులలో తప్ప చిత్రకారులు సూక్ష్మకల్పనా శక్తిని గోల్పోయారు నిపుణ చిత్రకారులు గుసగుస లాడవలసిన చోట వారు పెద్దపెద కేకలు వేసేవారు ఇంతేకాదు అభిరుచి సమస్యకూడ అక్కడ అడ్డయి నిలిచింది ఒకప్పుడనుకున్నట్లుగా అభిరుచి అంటే నాజూకుతనమా? మరి ఐతే నాజూకుతనం లేని అమెరికన్‌లు దాన్ని

సాధించడం ఎల్లా తాము హృదయపూర్వకంగా విశ్వసించే మూలసిద్ధాంతాల్ని విడనాడి అత్యుక్తులతో కూడిన యూరోపియన్ విధానాల వ్యామోహంతో మన చిత్రకారులు ఏ విధంగా తగులొన్నారన్నది బింఘాం పతనము మనకి తెలియజేస్తోంది ఇన్నేన్ ద్విసాంస్కృతిక సమన్వయం మనకొక త్రోవ చూపిస్తున్నప్పటికీ పాతకొత్త ప్రపంచాల సంస్కృతుల మధ్య స్వస్థసమన్వయాన్ని ధృవపరచగల సామాన్యసిద్ధాంత మేదీ అప్పటికి ఏర్పడలేదని మనం నమ్మవచ్చు

# 5

# సఫలతా శిఖరాలు

జేమ్స్ మాక్‌నీల్ విస్లర్ (1834–1903) మెస్సాచూసెట్స్ లోని లొవెల్ నుంచివచ్చాడు చాలాకాలం తర్వాత ఈ విషయం దృష్టికితేగా ఆయన అన్నాడు "నేను ఇష్టంవచ్చినప్పుడు ఇష్టంవచ్చినచోట పుడతాను లొవెల్‌లో పుట్టాలని మాత్రం నేనెన్నడూకోరుకోను "

తొమ్మిదేళ్లప్పుడు విస్లర్ రష్యావెళ్లాడు అతని తండ్రి అక్కడ ఒక రైలుమార్గం నిర్మిస్తున్నాడు ఆబాలుడక్కడ కొన్ని సంవత్సరాలు ధనికసామంత జీవితాన్ని గడిపి ఆరోగ్యంకోసం లండన్ వెళ్లాడు ఆతర వాత అతని తండ్రి చనిపోయాడు జారు ప్రభువు తన కొడుకునకు రాజో చిత పద్ధతిలో విద్య గరపిస్తానని చెప్పినసూ వినక అతని తల్లి అతనిని తిరిగి దారిద్ర్యా వాసమైన మెస్సాచూసెట్స్ పూరికొంపకి తీసుకువచ్చింది. ఉన్నచోట ఉండకుండా బాల్యాన్ని స్వేచ్ఛగా గడపిన విస్లర్ స్థిరపడలేక పోయాడు. ఇంజన్‌ల కర్మాగారంలో పనిని విడిచిపెట్టి అతను వెస్ట్ పాయింట్ నుండి పారిపోయాడు ఒక పుస్తకంలో ఆతను పారిస్ చిత్ర కళా విద్యార్థుల స్వేచ్ఛాచార జీవితాన్ని గురించి చదివాడు. వెంటనే అతను పారిస్ ప్రయాణమయ్యాడు అక్కడినుంచి అతను తిరిగిరాలేదు

ఇంగ్లండ్‌లోనూ అమెరికాలోనూ ఫ్రాన్స్‌లో వలె వికసిస్తున్న సిద్ధాంతాల్ని సమన్వయపరచేందుకు అభ్యుదయ పారిస్ చిత్రకారులు ప్రయత్నం చెయ్య సాగారు అనేక సంవత్సరాలు క్రమవికాసంపొందిస ఈ

ఉద్యమం తర్వాత తర్వాత ఇంప్రెషనిజం అని పేరుపొందింది ఈపేరు అసలు ఉద్యమంయొక్క అంశికదృష్టి కోణాన్ని వ్యక్తపరుస్తూన్నా దాని పూర్ణరూపాన్ని ఒక్కవాక్యంలో చెప్పవచ్చు ఒకరూపంలో మన బుద్ధికి అవగతమయే విషయాలన్నిటినీ చూపించకుండా ప్రధమ దర్శనంలో మన కన్ను ఆకట్టుకో గలిగిన విశిష్టమైన యధార్థ అభిప్రాయాన్ని వ్యక్తపరచడమే ఇంప్రెషనిజం నేత్రవిజ్ఞాన శాస్త్రాధారంతో మళ్లీ ఇందులో మార్పు వచ్చింది పరంపరాగతంగా చిత్రకారులు ఒకవస్తువునుండి ఎక్కువ వెలుతురు పడేవైపునుంచి దూరమవుతూన్న కొద్దీ వారుపయోగించే రంగుల్ని క్రమక్రమంగా చిక్కపరచుచూ నల్లని నీడలలోకి కలిపివేయడం పద్ధతిగా వస్తోంది కాని విస్లర్ సమకాలీనులు నీడలు తమని చుట్టువారుకున్న వాతావరణలోంచి ప్రతిబింబించే అనేకరంగులతో సజీవంగా ఉంటాయన్న విషయం గ్రహించారు ఈ ప్రకాశాన్ని బాగా వ్యక్తపరచడానికి పేలట్లపైన రంగులను కలపకుండా రంగుముద్దలను దగ్గర దగ్గరగా అద్దడంద్వారా ప్రేక్షకుని కళ్లే వాటిని కలుపుకుని చూచేట్లా చేశారు వస్తువుల స్పష్టత వాతావరణలో వాటి స్థితి తరుచు అస్పష్టంగా చూపబడేవి ఐతే తాము చూపించగలిగిన ప్రకాశమానమైన ఉజ్వల వ్యక్తీకరణం ముందు పై లోటు చిత్రకారులని అంతగా బాధించేది కాదు

శుద్ధ దృష్టి ప్రాముఖ్యత నైతిక, ఆధ్యాత్మిక విషయాలని వ్యక్తపరిచేందుకు అడ్డుతగిలేది ఫ్రాన్స్‌లోని ధనికవర్గ అధికారాన్ని అన్ని విధాలా ద్వేషించే ఆ తరం వారిని ఇది అట్టే బాధించలేదు కళ కళ కొరకే అన్న సిద్ధాంతాన్ని చిత్రకారులూ రచయితలూ బాగా ప్రచారం చేశారు చిత్రకారులు కూడా ఉచ్చవర్గంవారేనని భౌతికంగా బీదవారైనా మానసికంగా ధనికులనీ, సామాన్య ప్రజలకంటె వారు గొప్పవారని వారి వాదన తమ కళద్వారా కాని, తమ ప్రవర్తనద్వారా కాని సాటి ప్రజలను పైకి తీసుకు రావలసిన తమ కర్తవ్యాన్ని వారు గుర్తించక పోవడం అలాగుంచి, ప్రతిభకి సామాన్య మూల్యాలతోటి, కల్పిత నియమాలతోటి ఏం సంబంధం లేదని వారు నమ్మారు చిత్రకళ కధ చెప్పదు, నీతిని బోధించదు చిత్రంనుంచి మనం ఆశించేది ఒక్కటే అది సౌందర్యం

చిత్రం లోని సౌందర్యాన్ని స్వయంగా చిత్రకారుడు తప్ప ఇతరులెవరూ ఆస్వాదించలేరు

ఏ వాతావరణంలోను తనను ఇముడ్చుకోలేక బాధపడే విస్లర్ ఈ సిద్ధాంతానికి ముగ్ధుడై పోయాడు ఆనికవస్త పద్ధతుల్ని ద్వేషిస్తూ అతను తన మోడల్స్‌తో కలసి నివసించసాగాడు తాకట్టు అంగడి నుంచి తిరిగి వచ్చి అతను గొప్పగా, "ఇప్పుడే నా వాష్ స్టాండుని తిని వస్తున్నాను" అని చెప్పుకున్నాడు తక్షణ భావ వ్యక్తీకరణకీ తన చిత్రకళని అంకిత మిచ్చిన మొట్టమొదటి కార్మిక చిత్రకారుడతనే కాని వెల్తురుకీ రంగులకీ సంబంధించిన ఈ కొత్త పద్ధతిని అతను అంత ఎక్కువగా అనుసరించ లేదు

లండన్‌లో స్థిరపడి అతను ఒక ఎర్రజుట్టు మోడల్‌తో ఘనిష్ట సంబంధాన్ని ఏర్పరచుకున్నాడు వివరాలు కనిపించని ఆకారాలని చిత్రిం చాడు చిత్రం యొక్క విషయం ఏ మాత్రం ప్రధానమైనది కాదన్న తన అభిప్రాయాన్ని స్పష్టపరిచేందుకు అతను "నలుపు, బూడిద రంగుల ఏర్పాటు" వంటి పేర్లు తన చిత్రాలకి పెట్టాడు పై చిత్రాన్ని (చిత్రం 27) గురించి 'చిత్రంలోని వ్యక్తి పోలికతో ప్రేక్షకులకేం సంబంధం లేదు ఇది నా తల్లి చిత్రం, కనుక ఇది నా స్వవిషయం అని వ్రాశాడు లక్షల కొలదీ ప్రేక్షకులు తమ మాతృ ప్రేమని ఈ చిత్రంలో సాక్షాత్కారం పొందడాన్ని బట్టి విస్లర్ తన సిద్ధాంతాల అవధులని దాటి మానవత్వంలో ఎక్కువ సంచలితుడయాడని మనం అనుకోవచ్చు

పసిఫిక్ మహాసముద్రంలో జపానుతో ఎర్తకానికి త్రోవతీసిన ఎడ్మిరల్ ఫెర్రీ నౌకాయాత్రలు చిత్రకళలో గొప్పమార్పుల్ని తెచ్చాయి అప్పుడే యూరప్‌కి ప్రవహిస్తూన్న జపాన్ చిత్రాలు విస్లర్‌కి చాలా ప్రోత్సాకరంగా ఉండి అతని సూక్ష్మ శైలిని వికసింప జేశాయి అతి తక్కువ ఖర్చుతో అతను గొప్ప ఎచ్చింగ్స్ తయారుచేశాడు నల్లని దృశ్య వాతావరణలో కొన్ని రంగు చుక్కలు వెయ్యడంద్వారా థెమ్స్ మీది రాత్రిని అతను చూపించాడు బ్రిటిష్ కళాభిమానులు చిత్రంలో వివ

రాళ్ళి కోరే తమ అలవాటుకి వశులై దీన్ని హేళన చేశాడు విస్లర్ వారిని సౌందర్యం గ్రహించలేని అనాగరికు లన్నాడు బ్రిటిష్ అభిరుచికి ముఖ్య ప్రతినిధి జాన్ రస్కిన్ ఈ మొక్కని మొదట్లోకి తుంచి పారెయ్యడానికి నిర్ణయించు కున్నాడు. అతను రాశాడు – "విస్లర్ అశిక్షిత మోసబుద్ధి ప్రజల్ని మాయలో పడేసింది నేనింతకుముందు అనేకమాయ మంత్రాలని విన్నాను, చూశాను, కాని ప్రజల మొహంమీద ఒక కుండెడు రంగు వెదజల్లి రెండువందల పౌన్లు ఇయ్యమని అడిగే మోసగాళ్ళు కూడా ఉంటారని నేనెప్పుడూ అనుకోలేదు" ఇంగ్లాండంతా ఆశ్చర్య పోయేలాగ విస్లర్ నష్టపరిహారం దావా తెచ్చాడు సాక్షిబోనులో అతను చాలా హేళనగానూ వ్యంగ్యాత్మకంగానూ ప్రవర్తించాడు అవమాన నష్ట పరిహారంగా అతను ఒక ఫార్తింగ్ గెలిచాడు

విస్లర్ తన కళాహీనులైన సమకాలీనులను లెఖ్ఖపెనట్టట్లు నటించి నప్పటికీ అతను వారి దృష్టిలో ఎల్లప్పుడూ పడుతూనే ఉండేవాడు విచిత్ర వేషాలలో వీధులలో తిరుగుతూ పత్రికలకి తిడుతూ ఉత్తరాలు రాసేవాడు ప్రేమించబడి పొగడ్తల నందవలసిన అవసరమున్న శిశువులా అతను ప్రవర్తించేవాడు అతని ఫ్రెంచి సహచరుడు డెగాస్ అతనితో అన్నాడు, "మిత్రుడా! నువ్వు ప్రతిభా విహీనుడిలా ప్రవర్తిస్తున్నావు" ప్రతిపక్షవాదనలను ఖండించేందుకు తన శక్తిని అంతగా వినియోగించి ఉండకపోతే విస్లర్ ఇంకా గొప్పచిత్రకారుడై ఉండేవాడనడంలో ఏం సందేహం లేదు అతని ఈ చిడిముడిపాటునిబట్టి అప్పట్లో అమెరికన్లు తమ కొత్త దేశంతో ఐక్య మయేందుకు ఎంతగా కష్టపడవలసివచ్చేదో మనం గ్రహిచవచ్చు

బ్రిటిష్ చిత్రకళా చరిత్రని బట్టి చూస్తే తను అనుకున్నదానికంటె అతను ఎక్కువ సఫలుడయాడనే చెప్పాలి అతని సమకాలిక చిత్రకారులందరికంటె అతని కందులో ఎక్కువ స్థలం ఇవ్వబడింది యూరప్‌లో మంచి పలుకుబడి కలిగిన అమెరికన్ ఆర్టిస్ట్‌గా విస్లర్ బెంజమిన్ వెస్ట్‌తో పోటీపడేవాడు. నిజానికి ఇద్దరిలో అతను చాలాగొప్ప ఉజ్వల సృష్టికర్త అతని ఎచ్చింగులు ఆ కళావిధానంలో మచ్చుతునకలు అతని చిత్రాలు అద్భుతమైన సౌందర్యంతో తొణికిసలాడుతాయి విస్లర్ దృశ్య చిత్రాలు

ప్రకృతికి సుస్పష్ట ప్రతిబింబాలు కాకపోయినా చక్కని డిజైనులుగా అవి పేరు పొందాయి మాతృ ప్రేమాతిరేకంతో చిత్రించబడ్డ అతనితల్లి తప్ప మిగతా అతని చిత్రాలలోని వ్యక్తులు యదార్ధంగా గాక అలంకార ప్రాయంగా కనిపిస్తారు వారు వాళ్ళ చిత్రాలలోంచి ఈ మూడు కొలతల ప్రపంచంలోకి అడుగు పెట్టలేరు స్విన్‌బర్న్ అద్దములో చూసుకొంటూన్న చిత్రకారుని ప్రేయసి రూపచిత్రాన్ని వర్ణిస్తూ ఒక పద్యంలో వాటి వింత ఏకాకితనాన్ని వ్యక్తపరిచాడు

మంచు కురవనీ, గాలి వీవనీ
ఆకాశంలో తుఫాను రేగనీ
నేను నాముఖం చూసుకొంటాను
నా మెరిసే జుట్టుని మెచ్చుకొంటూనే ఉంటాను,

విస్లర్ తను నివసించిన యూరప్‌ని తన వంటరి తనపు కళ్ళతో చూశాడు ఫ్రెంచి ఇంప్రెషనిస్టులు ఒక సంఘంగా వ్యవహరిస్తూ ఒకళ్ళ కొకళ్ళు బలాన్నీ శక్తినీ ఇచ్చుకున్నారు, కాని విస్లర్ శూన్యరంగంలో నటించే ఏకపాత్రధారిగా ఉండిపోయాడు. శూన్యరంగంలోని ఏకైక జ్యోతి అతని ముఖాన్ని ప్రకాశింప జేసిందనడంలో ఏం సందేహంలేదు

విస్లర్ విదేశాలలో బాల్యాన్ని గడిపే రోజుల్లో ఒక న్యూయార్క్ ప్రాసాదంలో జాన్ లాఫార్జ్ (1835–1910) పెరగసాగాడు ఐతే బౌద్ధిక దృష్టికోణంతో చూస్తే లాఫార్జ్ ఒకవిదేశ జాతిలో వేరే యుగంలో పుట్టినవాడుగా కనిపిస్తాడు అతను 18వ శతాబ్దానికి చెందిన ఫ్రాన్స్ చిత్రకారుడిగా ప్రసిద్ధికెక్కాడు. ఫ్రెంచి ధనిక వలస దారుడైన అతని తండ్రి పిల్లవానిచుట్టూ దిగుమతిచెయ్యబడ్డ చిత్రాలనీ తదితర సుందరవస్తువులనీ పేర్చేశాడు. ప్రాచీన యూరోపియన్ గ్రంధాలమీద అతనికి ఆసక్తిని కలగ జేశాడు కాథలిక్ స్కూళ్లను దాటిన తర్వాత లాఫార్జ్ పారిస్‌లోని తన బంధువుల్ని చేరుకొన్నాడు విస్లరూ, అతని 'చొక్కాలు లేని స్నేహితులు' తాకట్టు అంగడికి పరుగెడుతూ, ఈ ప్రశాంత అమెరికన్ చిత్రకారుడు తన సుసజ్జితమైన చిత్రకళాకక్షకి వెడుతూండగా చూసి పెదవులు

విరుచుకొన్నారు లాఫార్జ్‌కి ధనవంతులైన లలితకళాభిమానుల ప్రాపకం ఉంది ఈ యువకచిత్రకారుడు ఎకాడెమీ చిత్రకారుడైన జెరోం తో కలిసి కొంతకాలం కళాసాధన చేశాడు ఐతే ముందే లాఫార్జ్ తను చిత్రకారుడయే ఉద్దేశంతోకాక ఊరికే అభిరుచిని పెంపొందించుకోడానికే కళాసాధనచేస్తున్నానని చెప్పుకున్నాడు

స్వదేశానికి తిరిగివచ్చిలాఫార్జ్ న్యాయశాస్త్రం అభ్యసించాడు అందులోంచి మళ్లీ చిత్రకళలోకి కొట్టుకువచ్చాడు అతను వెలుతురుతో ఎక్స్‌పెరిమెంట్‌లు చేశాడు ఫ్రెంచి ఇంప్రెషన్ వాదులను దాటిపోయా నని చెప్పుకుంటూ కొన్ని చిత్రాలు చిత్రించాడు కాని అతను తన భిత్తి చిత్రాలతో భవనాలనీ అద్దాలకిటికీలనీ అలంకరించడం ప్రారంభించేవరకూ సరియైనత్రోవలో పడలేదు ఇతరవస్తువులవలెనే యూరోపియన్ సంస్కృ తిని కూడ డబ్బిచ్చి కొనుక్కోవాలని చూచే కొత్త కోటీశ్వరులతో కూడిన సౌభాగ్యపు రోజులను ఇంతకుముందు ఎంతో ఆసక్తితో సంగ్రహించ బడిన అమెరికన్ చిత్రకారుల కృతులు నేడు పనికిమాలిన వయాయి చిత్రవ్యాపారులు పూర్వాచార్య చిత్రాలని సముద్రం మీదుగా జేరెయ్య సాగారు గృహ శిల్పుల పాతప్రపంచంలోని భవనాలని కృత్రిమాలంకారా లతో నింపేశారు గోతిక్, పౌరాణిక లేక ఇంకె సాంప్రదాయ విధానంలో ఇష్టం వచ్చిన నిర్మాణాలు జరిగాయి ఒక దాన్ని ఒకటి తారుమారు చేసి ఉత్తమ నమూనాల ఆధారంతో నిర్మాణాలుసాగాయి లాఫార్జ్ అభిరుచు లకి అనుకూలంగా భిత్తి చిత్రాలని చిత్రించాడు మిన్నెసోటా రాజధానిలో న్యాయశాస్త్ర వికాసాన్ని చిత్రించే పనికి ఒప్పుకుని అతను ఒక బైబిలు దృశ్యాన్నీ రెండు గ్రీకు సంఘటనల్నీ, ఒక మధ్యయుగాన చిత్రాన్నీ చిత్రిం చాడు న్యాయశాస్త్రం 11 వ శతాబ్ది నుంచీ క్రమాభివృద్ధి నందిందనె విష యంతో లాఫార్జ్‌కి ప్రమేయం లేక పోయింది అతను దేన్నైనా గంభీ రంగా చిత్రించాలనే కోరిక కలిగినప్పుడు అనేక విభిన్న ఆధారాల్ని గుచ్చెత్తి ఒక చిత్రంగా తయారుచేసెవాడు తన సుప్రసిద్ధ స్వర్గారోహ ణము (చిత్రం 28) లో అతను ఇటాలియన్ ఉద్ధానయుగానికి సంబంధిం చిన వ్యక్తుల్ని జపాన్ దృశ్య చిత్రానికి అతికించాడు ఆ భిత్తి చిత్రం

నేర్పరితనానికీ అలంకారత విధానానికీ, గంభీరతకీ పేరుపోందినదైననూ హృదయాన్ని సంచలనపరిచే శక్తి అందులో లేదు

లాఫార్జ్ తన వ్యక్తిగత దృఢ నమ్మకాల్నీ, తన ఇరుగుపొరుగు వాతావరణాన్నీ తప్ప మిగతా అన్ని విషయాలనీ చిత్రించగలడు తన పూర్వీకుడైన ఆల్స్టన్ వలె అమెరికన్ ఎడారిని ఫలవంతంగా చెయ్యడానికి కాలానికి సంబంధించిన సంస్కృతిని ప్రవహింపజేసే ఒక ప్రవాహముగా అతను భావించబడ్డాడు వర్తమాన కాలంలో జన్మించిన ఒక కొత్త చిత్రకారుని కంటె ఆసమయంలో పుట్టిన అతనివంటి పూర్వాచార్యుడు గొప్పవాడుగా భావించబడేవాడు. కరచాలనం చేసే వ్యక్తి పరిచయ పద్ధతికి వ్యతిరేకుడైనా సంఘంలో వారిని తన సాధుస్వభావం వల్ల ఆకర్షించుకోడం లాఫార్జ్‌లో ఒక మంచి సుగుణంగా భావించబడింది

విన్‌స్లో హోమర్ (1836–1910) ఆగంతకులకు దృఢమైన కరచాలనంద్వారా స్వాగతమేనా ఇస్తాడు, లేదా ఏకాకి తనంతో బాధపడుతున్నప్పుడు భళ్ళున తలుపుమూసి వాళ్ళకి ఉద్వాసనేనాచెప్తాడు హోమర్ తన బాల్యాన్ని 18 వ శతాబ్దపు ఫ్రాన్స్‌లో గడపలేదు. మెస్సాచూసెట్స్ సెలయేళ్ళలో చేపల్ని పట్టుతూ గడిపేడు ఒక లిథోగ్రాఫర్‌కి సహాయకుడుగా ఉంటూ అతను ప్రసిద సంగీత గ్రంధాల అట్టలకి అందమైన ఆడపిల్లల బొమ్మలు గీసేవాడు పల్లెటూరి సంబరాలని వ్యక్తపరిచే పత్రికా చిత్రకారుడుగాకూడ అతను పనిచేశాడు ఆ తరువాత యుద్ధాలమీది మోజువల్లగాక ఇళ్ళకి దూరంగా ఉన్న యువకుల ఏకాకితనాన్ని వాళ్ళ భోగవిలాసాన్ని వ్యక్తపరిచేందుకే అతను అంతర్యుద్ధ సమయంలో యుద్ధ చిత్రకార విలేఖరిగాకూడ పనిచేశాడు ఇరవయ్యేడో ఏడు వచ్చాక అతను ఎక్కడా నేర్చుకోకుండానే తైలవర్ణ చిత్రాలు చిత్రించడం మొదలెట్టాడు "ఎవరేనా చిత్రకారుడు కావాలంటే ఎప్పుడూ ఏ విధమైన చిత్రాల్నీ చూడకుండా ఉండాలి," అని అతననేవాడు. కొత్త చిత్రకారుల విషయంలోగాక ప్రాచీన చిత్రకారుల విషయంలోకూడా అతనిదే అభిప్రాయంతో ఉండేవాడు యూరోపియన్ చిత్రకళపట్ల అతనికిగల నిర్లక్ష్యభావాన్ని అతని మిత్రులుకూడా చాలాహాస్యాస్పదంగా భావించేవారు,

హోమర్ చిత్రించిన బడిగదులూ ఆటపాటలూ తేనె పట్టులతో తేనెటీగలూ మొదలైన అమెరికన్ దృశ్యాలు నగరవాసులచేతతప్ప మిగిలినవారందరిచేతా మన్ననలు పొందాయి అమెరికాలోనూ యూరప్‌లోనూ కూడ యువచిత్రకారులకి సహజంగా ఛాయావాద భావాలు వంటబట్టడం వల్ల స్వయంప్రతిభావంతుడైన విస్లర్ వలెనే, స్వయంకృషివల్ల పైకి వచ్చిన హోమర్ తన వెనుకటి తరంవారిచేత విమర్శింపబడ్డాడు అయితే చిత్రవిషయం అప్రధానమైనదనే విస్లర్ అభిప్రాయంతో హోమర్ ఎన్నాడూ ఏకీభవించలేదు. అతను అమెరికన్ పల్లెపట్టు జీవితాన్ని ప్రేమించాడు తన తృషిత నేత్రాల ముందు సాక్షాత్కరించిన ఆ సరళ ఆనందిమయ జీవితాన్ని వ్యక్తపరచడానికి అతను యత్నించాడు

సాంస్కృతిక యూరప్‌ను ఉన్నదున్నట్లు సమగ్రంగా స్వీకరించేందుకు తయారుగానున్న హెన్రీ జేమ్స్ హోమర్ చిత్రాన్ని భయకంపిత ఆసక్తితో చూశాడు అతనురాశాడు "హోమర్ చిత్రించిన చలచిత్తులైన నిడుపువెంట్రుకల అమెరికన్ అల్లరికుర్రవాళ్లంటే నా కసహ్యం అతని చదును గుండెల అమ్మాయిలు రొట్టెలనీ ఉండ్రాళ్లనీ జ్ఞాపకం చేస్తారు అతని కాలికో టోపీలు అతని ఫ్లానెల్ చొక్కాలు అతని ఆవు చర్మపు బూట్లు అన్నీ అదోరకంగా కనిపిస్తాయి" హోమర్ అతి సామాన్య నాగరికతలకి సంబంధించిన అతి సామాన్య విషయాల్ని చిత్రించాడని ఆ పనికిమాలిన విషయాల్నే గొప్ప పౌరాణిక విషయాలుగా హోమర్ భావించేవాడనీ జేమ్స్ ఆరోపణ. "అన్నిటినీ మించిన దేమంటే అతను మన కంటికి ఎంతో అసహ్యంగా కనిపిస్తోన్నా అతనిలో అందర్నీ ఆకర్షించే శక్తి ఏదో ఉంది." హోమర్ చిత్రాలవల్ల ఆకర్షితులై కంగారుపడే విమర్శకులు అప్పటినుంచి జేమ్స్‌యొక్క ఈ అభిప్రాయాన్నే వ్యక్తపరుస్తున్నారు హోమర్ ఎన్నడూ చిత్రకళని సూక్ష్మంగా అధ్యయనం చెయ్యలేదు కట్టెలుకొట్టేవాని గొడ్డలిపెట్టులా అతని ఆకారాలు అతి తీక్షణంగా మనని ఆకర్షిస్తాయి మనం ఉలిక్కి పడతాం, కాని దెబ్బ తీక్షణమైనదన్న విషయాన్ని మనం మరిచిపోలేం

హోమర్ తన ఆదిమకళతో సంతృప్తి పొందాడని అనడానికి వీలు లేదు రచనా విధానాన్ని వికసింపజేసుకోవడం కోసం అతని వలె శ్రమ పడినవారెవరూలేరు ఐతే బాహ్య శక్తులకి వశపడ్డం అతని కెన్నడూ ఇష్టంలేదు. సాధన చేయడం కంటే పరిశోధనద్వారా ప్రతి విషయం తెలుసు కోవడం ఎక్కువ శ్రమకరమగుట వల్ల అతను చాల మెల్లిగ అభివృద్ధి పొందాడు ఇతర చిత్రకారులంతా వెనుకంజవేసే వయస్సునివాటి కూడా అతను తన క్రమవికాసాన్ని సాగించాడు 38 ఏళ్లు వచ్చిన తర్వాత గాని అతను నీటిరంగుల్ని వాడడం మొదలుపెట్టకపోయినా ప్రపంచంలోని గొప్ప నీటిరంగు చిత్రకారులలో ఒకడుగా అతను ప్రసిద్ధి కెక్కాడు అతని తైలవర్ణాలు వాటి చరమ ఉత్కృష్టత నందుకొనే టప్పటికి అతని వయస్సు అరవై ఏళ్లు

అతనికళ పరిపక్వమైనకొలదీ అతనికి సరదావిషయాల మీదా శిశువులమీదా అందమైన ఆడపిల్లలమీదా ఆసక్తి సన్నగిల్లింది. అతని జన్మస్థలమైన న్యూఇంగ్లాండు సముద్రజీవన వారసత్వం అతన్ని న్యూయార్క్ నుంచి ముఖ్య తీరంలోని ఒక వన్యప్రాంతానికి ఆకర్షించింది అతనక్కడ అర్ధ ఏకాంతవాసంలో సముద్రజల్లుకి సమీపంలో ఉన్న ఒక శూన్య స్టూడియోలో గడిపాడు ప్రకృతి శక్తులతో నిత్యం పోరాడే కిశాసులయొక్క వారిభార్యలయొక్క చిత్రాల్ని చిత్రించాడు కాని క్రమక్రమంగా ఈ జీర్ణ పారిశ్రామికులుకూడ అతని దృష్టిని ఆకర్షించడం మానేశారు ఇప్పుడ తనినాకర్షించేదల్లా ఝంఝూమారుతంలో తీరాన్ని కొట్టుకుంటూ ఘోషించే విశాల సముద్రం మాత్రమే ఆ గంభీర చిత్రాల్ని చూస్తే చిత్రకారుని అద్భుత శక్తి మనకి వ్యక్తమౌతుంది ఐతే అతను పొట్టిగా పీలగా ముభావంగా ఉండేవాడనీ, శాంత గంభీర స్వభావుడనీ వర్ణించబడ్డం చూస్తే మనకి చాలా బాధగా ఉంటుంది.

అప్పుడప్పుడు హోమర్ ఉష్ణప్రదేశాలయందలి ఉజ్వల వర్ణాల్ని వెతికేవాడు ఐతే ఆ శుభ్ర స్వచ్ఛ వాతావరణ కూడా అతని చూపులోని పొదుపరితనాన్ని మార్చలేకపోయింది 'గండి ప్రవాహం' (వర్ణ చిత్రం) గంభీర సముద్రానికీ షార్క్‌లకీ నీటిగుబ్బలకీ భయపడుతూన్న ఒక నీగ్రో

భగ్నమైన తన నౌకలో నిస్సహాయుడుగా నిస్పృహతో కూర్చుని ఉండ డాన్ని మనకి చూపుతుంది. నౌకని కొట్టుకునే అలలవలెనే అతనుకూడా ప్రకృతి నియమాలకి వశపడిన ఒక అల్ప జీవి విరుచుకుపడే ఒక అల లాగే అతని మరణంకూడా ఆ మహాసముద్ర గర్భంలో విలీనమౌతుంది

'గండి ప్రవాహం' మన్ననలై తే పొందింది. కాని హోమర్ యొక్క గంభీరనిర్లిప్తతని సహించలేని ఆడవాళ్ళవల్ల దానిఅమ్మకం వెనుక బడింది అతను తన అమ్మకదారునికి వ్యంగ్యంగా రాశాడు—"భయంకర పరిస్థితుల్లో చిక్కుకొని కంగారుపడుతున్నా ఆ దురదృష్టవంతుడైన నీగ్రో ఆఖరికి రక్షించబడి ఇంటికివెళ్ళి తన బంధువులని చేరుకుంటాడని, అతి సుఖంగా శేషజీవితాన్ని గడుపుతాడనీ ఆ ఆడవాళ్ళతో చెప్పండి" సామాన్యంగా అంతటా చర్చించబడే ఆత్మగౌరవ సంస్కృతికీ క్రూర ప్రాకృతిక సంఘటనలయెడ హోమర్‌కిగల పట్టుదలకీ నిజంగా ఏం సంబంధం లేదు అన్ని వ్యాపారాలలాగే కళకూడా ఒక వ్యాపారమనిచెప్పి నాజూకు హృదయాల్ని గాయపరచడం అతనికి ఆనందంగా ఉండేది అతనికి ప్రసిద్ధ సమకాలీనుడైన థామస్ ఈకిన్స్‌వలె అతను ఎవరి చేత అంతగా గాయపరచబడలేదు

ఈకిన్స్ (1844–1916) ఆకాలపు సౌందర్య భావనకంటె వైజ్ఞానిక రచనా విధానం యెడల ఎక్కువ సానుభూతిని చూపేవాడు చిత్రకారులుకూడా శస్త్ర చికిత్సకులవలె శవాల్ని కోసి శరీర విజ్ఞానాన్ని నేర్చుకోవాలని అతనివాదం గణిత శాస్త్రానికీ చిత్రకళకీ చాలా సామ్యత ఉందనీ రెండింటిలోనూ క్లిష్ట విషయాల్ని సరళంగాచేసి చూపడమే ముఖ్యమనీ అతను అనేవాడు యాంత్రిక రేఖాంకనంతో అతను శాస్త్రీయంగా చిత్రించడమేగాక కదలికలో నున్నప్పుడు శరీరావయావాలు ఎలా మారుతూ ఉంటాయన్నది తెలుసుకోవడం కోసం అతను ప్రారంభిక చలనచిత్ర పరిశోధకులలో ఒక డయాడు. శిలువమీద ఉన్న క్రీస్తుని యధాతధంగా చిత్రించడం కోసం అతను తన స్నేహితుణ్ణి నిజంగానే శిలువమీద నిలబెట్టాడు తత్ఫలితంగా అతని చిత్రం మత విషయకమైనదిగా కాక శిలువచేయబడిన ఒక మానవ శరీరంగా తయారయింది.

ఈకిన్స్‌కి భావోద్రేకాల మీద కాని సాంప్రదాయక సౌందర్య కల్పనల మీద కాని ఆసక్తి లేదు ఫ్రాన్స్, స్పెయిన్‌లలో చేసిన నాలు గేళ్ళ నిరంతర సాధనలోనూ అతను భావ స్ఫూర్తినిగాని సౌందర్యాన్ని గాని ఆకళింపుకో లేక పోయాడు వంతెనలు నిర్మించే ఇంజనీయర్‌లా అతను వైజ్ఞానికంగా మంచి నేర్పరితనాన్ని గడించాడు. తన శిక్షణ పూర్తిగా ముగిసిందన్న నమ్మకం కలిగిన తరువాత కాని అతను చిత్ర రచన ప్రారంభించ లేదు తన ప్రధమ చిత్రం విజయవంతంగా తయా రైన తరువాత అతను 1870 లో ఫిలడెల్ఫియాలోని స్వంత గృహానికి జేరుకొన్నాడు తనకి తారసించిన వ్యక్తులనీ దృశ్యాల్నీ గంభీర ముద్రలో చిత్రిస్తూ జీవితాంతం వరకూ అక్కడే గడిపాడు అతను తన తండ్రిని చదరంగం ఆడుతున్నట్లూ చిత్రించాడు. తన స్నేహితుల్ని షూల్‌కిల్ నదిలో నౌకా విహారం చేస్తున్నట్లూ, పియానో చుట్టూ చేరి పాడుతున్నట్లూ చిత్రించాడు. ఆ తరువాత అతను రూప చిత్రాలమీద తన దృష్టిని కేంద్రీ కృతం చేశాడు తను చూసినదాన్ని యధాతధంగా చిత్రించాలనే తీవ్రో త్కంఠతచే ప్రేరేపించబడి అతను ప్రత్యక్షమూర్తుల ప్రాధమిక ఆకా రాల్ని చూపించడమే ప్రధానంగా పెట్టుకున్నాడు ఈ సిద్ధాంతం ద్వారా అతను ఉత్తి ఫొటో గ్రాఫ్‌ల వంటి చిత్రాల్ని చిత్రించకుండా తప్పించు కోగలిగాడు ఆకారాన్ని గంభీర ముద్రలో వ్యక్తపరచడానికి పృష్టభూ మిని మూలగణిత తత్వంతో సమీకరించడాకీ అర్ధంలేని వెలుగునీడలని చూపడం కాకుండా రంగుల్నివాటి యదార్థప్రకాశంలో చూపడానికీ అతను ఎంతో కృషి చేశాడు శాశ్వతత్వం మీది అతని ఈ దృఢ సంకల్పం అతన్ని ఇంప్రెషనిస్టులకి ఎదురు తిరిగేట్లా చేసింది ఆదర్శ విషయ చిత్రణా, నీతి బోధనోద్దేశ్యం అప్రధానమైనవన్న విషయంలో మాత్రం అతను వారితో ఏకీభవించాడు. ఒకప్పుడు అతను సగర్వంగా చెప్పు కున్నట్లు "స్థూలమై బరువుగా ఉండే కృతుల్నే" అతను రచించాడు

అగ్‌న్యూ క్లినిక్ (చిత్రం 29) అనే చిత్రంలో ఈకిన్స్ శస్త్ర చికిత్సా దృశ్యాన్ని చూపిస్తూ భావుకత్వంతో ఆ భీకరదృశ్యానికి సౌమ్యత నాపాదించేందుకుగాని, బీభత్సాన్నో కరుణనో వ్యక్త పరిచేందుకు గాని

ప్రయత్నించలేదు ఒకానొక కర్మాగారంలో మనుష్యులు నిర్వహించే ఒక కార్యాన్నీ దాని నిర్వహణలో మనుష్యులు చూపే నేర్పరితనాన్నీ అతను అందులో మనకి కళ్ళకి కట్టినట్లు చూపించాడు స్త్రీ ప్రేక్షకులకి ప్రదర్శించడానికి తగిన సౌమ్యతా సౌకుమార్యం లేవనే కారణంచేత ఆ చిత్రం ప్రదర్శనాలలో బహిష్కరించ బడింది శస్త్ర చికిత్సకుని చేతిమీదరక్తం చూపించాడని ఈ కిన్స్‌ని అంతా కసాయి వాడన్నారు

చిత్రకళా బోధనకోసం అతను తన సమయాన్ని ఎక్కువగా వినియోగించాడు శరీర అవయవాలని సంపూర్ణంగా ప్రదర్శింపజేసే ఆతురతతో అతను కొంతమంది చిత్రకళా విద్యార్థినులని ఒకా నొకి వార్తా పత్రిక పేర్కొన్నట్లు 'పూర్తి నగ్నత' లోకి బలవంతంగా దింపాడు తత్ఫలితంగా అతను పెన్సిల్వేనియా అకాడెమి నుంచి అవమానకర పరిస్థితుల్లో తొలగించ బడడమేగాక సుసంస్కృతి సంఘంనుంచి వెలివెయ్య బడ్డాడు ఈ అపవాదుకూడా అతన్ని నిశ్చితపథంనుంచి వెనక్కి మర్లించలేకపోయింది అతను ఇంకా ఏకాకిగానూ, సంఘద్వేషిగానూ తయారయాడు అతని చిత్రం ఒక్కటికూడా అమ్ముడు పోలేదు

హోమర్ కంటె ఈకిన్స్ తక్కువ ప్రసిద్ధికెక్కడానికి కారణం ఈకిన్స్ హోమర్ కంటె ఎక్కువగా అమెరికన్ నాగరికతని ద్వేషించడమే ఇద్దరు చిత్రకారులూ యదార్థవాదులే, ఐతే హోమర్ అందమైన వస్తువులకి తన యదార్థవాదాన్ని వర్తింప జేశాడు అతను యువావస్థలో చిత్రించిన ఉత్కృష్ట దృశ్య చిత్రాలూ వానప్రస్థ దశలో చిత్రించిన జ్ఞాన పూర్ణ పౌరాణిక చిత్రాలూ 19 వ శతాబ్దపు క్లిష్ట పరిస్థితుల బారిపడకుండా అతన్ని రక్షించాయి అతని పాత్రలు ప్రకృతి శక్తులధాటికి తట్టుకోలేక నిర్జీవంగా గట్టుకివచ్చి కొట్టుకున్నప్పటికీ ఆ దుఃఖాంతకృతులు అవ్యక్త శక్తుల పరిణామాలుగా నిశ్చితమైన శాంతభావంతో ఖండించబడ దగినవి వ్యాపార పారిశ్రామిక కేంద్రమైన న్యూయార్క్ నగరంలో తన అర్ధజీవితాన్ని గడపినప్పటికీ హోమర్ ఆయుగంలో క్లిష్టతర సమస్యలుగా తయారైన భాగ్యాన్నీ దారిద్ర్యాన్నీ, ఆశల్నీ నిరాశల్నీ, అదర్మాల్నీ, స్వేచ్ఛాచారాన్నీ, ఎన్నడూ లెక్కపెట్టలేదు. అమెరికన్ జీవితంలో అగ్రసరు

ఒయే నగరవాసులు విశ్రాంతి సమయంలో ఉద్యానవన విహారం చేసేట
ప్పుడే అతని దృష్టిని పడేవారు

ఈకిన్స్ దీనికి విరుద్ధంగా ఫిలడెల్ఫియాలోని తన ఇరుగు పొరుగు వారిచేత ఆకర్షించబడి ఎట్టి ఆసక్తి లేకుండా వారిని చిత్రించాడు ఒక శస్త్ర చికిత్సకునివలె అతను పరిశోధనవైపు ఎక్కువ మొగ్గాడు అప్పుడప్పుడు అతను అందమైన ఆడపిల్లల్ని మంచిమంచివేషాల్లో చిత్రించడానికి నిల బెట్టేవాడు వాస్తవిక జీవితాన్ని కప్పిపుచ్చడానికి ఇది అతని ప్రయత్న మైనప్పటికీ ఇందులో అతను జయించలెదు అతని చిత్రాలలో రూపొం దిన ఆకారాలు నిరుత్సాహాలైన మానవ వ్యక్తుల్ని తమ వాస్తవికతని కప్పిపుచ్చేందుకు ధరించిన ఆ మంచిమంచి వేషాలలో ఇంకా ఎక్కువ కృత్రిమంగా కనిపించేవారు యాదాలాపంగా తన దృష్టిపథంలో పడ్డ వ్యక్తులలో అతని నిరాశాపూర్ణదృష్టి కల్పించుకొన్న తన యుగపు జీవి తాన్ని ఈకిన్స్ వ్యక్తపరిచాడు వాస్తవికతలోని దుఃఖమయ భాగాన్ని కప్పిపుచ్చుటే కళయొక్క ఉద్దేశ్యమనిచెప్పే విమర్శకులు అతని గంభీర చిత్రాల్ని అసహ్యించు కున్నారంటే ఆశ్చర్యంలేదు వాల్ట్ విట్‌మాన్ వ్రాసినట్లు "ఈకిన్స్‌ని ఎక్కువగా మెచ్చుకొనే వ్యక్తులు కళా విషయక దురభిప్రాయాలకి వశమైన వ్యక్తులుకారు"

చిత్రకారులకంటే చిత్రకారిణులే విశుద్ధ సౌందర్యభావనను పరిత్య జించడంలో ముందడుగు వేసినప్పటికీ ఆ తరపు ఒక అమెరికన్ చిత్రకా రిణి నిజంగానే మంచి చిత్రాల్ని చిత్రించింది—ఐతే అమెరికన్ తీరభూ ములోకాదు మేరీ కేసట్ (1845—1926) పిట్స్‌బర్గ్‌లో జన్మించింది. ఆమె తన ఏడవ ఏడు మొదలుకొని పన్నెండవ ఏడు వరకు పారిస్‌లో గడిపింది ధనిక వర్గానికి చెందిన ఆమె తండ్రి వ్యాపారం మీది ఏవగిం పుతో ధనవంతులకి యోగ్యమైన వ్యావృత్తికోసం వెతకసాగాడు ఆమె ఫిలడెల్ఫియాలో పెరిగి పెద్దదైంది, ఐతే తన ఇరవై మూడవ ఏట తన అమెరికన్ సాంఘిక మహిళా జీవితాన్ని సంపూర్ణంగా పరిత్యజించి చిత్ర కళాభ్యాసం చెయ్యడానికి పారిస్ జేరుకుంది ఇంప్రెషనిజం ఇంకా బాగా వ్యాప్తిలోకి రాకముందే ఆమె ఆపద్ధతిని ఆకళించుకోగలిగింది ఒక దుకా

ఐపు కిటికీలోనుండి రంగు కిణీకెలతో చిత్రించబడిన డెగాస్ చిత్రం ఒకటి ఆమె దృష్టి పథంలో పడింది ఆమె తరవాత అంది– "నేను రోజూ వెళ్లి ఆ కిటికీ అద్దంతో నా ముక్కు రాసుకొనే దాన్ని దానితో నా జీవితంలో గొప్ప మార్పు కలిగింది"

డెగాస్‌కి శిష్యురాలుగాఉండి మేనెట్ చిత్రాలవల్లా జపాన్ చిత్రాల వల్లా బాగా ఆకర్షించబడిన కేసట్ ఇంప్రెషనిస్ట్ చిత్రకారులతో కలిసి చిత్రాల్ని ప్రదర్శించడానికి ఆహ్వానింపబడిన ఏకైక అమెరికన్ కళాకారిణిగా ప్రసిద్ధి కెక్కింది ఐనా ఆమె సహజ పృష్ఠభూమికి చెందిన స్వాభావిక తత్వాల్ని నిలబెట్టుకోలేక పోయింది మోకాళ్ళమీద మోచేతులు ఆనించి తను ఒక సాధారణ స్త్రీలా కూర్చున్నట్లు డెగాస్ చిత్రించి నప్పుడు ఆమెకి కోపంవచ్చింది. ఆమె తల్లి తండ్రులు ఆమెను పారిస్‌లో కలుసుకున్నారు ఆమె తిరిగి విలాసభోగాల కాలవాలమైన తన సుశిక్షిత కుటుంబంతో బంధించ బడింది ఆమె సహచిత్రకారులంతా కేఫ్‌లలోవాద వివాదాలు చేసుకుంటూండే కాలంలో ఆమె తన దాసదాసీజనంతో పరివేష్టింపబడి అతిథి సత్కారాలతో తన సమయాన్ని గడపింది

కేవల కల్పనా విషయాల్ని బహిష్కరించాలనే ఇంప్రెషనిస్టుల ప్రబోధానికి కట్టుబడి కేసట్ తన పరిమిత జీవితానికి సంబంధించిన విషయాలనే తన చిత్రాలలో వ్యక్త పరిచింది ఆమె మనో భావాలలోనే కాక ఆమె చిత్రాలలో కూడ పురుషజాతి సంపూర్ణంగా బహిష్కరించబడింది డెగాస్ నాట్యమాడే అర్ధనగ్న బాలికల్ని చిత్రించాడు కేసట్ బాక్స్‌లోంచి చూస్తున్న మహిళామణుల్ని మంచి దుస్తుల్లో చిత్రించింది ఆమె యదార్థ వాదంలో వ్యక్తిగత తృష్ణ తొణికిసలాడేది తన జీవితంలో ఎన్నడూ చవిచూసి ఎరుగని మాతృత్వాన్ని (చిత్రం 26) వ్యక్త పరచడంలో ఈ బ్రహ్మచారిణి తన మృదుల కౌశల్యాన్ని బాగా ప్రదర్శించింది మత విషయిక ఉద్రేకాన్ని ఎన్నడూ దరికి రానియ్యక పోయినా– ఆమె మదోనా శిశువుల చిత్రాన్ని చిత్రించడానికి ఎన్నడూ ప్రయత్నించ లేదు – ఆమె దృష్టికోణం ఆదర్శపూర్ణమైనది ఆమె చిత్రాలలోని శిశువులు గొడవ చెయ్యడం ఎరుగరు అర్థరాత్రి ఏడుపులతో లేవ కొట్టారని ఆమె

చిత్రాలలోని తల్లులు విసుక్కోవడం అంటూ లేదు. ఆదర్శ ప్రేమ మీద ఆధారపడిన ఆదర్శ విశ్వాసం శాశ్వత సురక్షణతో కూడుకొన్న సాంఘిక జీవితం ఆమె చిత్రాల్లో బాగా వ్యక్తపడతాయి ఆమె మూర్తులు గంభీరంగా ఉంటాయి ఇంప్రెషనిజంకి అవసరమైన ప్రకాశమానమైన వర్ణాలు సంగీతంతో ప్రజ్వలిస్తూ ఉంటాయి శిశుశరీర వర్ణాలు నాజూకు తనంతో కూడిన మార్దవాన్ని కలిగి ఉంటాయి తన పరిమిత హద్దులలో కేసెట్ ఒక మంచి చిత్రకారిణి

ఆమె కీర్తి సంయుక్తరాష్ట్రాలకి ఎగప్రాకలేదు. ఒకసారి ఆమెతన ప్రౌఢ వయస్సులో స్వదేశాన్ని సందర్శించడానికి వచ్చినప్పుడు ఫిలడెల్ఫియా లెడ్జర్ ఈ విధంగా వ్రాసింది "పెన్సిల్వేనియా రైలురోడ్డు అధ్యక్షుడు శ్రీ కేసెట్ సోదరి మేరీ కేసెట్ యూరప్ నుండి నిన్న ఇక్కడికి జేరుకుంది ఆమె పారిస్‌లో చిత్రకళాధ్యయనం చేస్తోంది ప్రపంచంలో కల్లా లతిచిన్నదైన పెకినీస్ కుక్క ఆమె దగ్గిర ఉంది" ఆమెకి అమెరికన్ చిత్రకళా క్షేత్రంలో తగిన స్థానం లభించలేదు యూరోపియన్ ఆదర్శచిత్రాల్ని తనమాతృదేశానికి పంపించేపని ఆమె తన తలపై పెట్టుకొంది తన ధనక అమెరికన్ స్నేహితులు ఉత్తమ చిత్రాల్ని కొనుక్కోవడంలో సహాయపడ్డం కోసం ఆమె చిత్రకళా సాధననే నిర్లక్ష్యంచేసింది.

ఈ బ్రహ్మచారిణి ఫ్రెంచి ప్రాసాదంలో ఆదర్శ మాతృత్వాన్ని గూర్చి కలలుగనే రోజుల్లో ఒక రహస్యవాద చిత్రకారుడు న్యూయార్క్ నగర స్టూడియోలో భయంకర కల్పనా లోకంలో విహరించ సాగాడు ఆల్‌బర్ట్ పింక్‌హాం రైడర్ (1847–1917) న్యూబెడ్‌ఫోర్డ్‌లో సముద్ర జీవితానికి చెందిన కుటుంబంలో జన్మించాడు న్యూబెడ్‌ఫోర్డ్ ప్రపంచంలోని గొప్ప తిమింగిల వేట రేవులలో ఒకటి నేత్రాల బలహీనత, భావుకత్వంయొక్క ఆధిక్యత అతన్ని తన సోదరులతో కలిసి తుఫానుల నెదుర్కోవలసిన అవసరం లేకుండా చేశాయి ఐతే ప్రవాహ జలాల రహస్య తత్వం, సుదూర స్థలాల ఏకాంతత అతని రక్తంలో ఇమిడి ఉన్నాయి కష్టమయ మానవ జీవితాన్ని కవ్విస్తూన్న సముద్రాన్ని చిత్రించిన శక్తిశాలి ఐన హోమర్ వలెగాక రైడర్ సముద్రాన్ని

మానవుని ఛాయావృత దురదృష్టానికి (చిత్రం 30) నిదర్శనంగా చిత్రించాడు భయంకరమైన చంద్రమేఘాల సంయోగచ్ఛాయలో ఆశ్చర్యకరమైన అద్భుత రాత్రివేళ నల్లని తెరచాపతో ఉన్న ఒక పడవ మానవ యాత్రికుల్ని ముందుకి నెట్టుకుంటూ పోతుంది

ఒడ్డూ పొడుగూ బాగా ఉండి గడ్డాలూ, మీసాలూ ఉన్నవాడైనా ఈ చిత్రకారుడు శిశువులె సంకోచ స్వభావంకలవాడు అతని గది పాత వార్తాపత్రికలూ, ఖాళీ జాజికాయి పెట్టెలు, మాసిపోయిన గుడ్డలూ, అంట్లగిన్నెలూ మొదలైన వాటితో నిండి ఉండేది. తలుపుకీ ఈజిల్‌కీ మధ్యనున్న స్థలంలో అతను తన పెంటరివంట వండుకునేవాడు గోడలకి అతికించిన కాగితాలు ఊడి వ్రేలాడుతూ ఉండేవి. "ఎవరేనా నన్ను చూడడానికి వచ్చినప్పుడు తప్ప వీటిమీదికి నాదృష్టి ఎప్పుడూ పోదు" అనేవాడతను అతని దృష్టి ఎప్పుడూ కిటికీ బయటనున్న తోటమీదే కేంద్రీకృతమై ఉండేది తోటలోని పెద్దపెద్ద చెట్లు చూరుక్రింది నుంచి ఆకులతో నిండిన కొమ్మల్ని అతని కిటికీలోకి దూర్చేవి ఆ కొమ్మల ఆకుల్లోంచి వెలుగు నీడలు అతని గదిలో దాగుడుమూతలాడేవి, ఇరుగుపొరుగు డాబాల పై భాగంనుంచి అతను అనంతవిశ్వాన్ని ఆలోకించేవాడు ఆకుల మరమర ధ్వనులతో నిండిన ఆ పాతతోట దృశ్యాల్ని తనకు కనబరచే ఆ రెండు కిటికీలు అతని దృష్టిలో పెద్ద రాజప్రాసాదాల కంటె ఎక్కువ గొప్పగా ఉండేవి

రైడర్ తను చూడదలుచుకున్నదాన్నే చూసేవాడు యూరప్ యాత్రా సమయంలోకూడా ఇతరచిత్రకారులు చిత్రించేవిషయాలు అతని దృష్టిపథంలో పడలేకపోయాయి ఐతే న్యూయార్క్ రాజపథాన్ని దివ్య జ్యోతితో వెలిగించే వెన్నెలలో అతని కల్పనాద్వారాలు తెరుచుకొనేవి, అతని కల్పనాలోకం సాధారణంగా స్థానిక విశిష్టతలతో పరిమితమై ఉండేది గుర్రపు పందాలలో సర్వస్వంగోల్పోయిన అతని అభిమాన పాత్రుడైన నౌకరు ఆత్మహత్య అతనిచేత ఒక ఏకాంత అశ్వ పథంలో ఖడ్గధారియై విహరించే మృత్యుదేవతని చిత్రింపచేసింది ఇంకొక విధమైన భావావేశంలో అతని తళతళలాడే కవచంధరించిన యుద్ధదేవత వెన్నెల

ప్రవాహంలో స్నానమాడే దేవకన్యలతో సంభాషించేందుకు మెలికలు తిరిగిన ఒక చెట్టుకింద నిలచినట్లు చిత్రించాడు, దురదృష్టవంతుడైన జోనా తిమింగలం మ్రింగేసినట్టు చూపించాడు. దేశీయమైనా విదేశీయమైనా ఉద్వేగకరమైనవైనా ఆధ్యాత్మికమైనవైనా అతని కల్పిత దృశ్యాలు ఎప్పుడూ ప్రశంసనీయంగా ఉండేవి అవి అతని హృదయాంతరాలలో నుంచి స్వాభావికంగా వ్యక్తమయేవి.

ఇన్నెస్ వలె రైడర్ తన కేన్వాసు మీదికెక్కిన ఆకారాల్ని సరిదిద్దడం ద్వారానూ యథాస్థలంలో నిలపడంద్వారానూ తన చిత్రాల్ని ఉత్కృష్టంగా చేసుకునేవాడు ఐతే భావా వేశంలో ఇన్నెస్ ఉన్న చాటిని తారుమారుచేస్తే తను స్వయంగా చెప్పుకొన్నట్లు తన చిత్రాల్ని "వచ్చే పోయే సంవత్సరాల వెల్తురులో పరిపక్వమయేందుకు" వదిలిపెట్టేవాడు తొందరపాటుకి అతనెప్పుడూ వశపడలేదు ఎప్పుడో వెలయిచ్చిన చిత్రం కోసం శవపుఊరేగింపు ఆగిపోయిందని అతని పోషకుడొకడు విమర్శించగా ఆ సౌమ్య దృఢగాత్రుడు రీవిగా జవాబిచ్చాడు— "చిత్రం అప్పటికి పూర్తి ఐతే తప్ప నేను ఇవ్వనని ముందే చెప్పాను" ఒక చెట్టుకొమ్మ చివరినుండి గాలిలో వ్రేలాడే ఆకుపురుగులా తనకాళ్లకందని స్థలాలలో దేన్నో వెతికే ప్రయత్నంలో ఉన్నానని అతను చెప్పేవాడు ఆఖరికి ఏదో భావోద్వేగం చేత ప్రేరేపితుడై అతను తన చిత్రంలోని వెలుగు నీడలలోనో రంగులలోనో అత్యంత ముఖ్య పరివర్తనాలని చేసేవాడు రైడర్ రచనావిధానం అత్యంత సూక్ష్మమైనది సరళమైన ఏ కొన్ని ఆకారాల ద్వారానో వాటికి వివిధవర్ణాలతో మేళవితమైన మృదులఆవర్ణలనివ్వడం ద్వారా అతను మానవజీవితానికి సంబంధించిన అత్యద్భుత రహస్యాల్ని వ్యక్తపరచేవాడు

అమెరికాలో పుట్టిన చిత్రకారులకి పంతొమ్మిదవ శతాబ్దాంతిమ భాగం స్వర్ణయుగం వంటిది విదేశాల్లోనూ మాతృదేశంలోనూ సమానంగా ప్రసిద్ధికెక్కిన కేసట్ విస్లర్‌లు పాతప్రపంచంతో తమభవిష్యత్తుని ముడిపెట్టుకున్నారు. ఫ్రెంచి ఇంప్రెషనిస్ట్ ఉద్యమంలో ప్రముఖ సభ్యురాలు కాకపోయినా కేసట్ ఫ్రెంచి రచనా విధానం ద్వారా వ్యక్తిగత వృత్తాలకి

శాశ్వత కళాత్వాన్ని ఆపాదించకలిగింది విస్లర్ ఇంప్రెషనిజంతో సమానమైన, తన వ్యక్తిత్వాన్ని ఎక్కువగా వ్యక్తపరిచే ఒక విశిష్ట రచనావిధానాన్ని ఇంగ్లండ్‌లో వికసింపజేశాడు ఆ యుగపు వ్యక్తిగత సౌందర్య సాధనలలో అది ఉత్కృష్టమైనది సంయుక్త రాష్ట్రాలలోనే కళాసాధన సాగించిన అమెరికన్ చిత్రకారులు సౌందర్య భావనలో కొంత వెనకబడినప్పటికీ శక్తిశాలురుగా ప్రసిద్ధి కెక్కారు. స్వయంకృషితో పైకివచ్చిన హోమర్, పారిస్‌లో కళాసాధన చేసిన ఈకిన్స్ తమకి అనుకూలమైన అమెరికన్ జీవితకోణాన్ని యథాతథంగా చిత్రించారు నిర్మానుష్య స్థలాలలో భాగ్యాన్ని వెతుక్కోవలసిన ఈ యదార్థత జాతీయ సహజలక్షణంగా రూపొందించింది. రైడర్ ఈ జాతీయానుభూతియొక్క ఇంకొక పక్షాన్ని వ్యక్తపరచాడు అమెరికన్ సాహసిక జీవితం గొడ్డలి ద్వారానూ లెఖల పుస్తకం ద్వారానేకాక స్వప్నకల్పనలద్వారాకూడా సిద్ధించిందనే విషయం అతని చిత్రాలు వ్యక్త పరుస్తాయి రైడర్ కల్పనలకి సంబంధించిన ఈ జాతీయ స్వాప్నిక జగత్తు కావాలని నిర్మించుకున్నదికాక ప్రజల సహజ భావానుభూతులలోంచి పుట్టినదే

అమెరికన్ జీవితానుభూతిని సంపూర్ణంగా బహిష్కరించిన చిత్రకారులు దాన్ని హృదయపూర్వకంగా స్వీకరించిన చిత్రకారులుకూడ ప్రముఖ చిత్రాల్ని చిత్రించారు విదేశాలలో సాధించిన రచనా నైపుణ్యం మాతృదేశంలో విజయవంతంగా ప్రయోగించవచ్చు నన్నది ఈకిన్స్ మనకి చూపించాడు ఈ అద్భుత యుగానికి సంబంధించిన అనేక మార్గాలలో లాఫార్జ్ విదేశీయ సంస్కృతినీ ప్రాచీన సంస్కృతినీ గుచ్చెత్తి అమెరికన్ సంయుక్త రాష్ట్రాలపై రుద్దడానికి చేసిన ప్రయత్నం ఒకటి ఇది ఏమాత్రం సఫలం కాలేదు అతని విజ్ఞానమూ నైపుణ్యమూ వన్నెచిన్నెలతోకూడిన ముసుగుతో శూన్యత్వాన్ని కప్పిపుచ్చడానికి ఉపయోగించాయి అమెరికన్ యువకచిత్రకారులకి ఇదియొక పాఠం. ఐతే వారు దీన్ని గుర్తించి స్వీకరిస్తారా అన్నది ప్రశ్న

# 6

# అద్దాల మేడలూ పూరి గుడిసెలూ

విలియం మెర్రిట్ ఛేస్ (1849–1916) మ్యూనిక్‌లో చిత్రకళ నభ్యసించిన తర్వాత పూర్తిగా క్రొత్త మనిషిగా మారిపోయాడు కనీసం అలా అనుకున్నాడు ఛేస్ తండ్రి ఇండియానాలో ఒక చిన్న పట్టణంలో సామాన్య వర్తకుడు ఛేస్ ఆ పట్టణంలో గృహిణుల ముందు మోకరిల్లి పాదరక్షలు సరిజూచి తొడిగేవాడు ఆ పరిస్థితి నుంచి తప్పించుకోవాలనే అభిలాషే అతన్ని నౌకాదళంలో చేర్పింది కాని తారుపూసిన ఓడ పడిచెక్కలమీదపని అతనికంతగా సరిపడలేదు ఆ తరువాత క్రమంగాఅతను సెంట్ లూయీ లో సామాన్యరూప చిత్రకారుడుగా కుదురుకున్నాడు ఆ తరువాత అదికూడ పాతబడి పోయింది నాజూకైన బవేరియాలో అనుకరణద్వారా అతను నాగరికతా సభ్యతలు అలవాటు చేసుకున్నాడు. తనకి ఇన్నాళ్ళనుంచీ అలవాటైన మృదువైన ఛాయా చిత్రణ పద్ధతి విడిచిపెట్టి దానికి వ్యతిరేకమైన ప్రస్ఫుటమగు కుంచెపని అలవాటు చేసుకున్నాడు. ఆ ధోరణి చిత్రణ మ్యూనిక్ ప్రత్యేకత చిత్రమైన దుస్తులతో అనువైన వ్యక్తుల భంగిమలు ఉపయోగించి చక్కని గోధుమ రంగుతో అతను చిత్రాలు చిత్రించాడు అవి పాతబడిపోయిన ప్రాచీన చిత్రకారుల చిత్తరువులవంటివి వాటివల్ల ఎంతో ప్రశస్తి పథకాలూ లభించాయి. చిత్రకళోపాధ్యాయుడుగా అతను జర్మనీకి ఆహ్వానించ బడ్డాడు

ఇంచుమించుగా ఇతనూ రైడరు సమాన వయస్కులు. కాని ఛేస్‌లో జనసామాన్య చిత్రకారుల ప్రత్యేకత కనిపిస్తుంది. అమెరికాలో అంతర్యుద్ధంవల్ల చాలామంది ఐశ్వర్య వంతులైనారు కాని అమెరికన్

ఆదర్శవాదానికి దెబ్బతగిలింది. కొత్తగా ఐశ్వర్యవంతులైనవారు ఐరోపా నుంచి ప్రసిద్ధ ప్రాచీన చిత్రకారుల చిత్తరువులు దిగుమతి చేసుకున్నారు ఎంతోమంది విద్యార్థులను చిత్రకళను నేర్చుకొనుటకు పంపించారు. కాని వారందరూ ఐరోపా సంస్కృతిపై మోజుతో చాల వరకు అమెరికా పూర్వరంగం విస్మరించారు మాతృదేశం తిరిగి వచ్చిన తర్వాత వీరు 'సొసైటీ ఆఫ్ అమెరికన్ ఆర్టిస్ట్స్' అనే సంఘాన్నీ, 'ది ఆర్ట్ స్టూడెంట్స్ లీగ్' అనే కళాశాలనీ స్థాపించారు ఛేస్ ఆ సంఘానికి అధ్యక్షుడయాడు ఆ కళాశాలలో ఆచార్యుడుగా పనిచేశాడు ఇతని 'స్టూడియో' (చిత్రం 31) అనే చిత్రం నూతన ఉద్యమానికి ఒక ప్రదర్శనశాల వంటిది టర్కీ రగ్గులూ, మధ్యయుగపు ఉపకరణములూ, సాంప్రదాయిక అర్ధ శిల్పాలూ స్పెయిన్ పళ్లేలూ, ప్రాచీన సంగీతవాద్యాలూ, తదితర ప్రాచ్య శిల్పాలూ దీనిలో పోగుపోసినట్లు కనిపిస్తాయి ఈ చిత్తరువు "అమెరికన్ చిత్ర కళకు ఎంతో మేలు చేసింది" అని ప్రసంసించబడింది.

ఈ విధమైన కళావాతావరణలో గౌరవకుటుంబాలకు చెందిన మహిళామణులు ఉచితభంగిమలలో తమ మూర్తి చిత్రాలు చిత్రించడానికి అవకాశమిచ్చారు సుప్రసిద్ధ చిత్రాల్లో వీరి ఆకృతులు కనిపిస్తాయి. ఈ చిత్తరువులకు పెద్దపెద్ద బంగారు రంగు చట్రాలు అమర్చారు ఛేస్ పర్య టించినప్పుడు తాను బస చేసిన హోటళ్ల గదులలో చుట్టూ ఐరోపా కళా సామగ్రి అమర్చుకొనేవాడు. ఈ విధమైన కృత్రిమ వాతావరణమే లేకపోతే అతని జీవితమే దుస్సహమయేది నిజానికి శైలి ఒక్కటే చిత్రకారుల న్యాయమైన లక్ష్యమని వర్ణ్యవస్తువులకు ప్రాధాన్య మొసగే అసమగ్రమైన దృక్పథం వల్ల సాంప్రదాయికమైన అమెరికన్ చిత్రకళవైపే వెనుదిరిగి చూడనక్కరలేదని ఛేస్ తనచుట్టూ చేరిన వందలకొలది విద్యార్థులకు ఉపదేశించాడు రెంబ్రాంట్ మత విషయిక చిత్రాలన్నింటికన్న అతని ఎద్దు మాంసపు చిత్రమే గొప్పదని ఛేస్ వ్యాఖ్యానించాడు అతనూ యూరోపి యన్ పద్ధతులు అనుసరించిన అతని అనుచరులూ కళ కోసమే కళ అనే సిద్ధాంతమును ఎంతో ఉత్సాహంతో ఆహ్వానించారు. దీనివల్ల తమ జన్మ స్థల పరిసరాల ప్రభావాలేవీ తమమీద పనిచేయలేదన్న వారి సిద్ధాంతానికి

బాగా ప్రోద్బలం కలిగింది, ఇంతకి పూర్వం విస్లర్‌కికూడ ఇదే విధమైన అవకాశం లభించింది ఐతే విస్లర్ కళ పునాదులన్నీ యూరోపియన్ ఖండం లోనివే కాని ఛేస్ తన బృందంతో కూడ యూరోపిన్‌నుంచి అమెరికా సంప్రదాయాల వంకకు తిరిగివచ్చాడు వీరందరూ తమ వ్యక్తిగతానుభూత ప్రమాణ ధోరణిని తిరస్కరించారు అందుచేత శైలి అనుసరణలోవ్యక్తి గతమైన ఎన్నిక కెక్కడా ఆస్కారం లేకుండా పోయింది కాని దాని వల్లనే అజరామరులం కావలెనని వారు ఆశించారు. ఇందుచేతవారు ఎక్కడా తప్పుదారి తొక్కని పైదేశిక చిత్రకళా పద్ధతులన్నీ అనుసరించారు ఐనా ఏదో ఒక్క పద్ధతి మీద తమ శక్తి యావత్తూ ధారపొయ్యడానికి వారు ఇష్టపడలేదు ఇందుచేత అడపాతడపా వారు అనేక పద్ధతులవలంబిం చారు ఛేస్ మ్యూనిక్ మార్గంలో అచేతనవస్తుసముదాయాన్ని చిత్రించాడు విస్లర్ మార్గంలో రూపచిత్రాలు రూపొందించాడు ఇంప్రెషనిస్టిక్ పద్ధ తిలో ప్రకృతి దృశ్యాలు చిత్రించాడు క్రమక్రమంగా యూరప్‌లో మ్యూనిక్ పద్ధతి క్షీణించడంతో అమెరికాలో సుప్రసిద్ధములైన పారిస్ మార్గాలు తలెత్తాయి. వాటిలో మొదటిది ఇంప్రెషనిజం రెండవ సుసూక్ష్మరూప చిత్రణ ఇంప్రెషనిజంలో ఉన్న ఎక్కువ శక్తివల్ల క్రమక్రమంగా అది అమెరికన్ పద్ధతితో మేళవితమైంది జాన్ ట్వాట్‌మాన్ (1853–1802) విస్లర్ తన ఫ్రెంచి దేశీయుడైన మోనెట్ ననుసరించినట్లు ఇన్నెస్ ననుసరించి ఒక మృదువైన పద్ధతిలో చిత్రకళ సాధించాడు పారిస్ చిత్రకళా పరిషత్తులలో నగ్న చిత్రాలకి ఎక్కువ ప్రాధాన్యత ఉండేది కాని అమెరికాలో స్త్రీల నగ్న చిత్రాల యెడల వైమనస్యం ఎక్కువ అందుచేత మూర్తిచిత్రకారులు ఎంతగా మూసలో పోసినట్లు చిత్రించినా కొంత కొత్త దారులు తొక్కక తప్పలేదు వీరుచాలా మృదువైన పద్ధతిలోనే స్త్రీల రూప చిత్రాలూ నగ్నచిత్రాలూ రూపొందించారు ఇది హోమర్, ఈకిన్స్‌ల వాస్తవిక చిత్రాలకన్నా మృదులహృదయులైన అమెరికన్ కళాభిమానులనెంతో ఎక్కువగా ఆకర్షించాయి

మంచిపనితనం కలిగిన ఎబ్బట్ థాయర్ (1846–1921) థామస్ డ్యూయింగ్ (1851–1938) అమెరికన్ యువతుల మహనీయతని చిత్రిం

చడంలో ప్రత్యేక నైపుణ్యం గడించుకున్నారు చిన్న రెక్కలుంటే ఆమె ఒక అప్సరసన్నమాటే పెద్దపెద్ద రెక్కలుంటే దేవతాకన్యకే నగ్న మూర్తి అయితే కలువకన్నె ఆధ్యాత్మికమూర్తి వస్త్రాలతో ఉంటే కన్యాత్వప్రతిమూర్తి చాలామంది యువతులు లేఖలు వ్రాస్తూన్నట్టూ, చదువుతూన్నట్టూ, పూలవాసనలు ఆఘ్రాణిస్తూన్నట్లూ, అవి ఏర్చి కూర్చుతూన్నట్లూ, చిత్రించబడ్డారు తర్వాత అమెరికన్ యువతులు ప్రతిమూర్తులు భిత్తి చిత్రకారుల రచనలలో బాగా పెద్దవై భవనాల అంతర్భాగాలను అలంకరించాయి. ఈ సందర్భంలో చిత్రకారులు బొమ్మలు కొనుక్కునే వారి అభిరుచుల ననుసరించి భంగిమలు మారుస్తూ వచ్చారు ఆ అభిరుచి ప్రతిష్టకోసమైనా వస్తునిర్మాణం కోసమైనా చిత్రకారులెంత మాత్రం సంకోచించలేదు జాన్ డబ్ల్యూ అలెగ్జాండర్ (1857–1951) కార్నెజి వక్షస్థలం వరకూ వికృతంగా ఉండి పిట్స్బర్గ్ నగరదేవత ప్రతిబింబ మూర్తిగా రూపొందింది అయితే బహుశః అట్టే ఎబ్బెట్టుగా కనబడకూడదని కాబోలు ఆ మూర్తిని సంపూర్ణసైనిక వేషంతో తీర్చి దిద్దడం జరిగింది అదృష్టవశాత్తూ ఇటువంటి వింతధోరణులు చిత్రకళలో అట్టే ఎక్కువగా పొడగట్టలేదు కాని బృహత్ శిల్పనిర్మాణంలో మాత్రం అవి నేటికి సర్వసామాన్య సంప్రదాయాలుగా మారిపోయాయి 1949 లో న్యూయార్క్ మేడిసన్ అవెన్యూ లో ఒక అద్భుత యువకుడు తనపైన ఎగురుతూన్న ఒక అర్ధనగ్న స్త్రీ మూర్తిని చూస్తూ ఒక భవనం ముందుకి జారి పడిపోతున్నట్లు ఒక శిల్పం కనిపించింది శిల్పకారుని పేరు వీలర్ విలియంస్ విదేశీయ కళా సంస్కృతుల సౌందర్యం చూచి మన్హట్టన్ అనే నిద్రిత మహావ్యక్తిని వీనస్ మేల్కొలుపు చున్నట్లు తన యీ శిల్పం సూచిస్తున్నదని ఆ శిల్పి పేర్కొన్నాడు

తమ సంప్రదాయాల్ని తవ్వి పైకెత్తాలని తహతహపడే అమెరికన్ చిత్రకారులందరు ప్రత్యేకించే సంప్రదాయాల మాటే తలపెట్టని ఇంకొక చిత్రకారుణ్ణి ఎంతో గొప్పగా మెచ్చుకున్నారు అతని పేరు జాన్ సింగర్ సార్జెంట్ (1856–1925) తల్లిదండ్రులను బట్టి అమెరికా దేశీయుడైనా ఇరవయ్యో ఏటి వరకూ అతను తన మాతృదేశమే సందర్శించలేదు

నిజానికితను అమెరికాలో నివసించనెలేదు సార్జెంట తల్లి ధనికురాలై ఒకఫిలడెల్ఫియామహిళ పర్యటనలంటే ఆమెకిపెద్దవెర్రి. తనమాటకెదురు చెప్పని తన కుటుంబీకు లందరితో కలిసి మాతృదేశం మినహా ప్రపంచ మంతటా పర్యటించింది తన పంతొమ్మిదవ ఏట సార్జెంట్ పారిస్ నగ రంలో కళాభ్యాసం ప్రారంభించాడు అత్యద్భుతమైన వేగంతో ఒక సమగ్ర శైలిని అమర్చుకున్నాడు, అది అతని అనుభూతికి అతిస్పష్టమైన ప్రతి బింబం సార్జెంట్ ఎప్పుడూ పెద్దపెద్ద హోటళ్లలోనూ అద్దెకు తీసుకున్న భవంతులలోనూ నివసించాడు తాను భాగస్వామికాని సంస్కృతులను దూరాన్నుంచి పరిశీలించాడు అందు చేత ఆ సంస్కృతుల బాహ్య స్వరూ పాలు మాత్రమే అతనికి గోచరించాయి ఒక ప్రకృతి దృశ్యాన్నిగాని ఒక సుందరినిగాని ముందుంచి నపుడు అతను వెంటనే ఇంద్రధనుస్సు వంటి చిత్రం సృజించేవాడు ఒకే కుంచె కదలికతో ఆకారవర్ణాలేకాక సాంద్రత వాస్తవిక చైతన్యం కూడ చిత్రించేవాడు కాని అతని చిత్తరువులు అంత వరకువచ్చి ఆగిపోయాయి అంతకన్న దూరం వెళ్లలేదు సార్జెంట్‌కు ప్రత్యేకంగా వ్యక్తపరచవలసిన అభిప్రాయాలుకాని భావావేశాలుకాని ఏవీ లేవు అతని భావన చాలా పరిమితమైనది ఒకే చిత్తరువులో అనేక మూర్తులను కూర్చవలసివచ్చినపుడు సార్జెంట్ ఎంతో ఆందోళన పడేవాడు

ఇతని శక్తి సామర్థ్యాలు రూపచిత్రణకి ఎంతో అనుకూలించాయి. ఇరవైఅయిదేళ్ల వయస్సులోపుగానే అతని రూపచిత్రాల వల్ల పారిస్ నగర మంతటా పెద్ద గగ్గోలు బయలుదేరింది అతను చిత్రించిన మదాం గోత్రూ రూపచిత్రం (చిత్రం 32) పారిస్ వాసుల నందరినీ ఆశ్చర్య చకితుల్ని చేసింది ఆమె ఆ నగరమంతటా ప్రసిద్ధికెక్కిన అందగత్తె నాగరికులం దరూ అతడు ఇంకా గొప్ప చిత్రాలు రచిస్తాడని ఆశించారు. కాని జాతీయ చిత్ర ప్రదర్శనంలో ఈ చిత్తరువు ప్రదర్శించబడగానే అపవాదు ప్రారం భమైంది సంఘంలో అందరిచేతా అంగీకరించబడదగిన ఒక సాంప్రదా యిక మూర్తి ఆ చిత్రంలోకాన రాలేదు దానికి బదులుగా సౌందర్యాన్ని వృత్తిగా స్వీకరించిన ఒక అందగత్తె వాస్తవికాకృతి మాత్రమే అందులో సాక్షాత్కరించింది ఆ వాస్తవికతలో ఆమెలోగల స్వల్పత్వమూ అహం

భావమూ అసభ్యమైన దుస్తులద్వారా ప్రతిఫలించాయి అంతేగాదు అనారోగ్య సూచకమైన శరీరపు వెలవెల బాటుకూడా వ్యక్తమైంది ఆ చిత్రం సంగతి విన్న ప్రేక్షకులెంతో నిర్ఘాంతపోయి గుంపులుగుంపులుగా ప్రదర్శన హాలులో ప్రవేశించారు అదే సమయంలో ఆమె చిత్రకారుని స్టూడియోలో మూర్ఛావేశంతో సతమతమైంది అంతవరకూ ప్రశంసకిమాత్రమే అలవాటు పడిన సార్జెంట్ వెంటనే లండన్ వెళ్ళిపోయాడు మదాం గోత్రూ రూపచిత్రానికి మదాం ఎక్స్ అనే పేరు ఏర్పడింది తర్వాత తర్వాత అది సార్జెంట్ చిత్రాలన్నిటిలోకీ చాలా గొప్పదన్న ప్రశస్తి గడించుకుంది భావావేశం ఎంతమాత్రంలేని అంతటి నిజాయితీతో కూడిన ఇంకొక చిత్రమేదీ అతను చిత్రించలేదు సార్జెంట్ తనతరం వారందరిలోకీ ఎక్కువ పేరు ప్రఖ్యాతులు గడించుకొన్న యూరప్‌లోనూ అమెరికాలోనూ నిరంతర పర్యటనలతో గొప్పగొప్ప ఐశ్వర్యవంతుల మహాధికారుల రూపచిత్రాలు సృష్టించాడు మేలిముసుగు వెనకాలఉన్న అంతర మానవమూర్తుల్ని అన్వేషిస్తున్నావా అని ప్రశ్నించబడినప్పుడు అతను "ముసుగు కనిపిస్తే నేను అదే చిత్రించాలి నేనుచూచినదిమాత్రమే చిత్రిస్తాను" అన్నాడు.

ఐనా సార్జెంట్ భావనాత్మక కళాకారుడవడం కోసం తహతహలాడాడు ప్రౌఢవయస్సులో బోస్టన్ భవనాలలో మత విషయికమైన సాంప్రదాయిక భిత్తి చిత్రాల్ని చిత్రించడం తన ప్రధానోద్దేశ్యంగా పెట్టుకున్నాడు ఇంతకుముందెన్నడూ ఇంత సమర్థుడైన వ్యక్తి ఎవరూ ఇంతగా తన ఆత్మ లోతుల్లోంచి తేలి బైటపడిపోలేదు అత్యుక్తులతో కూడుకున్న తన కల్పనామూర్తుల్ని వ్యక్త పరచేందుకు అత నవలంబించిన దృశ్య యదార్థ వాదం వాటిని ఆధ్యాత్మిక స్థాయికి తెచ్చే విషయంలో అతని అసమర్థతని ఇంకా వ్యక్తపరచింది అతని చిత్రాలలోని ప్రవక్తలు విచిత్రంగా ప్రవర్తించే వృద్ధ వ్యక్తులు అతని మూర్తులు సర్కస్ ప్రక్క ప్రదర్శనంలోంచి తప్పించుకు వచ్చిన విపరీత వ్యక్తులు అస్తవ్యస్తమైన నాటకీయ భంగిమలలో వారు పెద్దపెద్ద గోడలను అనుకుని నిల్చొంటారు కదులుతారు. భౌతిక ముఖాలకి ప్రతిగా తన నిర్లిప్త నాగరికత ద్వారా సమకూర్చిన ప్రతిమూర్తులు సార్జంట్ మత విషయిక భావనాలోకంలో

మనకి ప్రత్యక్షమౌతాయి. తమ అభిమాన పాత్రుడైన రూపచిత్రకారునిచే అలంకరింప బడిన మత సంస్థలలోని చిత్రకళ "ప్రసిద్ధ వ్యక్తుల" చే ప్రశంసింప బడిందంటే దానికి కారణం అనాటి సాంఘిక పరిస్థితే.

బార్ రూములలో సార్జెంట్, మైకేల్ హార్నెట్ (1848–1895) కంటె తక్కువ ప్రసిద్ధి పొందాడు ఐరిష్ వలసదారుల పుత్రుడైన ఈ చిత్రకారుడు వార్తాపత్రికలూ, పైపులూ పుస్తకాలూ, బీరుపాత్రలూ మొదలైన సామాన్య వస్తువులని యధాతధంగా చిత్రించాడు విశుద్ధపృష్ఠ భూమి ముందు కర్ర బేబుళ్ళమీద ప్రదర్శింపబడిన ఆ వస్తువులు చిత్రించ బడిన చిత్రాలుగా కాక యదార్థ వస్తువులుగా ప్రేక్షకుల కళ్ళని మోస పుచ్చేవి స్థల స్థితీ, చర్మం, పింగాళీ, కాగితం, లేక బల్ల చెక్కల నునుపు తనాలూ, గరుకుతనాలూ అతి యదార్థంగా చేతితో ముట్టుకుని చూడాల నేట్లా ఉండేవి హార్నెట్ ఉపరితలాలు స్పర్శనీయమైనవి అతని చిత్రా లకి అతని అమాయిక సమకాలికులు ముగ్ధులయేవారు కాని విమర్శకులు సర్వసాధారణమైన అతని చిత్రాలలో కళలేదన్నారు.

తరువాత తరువాత సాంస్కృతికుల విమర్శన హార్నెట్ కి దుర్భర మనిపించిది అతను మ్యూనిక్ లోని ఛేస్‌వంటి సర్వసమ్మత కళాకారులని అనుసరించసాగాడు. తత్ఫలితంగా అతను అతిఓపికతో పెద్దగడ్డంతో ఉన్న మధ్యకాలీన సన్యాసిని చిత్రించాడు కాని పరిణామం చాలాభయంక రంగా తయారైంది అతను మళ్లీ ఎన్నడూ మూర్తి చిత్రణకి పూనుకో లేదు ఐనా ఛేస్ స్టూడియోలోని ప్రాచీన చిత్రవస్తువులని స్వీకరిస్తూ అతను సామాన్య వస్తువులని వర్ణ్య విషయాలుగా చేసుకోవడం మానే శాడు మ్యూనిక్ విమర్శకులు అసంతృప్తితో అతనుపడే అనావశ్యక శ్రమని గేలిచేశారు. అతని ప్రాచీన సాంప్రదాయ పక్షపాతాన్ని మాత్రం వారు ప్రశంసించారు. ఉత్తమ న్యాయస్థానాన్ని వెతుక్కుంటూ హార్నెట్ పారిస్‌కి పరుగెత్తాడు అక్కడ ఒక శాలన్‌లో అతను తన "వేట తరు వాత" (చిత్రం 33) ని ప్రదర్శించాడు అతని ఆమోదకులు ఆ శాలన్‌నే అమాయికంగా చిత్రకళా ప్రదర్శనశాల అన్నారు న్యూయార్క్, మ్యూనిక్‌లలో వలెనే సామాన్య ప్రేక్షకులు ఆ చిత్రాన్ని చూసి ముగ్ధులై

పోయారు శిక్షిత ప్రేక్షకులు చీదరించుకున్నారు. ఒక పుస్తకంలో తన చిత్రం ప్రదర్శనంలోని సమ్మాన్య చిత్రాలలో ఒకటిగా ప్రచురించబడడం చూసి హార్నెట్ జయధ్వానం చేశాడు అతను తన పాత యదార్థశైలినీ తన కొత్త వర్ణ్య విషయాలనీ తీసికొని సంయుక్త రాష్ట్రాలకి తిరిగి వచ్చాడు.

అలభ్య ప్రాచీన కళావస్తువుల యెడల ఆసక్తి ఒక్క ఉత్తమ తరగతి వ్యక్తులవరకె పరిమితముకాదు గనుక అమెరికన్ బార్ రూములు ఒక్కొక్కప్పుడు ఛేస్ స్టూడియోలాగే ప్రాచీన వస్తుజాలంతో నిండి పోయేది "వేటతరువాత" అనేచిత్రాన్ని ఒకిన్యూయార్క్ శాలన్ యజమాని కొనుక్కున్నాడు విచిత్రవిషయాల యదార్థవ్యక్తీకరణకి సంబంధించిన ఈ చిత్రంవల్ల ఆ సంస్థ ప్రపంచ యాత్రికులందరికీ తీర్థస్థానమైంది సుదూరలండన్‌లో కమ్మర్షియల్ గెజెట్ ఆ చిత్రాన్ని గొప్పగాపొగడుతూ ఆవస్తువులు వాస్తవికమైనవని, అది ఎవరూ కనిపెట్టలేరనీ, ప్రేక్షకుల్ని మోసపుచ్చడానికి అవి అలా ప్రేలాడజేశారనీ చెప్తూ అనుభవశాలురైన కళాభిమానులు పల్లెటూళ్లనుంచి—ముఖ్యంగా చికాగోనుంచి—వచ్చిన పెద్ద మనుషులతో పందాలులేసి గెలుచుకున్నారని వివరించింది గ్రామీణులు చిత్రంలోని సీసానిపైకెత్తడానికి ప్రయత్నించడం, చేతులకి చదునుగా కేన్వాసు తగలడం, ప్రేక్షకుల హాసధ్వనిలో గది ప్రతిధ్వనించడంతో అక్కడి వాదవివాదాలు సమసేవి

మొదట్లో ఎంతోఆసక్తితో కొనుక్కున్న మ్యూజియంల సామాను గదుల్లోనే ఛేస్ చిత్రాలు నేడు విశ్రాంతి తీసుకుంటున్నాయి ప్రదర్శనశాల గోడలమీద అవి ఇంతకుపుందు ఆక్రమించుకున్న స్థలాలలో హార్నెట్ శాలూన్‌లకోసం తయారుచేసిన వస్తురూపచిత్రాలు అలంకరించబడ్డాయి ఛేస్ కృతుల స్థాయివాటిరచనకు కారణ భూతమైన చిత్రకారుని ఆత్మానుభూతిని అధిగమించ లేకపోయింది కాని హార్నెట్ తనకిష్టమైన వర్ణ్య విషయాలనిఅలంకరణ విధానాల్లోఅమర్చి కంటినిమోసచ్చేట్లా చిత్రించాడు ఈ విధంగా అతను ముందురాబోయే క్యూబిజం, సర్రియలిజం వంటిఉద్యమాలకి దోహకరంగా ఉపరితలాల వికాసంయెడల వర్ణలేపనాల సమ్మేళనం

యెడల ఎక్కువ శ్రద్ధ వహించాడు అతను తనసిద్ధాంతాలకి విరుద్ధమైన అన్యపద్ధతులలో కృషి చేసినందుకు ఈ ఉద్యమ ప్రచారకులు అతన్ని అభినందిచారు కళాకారుడు సహజభక్తి శ్రద్ధలతో తనసరళ కృషికి కట్టుబడి ఉండడం ద్వారా అతను ఎంతటి గొప్ప మౌలికతనీ గాంభీర్యతనీ సాధించగలడో దీన్నిబట్టి మనం గ్రహించవచ్చు

అమెరికన్ చిత్రకళ సర్వసాధారణవర్ణ్య వస్తువులతో తిరిగి సంబంధం స్థాపించుకోవడంద్వారా పునర్జీవనం పొందింది బోస్టంలో ఒక షోకార్డ్‌ల చిత్రకారునికి శిష్యరికం చేస్తూ మారిష్ ప్రెండర్‌గాస్ట్ (1859–1929) కుంచెలు కడగడం నుంచి సైన్‌బోర్డ్‌ల పెయింటింగ్ వరకూ గల అనేక రకాల పనులు చేశాడు ఆదివారాలలో పల్లెటూళ్ళకి వెళ్ళి ఆవుల చిత్రాల్ని గియ్యాలనే యత్నంలో వాటిని వెంబడించే వాడు. అతి తక్కువలో జీవిస్తూ వెయ్యి డాలర్‌లు కూడబెట్టి అతను తన బొమ్మలలో కొన్నిటికి చట్రాలు కట్టించాడు తనకి మంచి సంస్కార వంతురాలుగా కనిపించిన ఒక మతగురువు భార్యను "నేను పారిస్ వెళ్ళడం మంచి పనేనా" అని అడిగాడు "నిస్సందేహంగా మంచిపని", అనే మాటలు తన చెవులలో ప్రతిధ్వనిస్తూండగా అతను ఒక పశువుల పడవ ఎక్కి బయలుదేరాడు అతనికి చిత్రకళా నాగరికత ఎడల ఏవిధమైన ఆసక్తి లేనందువల్ల అతను ఆధునిక కళా పితామహుడైన పాల్‌సెజనీని ప్రశంసించిన ప్రధమ ప్రముఖ అమెరికన్ చిత్రకారుడుగా ప్రసిద్ధికెక్కాడు సెజనీ చిత్రాల్ని అనుకరించడం కాకుండా సెజనీవలెనే తనుకూడ తన సిద్ధాంతాలకి కట్టుబడి ఉండడంద్వారా అతని ఆదర్శాల్ని ప్రెండర్‌గాస్ట్ ఉపయోగించుకున్నాడు ఇంప్రెషనిజం తన అవసరాలకి కావలసిన పరికరాల్ని సమకూర్చి పెట్టడం వల్ల అతను తన చిరసంచిత రచనా నైపుణ్యంతో ఒక కొత్త శైలిని వికసింపజేశాడు అతను తన సాధన సంపత్తికి వెనీషియన్ కళావిధానంలోని ఉజ్వలవర్ణలేపనాన్ని జతపరచుకొని తన జీవితాంతం వరకూ అమెరికాలో స్థిరపడిపోయాడు

ప్రెండర్‌గాస్ట్, చట్రాలుకట్టేపనిలో ఉంటూ ప్రశస్త చిత్రకారుడుగా తయారయిన తన సోదరుడు ఛార్లెస్‌తో నివసించసాగాడు సోదరు

ళిద్దరూ చిన్న పిల్లలలా బోస్టన్ వీధుల్లో తిరుగుతూండేవారు తమ మధుర స్వప్నాలకి అనుకూలమైనంత వాస్తవికతని మాత్రమే వారి ఉజ్వల నేత్రాలు పరికించేవి రెవరే బీచ్‌లో విహరించే యువక బృందాలని ప్రెండర్‌గాస్ట్ అతి ఆసక్తితో చూసేవాడు వారిని చిత్రిస్తూ ఉచ్ఛ్వాస విశ్వాసాల్లో అతను పాడేవాడు

పడుచు పిల్లా, నీ వెక్కడికి వెడుతున్నావు నాకు చెప్పవు?
పడవ తెరచాప లెత్తింది, మంచిగాలి కొడుతోంది

ప్రెండర్‌గాస్ట్ లోని పరిపక్వత అతనిలో ఒక్క గంభీరతనితప్ప వేరే ఎట్టి మార్పునూ తేలేదు ప్రౌఢ మనోబలంతో అతను ఉయ్యాలలోని శిశువు సుకుమారత్వాన్ని వ్యక్తపరిచాడు. మెత్తని పచ్చ ఆకుల క్రింద తెలిసీలి నీటిపట్టులలో బంగారపు టిసుక తిన్నెలపై విశ్రాంతితీసుకుంటూ ప్రజలు అంతులేని ఆనందాన్ని అనుభవిస్తున్నారు కొంతదూరంలోనుంచి వారిని పరిశీలిస్తున్న ప్రెండర్‌గాస్ట్ తన పాత్రలని విసిష్ట భంగిమలలోనూ వివిధవర్ణాల దుస్తులలోనూ చిత్రించేవాడు ఐతే సామాన్య ముఖాలతో అతని ఆకృతులు అలుక్కుపోయినట్లు కనిపిస్తాయి ఒక ఛందో రీతిలో తీవ్ర భావోద్వేగంతో చిత్రించబడిన ఆ శరీరాలు ఒకదానితో నొకటి కలిసిపోయి ఏ మూర్తి ఎక్కడ అంతమైందో ఏ మూర్తి ఎక్కడ ప్రారంభమౌతుందో తెల్సుకోడానికి వీలులేకుండా ఉంటాయి ఆకృతి ప్రకటనలో రేఖల కంటె వర్ణాలు ఎక్కువ ఉపకరిస్తాయి చూసే మొదటి దృష్టితో ఆకృతులు గందరగోళంగా అమర్చినరంగుల ముద్దలుగా కనిపిస్తాయి, కాని పరిశీలించి చూసిన తర్వాత మనకి ఆశాతీత ఫలితం లభిస్తుంది వెలుతురు దృశ్యాన్ని ముంచెత్తుతుంది చదునుగా కనిపించే సమతలాలు గంభీరాకృతుల్ని దాలుస్తాయి నిశ్చలమూర్తులు సజీవంగా కదలాడుతాయి ఇప్పుడు ఎడంగా నుంచున్న ఆ యువతి క్షణం క్రితం తన సహచరుడి నడుముచిట్టి పట్టుకొందనడంలో ఏం సందేహంలేదు

ప్రెండర్‌గాస్ట్ తన తైల చిత్రాల్లో వివిధ ఉజ్వలవర్ణాల్ని ఉపయోగించడు వెలుగునీడల అతిశయ వైరుధ్యాల్ని చూపించాడు, అతను కర్ర

చెక్కడపు పనిలోకూడ సమతలతని తీసుకువస్తాడు అందుచేతే అతని చిత్రాలు ఫోటోగ్రాఫ్ తియ్యడానికి బాగుండవు (చిత్రం 34) అతని నీటిరంగు చిత్రాల్లో ఒకదాన్ని చూపుతుంది అందులో అతను ఆకృతుల సూక్ష్మ వ్యక్తీకరణానికి వ్యక్తిగత ఛందోరీతుల్ని ప్రయోగించాడు

సాంప్రదాయిక చిత్రకారులు ప్రెండర్‌గాస్ట్ కల్పనల్ని సౌమ్యత లేనివని కొట్టిపారేశారు ఐతే వికసిస్తూన్న యదార్థవాదుల బృందం ఒకటి అతన్ని ప్రశంసించింది వారి సిద్ధాంతాలు చాలవరకు అతని వాటికి భిన్నమైనవైనా "కళకోసమే కళ" అనే నిర్వచనం విషయంలో మాత్రం వారందరూ అతనితో ఏకీభవిస్తారు ఈ బృందానికి నాయకుడైన రాబర్ట్ హెన్రీ (1865–1929) మాటల్లో "మహావ్యక్తు లందరిలో కనిపించే ప్రత్యేకత వారు మానవత్వం కలిగి ఉండడమే," అన్నదాన్ని యదార్థ వాదులు నమ్మతారు ఛేస్ ద్వారానూ అతని అనుయాయుల ద్వారానూ ప్రచారానికి వచ్చిన వివిధ రచనా నైపుణ్యాలు ప్రత్యక్ష జీవితంతో సమన్వితం కాకపోవడంవల్ల వ్యర్థమైనవని హెన్రీ గ్రహించాడు తన పూర్వ చిత్రకారుల వలె అతనుకూడా అవే రచనా విధానాల్ని అనుసరించినప్పటికీ అతను ఒక సఫల కళా శిక్షకుడుగా ప్రసిద్ధి కెక్కాడు కారణం కుంచె పనికీ, కూర్పుకీ ఎక్కువ ప్రాధాన్యత లేదనీ, ప్రకృతితో చిత్రకారునికి గల ప్రత్యక్ష వ్యక్తిగతానుభూతిని వ్యక్తపరచే సాధనాలుగా మాత్రం వాటి అవసరం ఉందని అతను విశ్వసించడమే తను చిత్రించిన వ్యక్తిని గాని దృశ్యాన్నిగాని మొదట్లో చూచే చూడ్డంతో హృదయంలో కలిగిన అనుభూతిని తన చిత్రం చూడగానే ప్రేక్షకుని హృదయంలో కూడ స్పందింప జేయకలగాలని అతను అనేవాడు. హెన్రీ తన యీ సిద్ధాంతాన్ని అమెరికన్ యువతి విషయంలో అనువర్తింప జేసినప్పుడు అతని సమకాలీనులకు చాల ఘోరమనిపించింది అతను అమెలోని రక్తవిహీన సౌకుమార్యాన్ని కాక రక్తమాంసాల వాస్తవిక సౌందర్యాన్ని చిత్రించడం ద్వారా ఆరోగ్య విభూతిని వ్యక్తపరచాడు విదేశాలలో ఉంటూ విదేశాలలో కళాసాధన చేసిన హెన్రీ సంకుచిత జాతీయవాది అవడం అసంభవం. ఐతే చిత్రకారులు స్వీయ అనుభూతులతో కూడి

స్వకీయభావాలనే వ్యక్తపరచాలనే అతని నమ్మకం, చిత్రకళని తిరిగి దాని జాతీయ మూలస్థానంలో స్థాపించింది అతని శిష్యుడు జాన్ స్లోన్ వివరించినట్లు, "అమెరికన్ చిత్రకారుడవటానికి అమెరికన్ జెండాను చిత్రించవలసిన అవసరంలేదు మనం కళ్లు తెరుచుకున్నంత సేపు క్షణక్షణం అమెరికన్ దృశ్యాల్ని చూస్తూనే ఉన్నాము."

తన జన్మస్థలమైన ఫిలడెల్ఫియాలో హెన్రీ ప్రియశిష్యులు వార్తాపత్రికా చిత్రకారులుగా ప్రసిద్ధికెక్కారు జాన్ స్లోన్, జార్జ్ లూక్స్ (1867–1933), విల్లియం గ్లాకెన్స్ (1870–1938) ఎవరెట్ షిన్న్ (1867– ) తమ అవశ్యకత ఫోటోగ్రఫీ ద్వారా సంతృప్తి పరచబడగా నగరవీధులలోని దైనందిన నాటకాల్ని చిత్రబద్ధం చేశారు వారు చూసిన దృశ్యాలు చాలాకాలం క్రిందటనే కళాయోగ్యములు కావని నిరసించబడ్డాయి ఆ కాలపు ముఖ్యలక్షణంగా అంతకంతకి ప్రబలిపోతూన్న పారిశ్రామిక క్షేత్రానికి ప్రతికూలంగా సన్నద్ధులై 19 వ శతాబ్ద చిత్రకారులు నగరాలు ప్రారంభమైన చోట సౌందర్యం అంతమౌతుందని వాదించారు. యదార్ధతావాదియైన హోమర్ సైతం తను ఇరవై ఏళ్లుగా నివస్తూన్న న్యూయార్క్‌ని నిరసించాడు కాని హెన్రీ తన శిష్యులకి "మీరు నగరంతో పరిచితులు గనుక మీరు నగరాన్ని చిత్రించా"లని బోధించాడు ఆ బృందం న్యూయార్క్‌కి తరలింది ఐతే 1908 లో జాతీయ అకాడెమీ విలేఖరిచిత్రకారుల విప్లవ చిత్రాల్ని తిరస్కరించింది దానితో హెన్రీ తన చిత్రాల్నికూడ త్రిప్పేసుకుని "ఎనమండుగురు చిత్రకారుల" ప్రసిద్ధప్రదర్శనాన్ని ఏర్పాటు చేశాడు ప్రెండర్‌గాస్ట్ తదితర చిత్రకారులు కూడా అందులో చేరారు ఐతే మురికివాడల చిత్రకారులు ప్రేక్షకుల నెక్కువగా ఆకర్షించారు 'పూరిగుడిసెల బృందం" అని అంతా వారిని గేలిచేశారు ఐతే ఆకాలపు తత్వంలో పూర్తిగా పాదుకుపోయిన ఆ బృందాన్ని హేళనచేసి తిరస్కరించడం అసాధ్యమైన పని

ప్రధమ రూజ్వెల్ట్ తన నిధులతో రంగంలో ప్రవేశించాడు సంఘ సంస్కర్తలు కోటీశ్వరుల ప్రభావాన్ని వెలవెలబరిచారు, డ్రైజర తన నవలలు వ్రాయడం ప్రారంభించాడు, సామాన్య ప్రజాసంక్షేమం కోసం



హార్నెట్
వేట తరువాత
చిత్రం 33



చిత్రం 34

ప్రెండర్ గాస్ట్

తూర్పు నది



మూరిస్

వూల్ వర్త్ భవనం

చిత్రం 36



హార్ట్లి

పల్లెవాళ్ల ఆఖరివిందు

చిత్రం 37



చిత్రం 39

హాపర్

రాత్రి హోటల్



వుడ్

అమెరికన్ గోథిక్

చిత్రం 10



బెంటన్

కోత్లై వట్టి గడ్డి
చిత్రం 41




చిత్రం - 43

డేవిస్

గాస్ లైటులో న్యూయార్క్



షాన్

గనుల పనివాళ్ళ భార్యలు

చిత్రం 44



హా కెన్స్ర

కార్నివాల్

చిత్రం 48

ప్రలిచోటా సంఘ సంస్కరణోద్యమం విజృంభించింది. ప్రకృతికి సన్నిహితులుగా ఉండడంవల్ల ధనికవర్గంకంటె పేదవారు చిత్రవిషయాలుగా ఎక్కువ ఉపకరిస్తారనే సిద్ధాంతంతో "పూరిగుడెసెలబృందం"రంగంలో ముందంజ వేసింది. ఐతే వాస్తవిక తీవ్రవాదుల ద్వేషపూర్ణ నిరసన భావంతోగాక ఆవశ్యక వర్ణ్య విషయాన్వేషణలోనే విలేఖరి చిత్రకారులు పూరిగుడిసెల పరిసరాలు గాలించారు స్లోన్ "సాయంత్రపు రద్దీ" (చిత్రం 35) అనే చిత్రంలో పైభాగమున నడిచే రైలు క్రింది జనసమూహాన్ని చిత్రించాడు అతని ఉత్తమ రచనగా పేరొందిన ఈ చిత్రంలో నియమిత శక్తి శ్రమరహిత కళా సమగ్రరూపం మనకి కనిపిస్తాయి. లూక్స్ ఇతని కంటె ఎక్కువ చొరవగలవాడు విపుల హాస్య ప్రియుడు భావుకతకి ఎక్కువగా వశపడనివాడు మురికిపేటలో నాట్యమాడుతున్న ఇద్దరు మురికి బాలికలు గల అతని చిత్రం పుత్రతనపు చేష్టతోగూడిన ఓరోర గీతిక వంటిది బృందంలో ఎర్ర కళాకారుడైన గ్లాకెన్స్ తన విలేఖరి శైలితో రెనాయర్ ప్రభావాన్ని మేళవితం చేసుకున్నాడు షిన్ అసమానుడు వాడి విల్ రేఖా చిత్ర రచయితగా, అతను, ఫ్రెంచి చిత్రకారుడు వాట్యూ చిత్రించిన 18వ శతాబ్దపు మురళీగాయకులలో గల గాంభీర్యాన్ని కాకపోయినా — సౌకుమార్యాన్ని నాటి గానసభాగాయకులకి ఇవ్వగలిగాడు వర్ణ్య విషయాలని బట్టి వాస్తవికతా వాదులుగా భావించబడినా "పూరిగుడిసెల బృందం వారు" నగర జీవితాన్ని మాత్రం శృంగార దృష్టికోణంతో చూడగలిగారు వారిదృష్టిలో సామాన్య నగరవాసులు జాలి పడతగిన వారూకారు, నిరసించ తగినవారూకారు, సుందర సృష్టికి అనువైనవారు,

పూరి గుడిసెల బృందానికి ప్రాణమైన జార్జ్ బెల్లోస్ (1882–1925) తన సహచరులందరిలోకీ చిన్నవాడు అతను ప్రసిద్ధ చిత్రకారుడుగా రూపొందడమా ప్రముఖ బేస్‌బాల్ ఆటగాడుగా రూపొందడమా అన్న దాన్ని నిర్ణయించుకోవలసి వచ్చిన ఏకమాత్ర అమెరికన్ దృఢగాత్రుడుగా అతను అద్భుత శక్తిని సంచిత పరచుకున్నాడు ఫైనల్ సంవత్సరంలో ఓహియా రాష్ట్ర కళాశాలను విడిచి అతను హెన్రీతో కళా

భ్యాసం సాగించాడు. ఆ వెనువెంటనే అతనిలో చిత్రకళా ప్రవాహంవెల్లి విరిసింది అతను బెల్లోస్‌యొక్క శక్తి చేత జీవకళచేత ఆకర్షించబడ్డాడు అతను బాక్సర్లనీ, స్టీమ్‌ఇంజన్లనీ, మంచులో ముందుకు సాగులాడుతూన్న గుర్రపుబళ్లనీ చిత్రించాడు. అతని ఉత్తమరూపచిత్రాలు నాటకీయభంగిము లతో కూడుకున్నవి అతను తనపినతల్లిని ముసలితనంలోకి విక్కృతత్వం, కఠోరతా మూర్తీభవించనట్లు చూపించాడు అల్పవయస్కురాలైన తన కూతుర్ని పెద్దవాళ్ల దుస్తుల్లో నిలబెట్టి అతిచక్కగా చిత్రించాడు (వర్ణ చిత్రం) అతను దాన్ని అంతగంభీర భావంతో చిత్రించి ఉండకపోతే అది ఒక వ్యంగ్య చిత్రంగా తయారై ఉండేది అతని దృశ్య చిత్రాలు భావస్ఫూర్తితో సజీవంగా ఉంటాయి ఒకప్పుడు వెలుతురులోని మాధుర్యం ఇంకొకప్పుడు నీడలోని రహస్యమయత అవి మనకి చూపిస్తాయి ఉద్రేకపూర్ణ చిత్రకారుడైన అతను ఎప్పుడోకాని సాహిత్యక కల్పనలకి దిగలేదు అతని కళ్లు చూసిన వస్తువులనుంచే అతని భావాలుసూటిగా రేకెత్తేవి

సమగ్ర, వివరణాత్మక, వివిధ, సుదృఢ చిత్రాలు ప్రశాంత భావనా తీవ్రతని సూచించే సత్వర గమనంతో అతని కుంచెల నుండి ఉరకలెత్తాయి అతని చిత్రాలు ఎన్నడూ మూకవికాకపోయినా చాలవరకు అవి అస్పష్టవ్యక్తీకరణాలని చెప్పాలి అతని ఆసక్తి ప్రజ్వలించడాన్ని బట్టీ చప్పచల్లారిపోవడాన్ని బట్టీ అతని కూర్పుల అతుకులు విడిపోయి భాగాలుగా రచనా శక్తిలో వివిధ స్తరాలకి దిగిపోతాయి అతను వెలుగు నీడలలోనే ఆలోచించే స్వభావంకలవాడవడం వల్ల గొప్ప లిథోగ్రాఫర్‌గా ప్రసిద్ధికెక్కాడు తనచిత్రాల్లో వెలుగునీడల అతిశయ విభేదాల్ని అతను బాగా చూపించాడు. ఐతే అతని వర్ణాలు కావలసిన నంతగా ఆకర్షణీయాలు కావు

వయస్సు గడిచిన కొలదీ బెల్లోస్ హృదయంలోని అల్లకల్లోలం సంయమితమై అతనిలోని లోటుపాట్లు సర్దుకున్నాయి అకుంఠిత అద్భుత శక్తితో అతను ఎక్కువ ఆకర్షణీయమైన కూర్పులని అంతకంటె ఎక్కువ సమ్మోహనకరమైన వర్ణాల్ని సాధించాడు అమెరికా ప్రసాదించిన అద్భుత చిత్రకారుల్లో ఒకడుగా పేరొందిన బెల్లోస్ అతని సుదృఢగాత్రం దెబ్బ తినకపోతే ప్రపంచంలోని అసలైన గొప్పచిత్రకారుల్లో ఒకడుగా ప్రసిద్ధి

కెక్కి ఉండేవాడు ఇంకొక సామాన్య వ్యక్తి కంగారుపడి డాక్టర్ దగ్గిరికి పరుగెత్తే పరిస్థితిలో భయంకరమైన కండరాల బాధని నిర్లక్ష్యంచేసి తన వలబై మూడవయేట అనవసరంగా హెర్నియాచే పీడితుడై బెల్లోస్ చని పోయాడు

అతను చనిపోయే నాటికి ప్రపంచం చాలా అల్లకల్లోలంగా ఉంది నేడుమనను పట్టి తిప్పుతూన్న సుడిగుండంలో అప్పటికప్పుడే చిత్రకళా, జీవితమూ చిక్కుకుపోయాయి

# 7

# ఆధునిక కళాచార్యులు

జాన్ మారిన్ (1872–1953) వూల్‌వర్త్ భవనం (చిత్రం 36) గాలిలో ఊగులాడుతున్నట్లు నీటిరంగులో చిత్రించి ప్రదర్శించినప్పుడు ఆ భవనశిల్పి నిర్ఘాంతపోయాడు ఒక మహానగరం జీవితం దాని నివాసులకే పరిమితమై ఉందా అని ప్రశ్నించడం ద్వారా అతను తన చిత్రాన్ని సమర్థించుకున్నాడు "అక్కడి భవనాలన్నీ నిర్జీవాలా? పై తరగతివారికీ క్రింది తరగతివారికీ జరిగే పోరాటాలు, ఒక వర్గానికి తనకంటె గొప్ప వర్గంతోనో లేక తక్కువ వర్గంతోనో జరిగే సంఘర్షణ మొదలైన మహోద్యమాలు, మహాశక్తులూ నేను ప్రత్యక్షంగా చూస్తున్నాను రెండు వైపులకీ కిందికీ పైకీ లాగుతూ తోస్తూ ఈ శక్తులు విజృంభిస్తున్నప్పుడు ఆ సంఘర్షణల ప్రళయరాగాలు నేను వింటున్నాను అందులోంచి గొప్ప సంగీతం వినవస్తోంది"

ఒక వస్తువు యొక్క వాస్తవికతత్వం నిశ్చలత అని దాని కెటువంటి కదలికలూ ఉండవనీ వాదించే ఛేస్‌శిక్షణని మారిన్ నిరాకరించాడు "కళ ప్రపంచంలో జరిగేదాన్ని మనకు చూపించాలి' తన దృక్కోణానికి అనుకూలమైన ప్రతిష్ఠిత విధానమేదీ లేకపోవడం వల్ల అతను తన న్యూజెర్సీ గృహంలో విసుగెత్తి పోయాడు యూరప్ అంతటా పర్యటిస్తూ ఎవరికీ నచ్చని–ముఖ్యంగా తనకి నచ్చని – ఏదో చిత్రాన్ని అప్పుడప్పుడు చిత్రించసాగాడు, నిజకళా సాక్షాత్కారాన్ని పొందేనాటికి అతని

వయస్సు నలభై ఏళ్లు అప్పటికి అతని కుటుంబం అతన్ని సోమరిగా భావించేది తన ఆవశ్యకతలకి అనుగుణమైన రచనా విధానాన్ని కని పెట్టిన తరువాతే అతను ఆధునిక అమెరికన్ చిత్రకళా ధురంధరుడైన ఆల్‌ఫ్రేడ్ స్టిగ్‌లిజ్ ద్వారా అభ్యుదయ యూరప్ చిత్రకారులుకూడా అదే పద్ధతిలో కృషి చేస్తున్నారన్న విషయం తెలుసుకున్నాడు

యూరప్‌లోని చిత్రకారులంతా పారిస్‌లో సమావేశమై భౌతిక రూపాల్ని యథాతథంగా చిత్రించే సాంప్రదాయానికి చెందిన అభ్యుదయ విధానం ఇంప్రెషనిజం ద్వారా తన చరమసీమను అందుకుందని సిద్ధాంతీ కరించారు చిత్రకళ స్తంభించి పోకుండా ఉండాలంటే నూతన దృక్ప థాలు అవసరం వాంగో, గాగిన్‌లచే వెలిగించబడిన బాటను అనుసరిస్తూ ఎక్స్‌ప్రెషనిస్టులని పిలువదగిన మేటీస్, రోవాల్ట్‌లవంటి చిత్రకారులు బాహ్య ప్రకృతికంటె ఆంతరిక భావజగత్తులో తమకెక్కువ సంబంధముందని భావించారు మానసిక స్థితుల్ని ఇంకా సుస్పష్టంగా వ్యక్తపరిచడంకోసం వారు ఆకారాన్నీ రంగుల్నీ నిర్లక్ష్యం చేశారు మూర్తిలో తాము ప్రధా నంగా చూపించ దలచుకున్న అంశాన్ని బాగా పెద్దదిగా చేసి చిత్రించా లన్నారు. వర్ణ్య విషయం ఏ రంగుదైనా చిత్రకారునికి భావాన్ని సుస ష్టంగా వ్యక్తపరిచడంలో సహాయకారి అయే పక్షంలో దాన్ని ఎర్రరం గులో చూపించాలన్నారు సెజనీ అనుయాయులైన ఇంకొక బృందంవారు క్యూబిస్ట్‌లని పేరు పొందారు భావానికంటె ఆకారానికి ఎక్కువ ప్రాధా న్యతనిస్తూ వారు భౌతిక వాస్తవికతని క్యూబులూ, కోన్‌లూ సిలెండ ర్‌లూ వంటి మూల నిర్మాణ భాగాలుగా విడగొట్టడానికి ప్రయత్నించారు చిత్రం ప్రకృతిలోని ఒక భాగానికి చుట్టూ అమర్చిన చట్రంగా తయారవ కూడదని వారి సిద్ధాంతం స్వీయ నియమాలననుసరించే మోటారుకారు లేక గడియారం వంటి స్వయం సమృద్ధ వస్తువుగా అది రూపొందాలని వారి వాదన. రంగు అనేది ఒక భౌతిక పదార్థం కాన్వాసు ఒక సమతల ఆధారస్థలం. ఈ రెంటి ఛందోపూర్ణ కలయికద్వారా ఉత్తమ చిత్రం తయారవుతుంది దానికి ఆధారంగాని పరిచిత వస్తుసముదాయంగాని లేక పోయినా అది మన భౌతిక ఇంద్రియమైన నేత్రానికి సంతృప్తి దాయకంగా మాత్రం ఉండాలి

వర్ణ్య విషయాలు విభిన్నమైనప్పైనా ఎక్స్‌ప్రెషనిజం, క్యూబిజం విధానాలు రెండూ ప్రకృతిరూపానికి సంబంధించిన సామాన్య సాక్షాత్కారాన్ని అపశ్రుతుల ద్వారా విచ్ఛిన్నం చెయ్యడమే ఆశయంగా కలవి నిజానికి చిత్రాంకన విధానాలను బట్టికాక కేఫ్ వాదవివాదాలను బట్టీ విమర్శనాత్మక వ్యాసాలను బట్టీ మనం ఈ రెండు ఉద్యమాలకీ మధ్య సూక్ష్మరేఖని గీయవచ్చును. ఫ్రెంచి ఆధునిక కళోద్యమ నాయకుడైన పికాసోవలె అనేక మంది చిత్రకారులు ఈ రెండు ఉద్యమాల పరిశోధనలనూ ఉపయోగించుకున్నారు తరుచు ఒకే చిత్రంలో ఈ రెండు విధానాల్నీ కలగలపడం కూడా జరిగేది. తాము క్రమంగా రూపుమాసి పోతూన్న సున్నితత్వాన్ని పరిత్యజిస్తూ మౌలిక తత్వాల వేపు అగ్రగసరులమౌతున్నామని నమ్ముతూ చిత్రకారులు ఏక ముఖంగా సహజ ప్రాకృతిక మానవుని పరిశుద్ధ భావనాజగత్తు నుండి భావ స్ఫూర్తిని పొంద కాంక్షించారు, ఆఫ్రికన్ శిల్పమూ, చిన్న పిల్లల కృతులూ, ఉన్మాదుల రచనలూ, అమెరికన్ ఆదిమవాసుల అశిక్షిత చిత్రాలూ మొదలైన వాటి నుండి ప్రోత్సాహితుల యేందుకు వారు ప్రయత్నించారు

నిస్సందేహంగా ఈ ఉద్యమం ఒక విధమైన భావికి సంబంధించిన ఆందోళనతో ప్రారంభమయింది. తమ ఇరుగు పొరుగు వారికంటే ఎక్కువ భావుకత్వం కలిగిన యూరోపియన్ చిత్రకారులు తమ హృదయాంతరాలలో సాంప్రదాయిక సంస్కృతి ముందెప్పుడో భగ్నమౌతుందనే భయాందోళనలకి గురి అయారు సాంఘిక మూల్యాలు దోళాందోళితములైనప్పుడు చిత్రకారులు తమ వ్యక్తిగత విశిష్టతల్ని నిలువుకోలేక పోయారు బాంబుచెయ్యబడ్డ నగరం నుండి పారిపోయే వ్యక్తులలా వారు విచిత్ర స్థలాల శరణుజొచ్చారు. శాంతి ఉంటుందని తమ పెద్ద లెన్నడూ భావించని ఆస్థలాలలో అప్పుడప్పుడు వారికి శాంతి లభించింది

రెండు ప్రపంచ యుద్ధాలలో మన ప్రవేశం సమర్థ నీయమైనా నూతనశక్తులనీ అపాయాలనీ ఎదుర్కోవలసిన సత్యాన్ని సంయుక్త రాష్ట్రాలు గుర్తించకపోలేదు. ఐనా క్లిష్ట పరిస్థితి అంత త్వరలో ఏర్ప

దేట్టా కనిపించలేదు. క్లిష్ట పరిస్థితి ఏర్పడినా అంత సర్వనాశనకారిగా అనిపించలేదు పద్దెనిమిదవ శతాబ్దపు ఆదర్శాలూ, పంతొమ్మిదవ ఆర్థిక వ్యవస్థా యూరప్‌లో మారినంతగా ఈ తీరభూమిల్లో మారకుండా నిలచి ఉండడం గమనించతగ్గది ఈ విధంగా సెజనీ, వాంగోల అమెరికన్ సమకాలికులు కళాభిరుచుల ప్రాచీన రూపాల్ని తలక్రిందులు చేయడానికిగాను ఫ్రెంచి కళాచార్యులు పొందినట్లు ఆవేదాందోళనలను పొందలేదు ఐతే అమెరికన్ సంఘం స్తంభించిపోలేదు. పంతొమ్మిదవ శతాబ్దపుప్రారంభంలో చిత్రకారులు కొత్త రచనా విధానాల అవశ్యకతని గుర్తించారన్న విషయం మారిన్‌లో రేగిన ఏకాంత సంఘర్షణలు మనకి వ్యక్తపరుస్తున్నాయి, తమ పెద్దలకి అర్థంలేని తికమకగా కనిపించిన యూరపియన్ చిత్రకళ వారికి పూర్తిగా అర్థవంతంగా కనిపించింది

1913 లో ప్రముఖదేశీయ చిత్రకారులు, అమెరికన్ వాద ప్రవక్తలైన హెన్రీ బెల్లోస్ వంటివారితో సహా, అత్యాధునిక ఫ్రెంచి చిత్రాలతో కూడిన ఆర్మరీ ప్రదర్శనం ఏర్పాటు చేశారు ఆధునికోద్యమ క్రమవికాసంతో పరిచయం ఉన్న ఫ్రెంచి జన సామాన్యం వలె కాక అమెరికన్ జన సామాన్యం ఘోరంగా కనిపించే చిత్రాల్ని ఒక్కసారిగా ఎదుర్కోడానికీ వాటినర్థంచేసు కోడానికీ తయారుగాలేరు వార్తాపత్రికలు హత్యా విచారణలకి ప్రత్యేకించిన శీర్షికలు ఈ చిత్రాలకి ఉపయోగించాయి వాటిని అసహ్యించుకోడానికీ, గేలిచెయ్యడానికీ పౌరులు తండోప తండాలుగా విరుచుకొని పడ్డారు ఈ విధంగా ఆధునిక చిత్రకళకి సంబంధించిన తుపాను చెలరేగింది ఆధునాతన చిత్రకళని గూర్చి జరిగే తర్క పూర్ణచర్చలని కూడ ఈ నాటికీ అది అణచిపారేస్తోంది,

ఆర్మరీ ప్రదర్శనంలోనూ, ఆ తర్వాతనుంచి నేటివరకూ కొత్త అభిప్రాయాలని స్వీకరించే విషయంలో సందిగ్ధాభిరుచిగల వ్యక్తులు తమ వ్యర్థాభిమానాన్ని సంతృప్తి పరచుకోవడం కోసమూ ఉత్తమ ఉదాహరణలని గేలిచేయుడం కోసమూ మంచి అందమైన చిత్రాల్ని చూసే చూడనట్లుదాటిపోవడం మొదలెట్టారు ఇది రెండవ శ్రేణి చిత్రకారుల్నిబాగా ప్రోత్సహించింది ఆ చిత్రకారులకి నిజానికి వ్యక్తపరచవలసిన దేమీలేక

పోయినా ప్రేక్షకుల్ని తెల్లబోయేట్లా చెయ్యడంద్వారా పేరు ప్రఖ్యాతులు గడించడానికి వారు తాపత్రయ పడ్డారు జన సామాన్యం అర్థంచేసుకో లేరు కనుక తాము గొప్పవారమనే భావాన్ని — నిజానికి ఒక విధమైన హీనభావనని — చిత్ర సంగ్రహీతలలో కలగడానికి దీనివల్ల వీలు ఏర్పడింది ఈ అవకాశాన్ని ఉపయోగించుకుని లాభంపొందడంకోసం మౌలికత్వంలేని ఇంకొక చిత్రకార బృందం తాము సామాన్య వస్తువుల్ని, అందరికీ అర్థమయ్యేట్లా సౌందర్య భావనతో చిత్రరచన చేస్తున్నాం కనుక ప్రాచీనకళా సాంప్రదాయానికి మేము వారసులమని వారు వాదించారు ఇది ఇల్లా ఉండగా ఉత్తమ ఆధునిక చిత్రకారులు తమ పూర్వీకులు యుగయుగాల నుండి చేస్తూన్నట్లుగా, తాముకనిపెట్టిన శైలులకి పూర్తిగా భిన్నమైన శైలులలో తమనూ తమ తరాన్నీ వ్యక్తపరచడానికి ప్రశాంత కృషి చేశారు ఫలితం సాంప్రదాయికమూ, అన్వేషణాపూర్వకమూ అన్న దానితో ప్రమేయం లేకుండా వారు శక్తివంతమైన రచనకి ప్రాధాన్యత నిచ్చారు వారు నవయుగానికి చెందినవారుగాన నవ్య సిద్ధాంతాల వైపు అగ్రసరులయారు.

ఫ్రెంచి ఉద్యమం లేచేటప్పటికే మారిన్ తన కాళ్ళ మీద తను నిలబడి ఉన్నాడు అన్య సమర్థ వ్యక్తులు సాధించిన విధానాల నభ్యసించడంద్వారా అతను పరిణతి నందాడు తను ఫ్రెంచివాడినని నటించకుండా అతను మైనేలో తన ఆధ్యాత్మికావాసాన్ని ఏర్పరచుకున్నాడు, సాగరాన్నీ, నౌకలన్నీ, సాగరతీరాన్నీ నీటి రంగులలో వక్తపరచడానికి అతను తన కళను అంకితం చేసుకున్నాడు కాలం గడిచిన కొలదీ అతను ఈ కళలో ఆరి తేరాడు ప్రకృతి వివరాల్ని ఉన్నవున్నట్లుగా చూపించక పోయినప్పటికీ మారిన్ యదార్థతయొక్క మూల తార్కిక తత్వాల్ని ఎన్నడూ భంగపరచలేదు అతని ఆకాశంలోని సూర్యుడు నల్లగా ఉంటే ఉండొచ్చు కాని చిత్రంలోని మిగిలిన భాగాలతో దానికి గలసంబంధాన్ని బట్టి అది అసలైన సూర్యుడే రూపవర్ణాల చైతన్య జడతత్వాలు కళకి ఒక విధమైన విద్యుచ్ఛక్తిని ఇస్తాయి "వస్తువుల సంఘర్షణ అంటేనాకు ఇష్టం సజీవమైన జీవులున్నచోట నిరంతర సంఘర్షణ ఉండనేఉంటుంది.

ఐతే అద్భుతమైన సంతులన శక్తితో ఆ సంఘర్షణని నా ఇష్టంవచ్చి నప్పుడు నియమితం చేసుకోగలగడమే నాకు కావలసినది" అన్నాడు అతను శక్తిని శాశ్వతత్వంలోనికి సంతులన పరచడంద్వారా మారిన్ కళ మానవుని ఎడలా, శారీరిక విశ్వం ఎడలా దర్శకుని విశ్వాసాన్ని అభివృద్ధి పరుస్తోంది

మారిన్ వలె గాక మార్స్‌డెన్ హార్ట్లీ (1877–1943) తనదని చెప్పుకోతగ్గ శైలి ఏదీ ఏర్పడకముందే యూరోపియన్ శైలులతో ప్రయోగాలు జరిపాడు తన జన్మస్థలమైన మైనేలో ఇంప్రెషనిజంలో అతను జరిపిన ప్రారంభిక ప్రయోగాలూ, రైడర్ యొక్క ప్రభావమూ అతనికి విదేశాల్లో ఎందుకూ పనికి రాలేదు ఫ్రెంచి విధానాలని వాటి పరిశుద్ధ రూపంలోనూ, తన చంచల మనస్తత్వానికీ అనుకూలంగా కనిపించిన అతి సూక్ష్మ జర్మన్ పద్ధతుల్లోనూ, రైడర్ ఒక విధానాన్నుంచి ఇంకొక విధానానికి తన దీర్ఘ యాత్రని ప్రారంభించాడు పసికట్టిన జంతువుని వెంటాడే వేటకుక్కలా ద్విగుణీకృత వేగంతో అతను అనేక విభిన్న ప్రభావాల వెంట ఉత్సాహం తగ్గినప్పుడు తనింతకి ముందు వేదవాక్కులుగా బోధించిన సిద్ధాంతాలనే త్రోసిరాజని అతను సుస్థిర సంకల్పంతో చిత్రరచన సాగించాడు ఐతే కాలం గడచినకొలదీ అతని కృతులు అనుకున్నంతగా సానతేరలేదు

పారిస్ కేఫ్‌లలో సారసకఠోరరావం వినేనాటికి హార్ట్లీ వయస్సు అరవై ఏళ్లకి పైబడింది అతను బెర్లిన్ ఆకాశంలో నల్లని ముక్కల్ని చూశాడు అవి బహుశః ఋతు పరివర్తనంలో దక్షిణానికో ఉత్తరానికో పయనిస్తూన్న సారస పక్షులు అయి ఉంటాయని అతననుకున్నాడు "నా జన్మస్థలమైన మైనే ఖండాన్ని ఓర్పుతో నన్ను క్షమించమని కోరాను నేను త్వరలోనే వచ్చి నీ ఒడిలో తలదాచుకుంటాను ఈ నీ అవిధేయ పుత్రుడు ఆకాశ పథంలో విహరించే సారస మృదు మధుర సంగీతాన్ని ఆలకిస్తూ ఉంటాడు" ఆ దేశద్రిమ్మరి తన వృద్ధాప్యంలో తన చిన్ననాటి ఇంటిని చేరుకున్నాడు అక్కడ అతను తన చిలకాల సంచిత రచనా నైపుణ్యాలని సార్థకపరుస్తూ తనగంభీర హృదయంలోని భావనా నిధుల్ని

త్రవ్విపోశాడు. మిగిలిన ఆపది సంవత్సరాలలోనూ అతను తన ప్రసిద్ధికి కారణభూతమైన గొప్పచిత్రాల్ని చిత్రించాయి "పల్లెవాళ్ల ఆఖరి విందు" (చిత్రం 37)అనే చిత్రం ఎక్స్‌ప్రెషనిజంద్వారా గంభీర సముద్రగర్భంలోకి ప్రయాణమయే వ్యక్తులకిచ్చే వీడ్కోలు సంరంభాన్ని వ్యక్తపరుస్తుంది

ఒక వంక హార్ట్‌లీ నిరాశాహృదయంతో తన గ్రామీణానుభూతుల కేంద్రానికి తిరోగమిస్తూండగా ఇంకొక వంక మాక్స్ వెబర్ (1881– ) సర్వశక్తిసంపన్నుడైన విస్లర్ వంటి విరుద్ధ వాతావరణంలో నుండి వికసిస్తూ ఫ్రెంచి విధానానికి మన సహజ ప్రతినిధిగా తయారయాడు, ఒక రష్యన్ కుట్టుపనివాని కొడుకైన వెబర్ తన పదవఏట బ్రూక్‌లిన్‌కి తీసుకురాబడ్డాడు చైనీయ కళారాధకుడైన ఆర్థర్ వెస్లీడౌవద్ద అతనుచిత్రకళనభ్యసించాడు. పారిస్‌జేరుకుని పెజనీ ప్రభావధారలో సుస్నాతుడయాకు మూడేళ్ళపాటు జీవిత ఆధునిక కళాచార్యుల సాన్నిధ్యంలో గడిపాడు ఈ విధంగా అతను మేటిస్సీ, పికాసో, ఆదిమ కళాకారుడైన రూసోల పరిచయ భాగ్యం పొందాడు ఆ తర్వాత వెబర్ అమెరికా తిరిగివచ్చాడు సముద్రాల్ని దాటే చిత్రాల ద్వారా అతను పారిస్‌తో తన సంబంధాన్ని కొనసాగించాడు ఊరికే సరదాగా కాక, స్వీయ దృక్కోణాన్ని అనుసరించాలనే సుదృఢ నిశ్చయంతో అతను ఫ్రెంచి చిత్రకళకి ప్రతిగా స్వీయ కళనొకదానిని సృష్టించుకున్నాడు క్యూబిజంనీ, తదితర సాంప్రదాయిక విధానాలనీ అభ్యసించాడు. ఎక్స్‌ప్రెషనిజంకి సంబంధించిన వివిధ రూపాల్ని తరచాడు వివిధ రచనావిధానాలకీ, వివిధ వర్ణ్య విషయాలకీ మధ్య చక్కని సంతులనాన్ని సాధించడానికి కృషిచేశాడు ఒక్కొక్కప్పుడు అతను ఫ్రెంచి కళాకారులకంటె ముందుగా ఆధునిక విధానాల్లో అగ్రసరుడయేవాడు. "హస్తావలేపనములు" (చిత్రం 45) అతని అతి స్వాభావిక చిత్రాలలో ఒకటి. ఇందులో అతను తన త్రితలాత్మక అలంకరణ దృక్కోణానికి అనుకూలంగా ఉండేట్లా స్త్రీ మూర్తిని పునర్నిర్మించాడు

వెబర్ కళ మన్ని ఒక అద్భుత కల్పనా లోకంలోకి తీసుకుపోతుంది అక్కడి రూపాలు యథార్థాలుగా కనుపిస్తున్నా విచిత్రంగా

ఉంటాయి. అవి కలసో ఆకారాలుగా కనుపిస్తాయి అతని సర్వతోముఖా నుభూతికి సంబంధించిన వింత ప్రపంచాన్ని మనం చూస్తాము అందులో అతని జన్మ స్థానానికి సంబంధించిన సమృద్ధప్రాచ్యకల్పనలు ఉంటాయి అతని జ్యూయిష్ తాతముత్తాతల సాంప్రదాయిక రహస్యసభావాలు కనిపి స్తాయి ఫ్రెంచి స్టూడియోల ప్రయోగాత్మక సాధన కనుపిస్తుంది అన్నిటినీ మించి సంయుక్త రాష్ట్రాల నవనవోన్మేష శక్తి ప్రత్యక్షమౌతుంది తమలో తాము సంపూర్ణమైన సూక్ష్మవర్ణాలద్వారానూ ఆకారాలద్వారానూ సంగీతంలోలాగ భావోద్వేగం వ్యక్తమౌతుంది

మారిన్ లాగే ఛార్లెస్ షీలర్ (1883–) ఛేస్ దగ్గిర కళాభ్యాసం చేశాడు కాని అతని తీవ్ర ప్రభావాన్ని ఉపయోగించు కోవడానికి బదులు అతనికి శిష్యుడై పోయాడు అతను ఉజ్వలమైన తూలికా చాలనములతో ఉపరితలాల్ని చూపడంలో సమర్థుడు యూరోపియన్ యాత్ర చేస్తున్న ప్పుడు పూర్వాచార్యుల చిత్రాలకి త్రితలాత్మక రూపాన్నిచ్చే నిర్మాణాత్మక విషయాల్ని తను నిర్లక్ష్యం చేశానని తెలుసుకున్నాడు ఈ నిర్మాణము ప్రకృతిని అనుకరించడంలోగాక పరిశుద్ధ అలంకరణని సృజించడం కోసం ఉపయోగించమని అతని ఫ్రెంచి సమకాలీనులు అతనికి సలహాఇచ్చారు "అప్పుడే చిత్రకళ కాలానికీ స్థలానికీ తాత్కాలిక విషయాలకీ అతీతంగా ఉంటుంది' అతను ఛేస్ విధానాలనుండి క్యూబిజంకి మరలాడు అతను ఒక విధానాన్నుంచి ఇంకొక విధానానికి తిరుగుతున్నా అతను కళకళ కొరకే అనే పరిధిలోనే నిల్చి ఉన్నాడు నిర్మాణం లేకుండా బాహ్యాకారాల్ని చిత్రించడంలోనూ, బాహ్యాకారాలు లేకుండా నిర్మాణాన్ని చిత్రించడం లోనూ అతను మానవాకారాలనుంచి వర్ణాన్ని విడదియ్యడానికి ప్రయత్నిం చాడు.

గ్రామీణ పెన్సిల్వేనియాలో షీలర్ విఘ్నాలతో సంఘర్షించాడు చిత్రకళ ఫొటోగ్రాఫులకి విరుద్ధమైనదనే గట్టి నమ్మకంతో జీవిక కోసం కెమేరా శరణు పొందడానికి అతను నిశ్చయించుకున్నాడు తన సౌందర్యా న్వేషణకి ఇది ఎంతమాత్రం అడ్డు తగలదని అతను నమ్మాడు కా! ప్రాచీన పెన్సిల్వేనియా కర్షక గృహాల నిర్మాణంలో నిర్మాణ నియమాల

ఉపయోగించబడ్డాయని అతను తన ఫొటో గ్రాఫులద్వారా తెలుసుకున్నాడు అప్పుడే అతను ఆధునిక యంత్రాల శక్తివంతమైన ఆకారాలచే ప్రభావితుడయాడు పర్యవిషయాల్ని అలంకరణకి అందం తెచ్చేందుకు ఉపయోగించొచ్చని అతను తేల్చుకున్నాడు. తన సుప్రసిద్ధమైన శైలిని అతను వికసింపజేసుకున్నాడు అతని అమెరికన్ దృశ్య చిత్రం (చిత్రం 38) క్యూబిజం ద్వారా అతను నేర్చుకున్న విధానంలో ఒక పారిశ్రామిక దృశ్యాన్ని వ్యక్తపరుస్తోంది ఆ దృశ్యము తార్కికము, సంతులితము, సుందరము. ఐనా చైతన్యం కంటె అతను రూపానికే ఎక్కువ ప్రాధాన్యత నివ్వడం మానలేదు అతని రంగులు వెలవెల పోతాయి, అతని విధానం నిరుత్సాహపూరితమైనది. ఇతర మనుష్యులలాగే చిత్రకారులుకూడ ప్రపంచానికి వాళ్లు ఏమిస్తారో వారు అదే పొందుతారు వైజ్ఞానిక దృష్టితో మనం షీలర్ చిత్రాల్ని ప్రశంసిస్తాం కాని ఆ చిత్రాలు మన భావాల్ని ఉద్రేకపరచవు

ఎడ్వర్డ్ హోపర్ (1882—) మంచి వర్ణ స్థాయిలు చూపిస్తాడు ఛేస్ సౌందర్య విధానంలో కాక హెన్రీ మానవతా విధానంలో తయారైన హోపర్ రచనా విధానాల ప్రయోగాలు అనావశ్యక శ్రమ యని భావించాడు చిత్రకారుడు ప్రకృతితో తనకుగల ఘనిష్ట పరిచయాన్ని వ్యక్తపరచడంలో ఈ ప్రయోగాలు కొంత వర కుపయోగిస్తాయి ఐతే అతను సాంప్రదాయిక విధానంలో కృషి చేయలేదు తన సహ విద్యార్థి బెల్లోస్ వలె గాక అతను హెన్రీ నుంచి నేర్చుకున్న విధానాల ద్వారా స్వకీయభావాలని వ్యక్త పరచలేకపోయే వాడు ఒకవంక బెల్లోస్ చిత్రవర్షం కురిపించేస్తూండగా ఇంకొక వంక హోపర్ తనను తాను వెతుక్కోడంలో తబ్బిబ్బు లాడాడు విన్ హోమర్ వలె బాహ్య ప్రభావాలకి వశం కాకుండా అతను తయారుగా ఉన్న ఫ్రెంచి విధానాల్ని గాని, అమెరికన్ విధానాలను గాని అనుసరించలేదు. అతని రచనా విధనమూ కళా దృక్కోణమూ కలిసి వికసించాయి. హోపర్ తన అజ్ఞాత వాశం నుంచి తిరిగి కళా క్షేత్రంలో ప్రవేశించే సమయానికి బెల్లోస్ పూర్తిగా తన కళా జీవితానికి ఆఖరి మెట్టుమీద నిలిచాడు హోపర్ ఒక ప్రముఖ మౌలిక శైలిని సాధించాడు

హెన్రీ అభ్యుదయ దృక్కోణాన్ని హోపర్ నిరసించాడు సుదృఢ వాస్తవికతని చూపగల నాటకీయ తూలికానైపుణ్యాన్ని కూడ అతను లెఖ్ఖ పెట్టలేదు అతను మొక్కవోని ఉత్సాహంతో ప్రేమతో ఆమెరికన్ నగరాల్ని వ్యక్తపరిచాడు అందులో బ్రహ్మాండమైన గాదెలూ వాస్తుకళకి సంబంధించిన రకరకాల శైలులూ, ఖాళీగానో లేక అతిగా అలంకరించబడిన గోడలమీద వెలుగునీడల దాగుడుమూతలూ మనం చూస్తాము అతను వ్యక్తుల్ని చూపించినప్పుడు – రాత్రి తెల్లవార్లూ తెరిచి ఉండే హోటల్ (చిత్రం 39), షేడ్ లేని బల్బ్ క్రింద తీవ్ర ప్రకాశంలో వస్త్రములు ధరించే ఒక స్త్రీ – మనం వెలుతురు ప్రకాశిస్తూన్న ఒక కిటికీలోంచి చూస్తున్నట్లుగా వాళ్ళని ప్రత్యక్ష ప్రకాశంలో చూస్తాము అతని చిత్రాలు ఒక మహానగరం యొక్క ఏకాంతత్వంతోనో, రహస్యంతోనో నిండి ఉంటాయి. పల్లెటూరి దృశ్యాలలోనూ, నగరదృశ్యాలలోనూ కూడా హోపర్ క్యూబిజం నుంచి సంగ్రహించిన షీలర్ చిత్రాలలోవలె జామితీ కూర్పులను మంచి సమర్థతతో చూపించాడు కాని అతను సంగ్రహించిన విషయం ఒప్పుకోడు "కోణాలు నాకు సహజంగా లభిస్తాయి" ఒకే యుగంలో నివసిస్తూ ఫ్రెంచి కళాచార్యుల వలెనే అతను కొన్ని నిర్ణయాలకి వచ్చాడు వారికళవలెనే అతని కళ స్పందించే శక్తి కలది ఎందు చేతనంటే అది అతని స్వీయ స్వభావం నుంచీ, స్వీయ అనుభూతినుంచీ వికసించింది.

# 8

# భవిష్యత్తులోకి

ఎంతోకాలం నుంచి వస్తుందని భయపడుతూన్న విషమపరిస్థితి 1914లో వాస్తవికరూపం దాల్చింది యూరప్ యుద్ధక్షేత్రాల్లో ఆ యుగం తన జీవన రక్తాన్ని వెడల గ్రక్కింది 19 వ శతాబ్దపు ఆదర్శాలు తల క్రిందులయ్యాయి అప్పటివరకూ ప్రముఖ జాతీయ తత్వంగా భావించబడు తూన్న మానవ సమగ్ర వికాసాన్ని సహితం అమెరికాలోని విచారవంతు లైన వ్యక్తులు సంశయదృష్టితో చూడసాగారు పూర్ణ వికాసం చెందిన ఆ యుగపు రచయితలు "పతిత తరంవారు" అని గేలి చెయ్యబడ్డారు

ఇయోవాలోని సెడార్ రాపిడ్స్‌లో తన యువక జీవితాన్ని గడ పిన గ్రాంట్ వుడ్ (1892–1942) సింక్లేర్ లూయీ రచించిన మెయిన్ స్ట్రీట్‌లోని ఒక పాత్రగా రూపొందదగిన వ్యక్తి తన ఇరుగు పొరుగు వారు పని పని అని తనను పీడించుకుతినగా అతనువిధిలేక చిత్రరచన చెయ్యని ఇతరసమయాలలో బడి పిల్లలకి లాంప్‌షేడ్ పేపరు చర్మంలా కనిపించాలంటే ఏం చెయ్యాలో నేర్పేవాడు. జిగురుతో అతికించబడి చటుక్కున విడివిడిగా విడిపోయే పువ్వులతో అతను మహిళలని గౌర వించేవాడు, నాలుగురోడ్లూ కలిసేచోట నుండే గడియార స్థంభం మీద నెమలిగూడు పెడితే చూసి ఆనందించినట్లు లూయీ జన్మస్థలమైన గాఫర్ ప్రెయిరీవలెగాక సెడార్‌రాపిడ్స్ నివాసులు తమ ఊళ్ళో ఒక చిత్రకారుడు ఉన్నందుకు ఎంతో సంతోషించారు, అతని స్నేహితులు తమ జతం

చెక్కులకి అతన్ని భాగస్వామిగా చేసుకునేవారు ఫాన్సీ షాపులవారూ, టీ షాపులవారూ అతని చిత్రాలని ప్రదర్శించి అమ్మేవారు ఒక పౌరుడు అద్దెలేకుండా ఇచ్చిన ఇంట్లో అతని స్టూడియో ఉండేది అతని వింత స్టూడియోలో వుడ్ చేసే విచిత్ర విందులకి వోట్స్ కంపెనీ ప్రెసిడెంట్ ఐన ఒక లక్షాధికారి తప్పని సరిగా హాజరయేవాడు ఈ విధంగా వుడ్ స్థానికంగా చాలా ప్రసిద్ధికెక్కాడు. ఐతే చాలా కాలం వరకూ అతను ఈ గౌరవాన్ని అసహ్యించుకొనేవాడు. అప్పుడప్పుడు వెళ్లివస్తూ అతను పారిస్‌ని జయించడానికి సంకల్పించుకున్నాడు. అతనక్కడ రూడీ సీనేలో ఒక గేలరీని అద్దెకికూడ పుచ్చుకున్నాడు అందులో 37 ఫ్రెంచి దృశ్య చిత్రాల్ని అతను ప్రదర్శించాడు. ఐతే పారిస్ జయించబడలేదు నాజూకుతనంలేని ఈ మధ్య పశ్చిమీయుడు సుకుమార శైలులని అనుకరించడంలో చాలాకాలం గడిపాడు ఇంప్రెషనిజం మొదలుకొని అబ్‌స్ట్రాక్షన్ వరకుగల అన్ని శైలుల్నీ అతను ఆకళించుకోడానికి ప్రయత్నించాడు.

తన నాలుగవ యూరోపియన్ యాత్రలో పదిహేనవ శతాబ్దపు జర్మన్ ఆదిమవాసుల సూక్ష్మ ప్రాంతీయ కళా శైలి తన దృష్టికోణానికి ఎక్కువ అనుకూలంగా ఉంటుందని వుడ్ తెలుసుకున్నాడు మ్యూనిక్‌లోని జాతీయ వాతావరణలో తనుకూడ తన దేశస్థుల్ని అతను చిత్రించాలనుకున్నాడు యోవాకి తిరిగివచ్చి అతను తీవ్రానుభూతితో కూడిన చక్కని చిత్రాలు చిత్రించసాగాడు, వాటిలో "అమెరికన్ గోతిక్" (చిత్రం 40) అనేది ఒక గొప్ప చిత్రం ఇద్దరు మధ్య పశ్చిమీయ సామాన్య వ్యక్తులని మక్కికిమక్కి దింపిన ఈ చిత్రం అసలు వ్యంగ్య శైలిలో చిత్రించాలని అతను ఉద్దేశించాడు ఇంతకీ ఆ చిత్రంలోని వ్యక్తులు అతని సోదరీ అతని ప్రియస్నేహితుడూను వారియెడ అతనికి గల ప్రేమాభిమానాలు పైలుబికి అంతవరకూ అతను నిరసిస్తూవచ్చిన అతని మాతృదేశాన్ని వ్యక్తపరచేట్లా చేశాయి,

ఒకానొకప్పుడు బింఘాంచే ఉజ్వలతరంగా వక్తపరచబడిన ఆదిమకాలం (చిత్రం 25) ఒక విచిత్ర సంఘ నిర్మాణానికి దోహదమిచ్చింది

కనీసం పైపైన చూడడానికేనా అది యూరప్ సంఘంలా ఉంటుంది ప్రాచీన ప్రపంచ విధానాలనుండి తిరోగమించడమనేది మధ్య పశ్చిమీయ చిత్రకారులకి చాలా చిన్నతనంగా ఉండేది హూసీర్ ఛేస్ (చిత్రం 31) వలె వారు తాము అమెరికన్ మొరటుతనం అనుకుంటోన్న విషయాలకి దూరంగా ఉండడానికి ప్రయత్నించారు వుడ్ కూడా అలా పారిపోవడానికి ప్రయత్నించినవాడే కాని ఇపుడు అనుకోకుండానే అతను మధ్య పశ్చిమ సాహసిక దృశ్యాలని చిత్రించసాగాడు యూరప్‌లో ప్రేలేందుకు సిద్ధంగా ఉన్న టైం బాంబుని లెఖ్ఖ పెట్టకుండా జీవిస్తూన్న జాతిని అమెరికన్ గోతిక్ ఆశ్చర్యచకితం చేసింది

సినీ తారలకు మాత్రమే లభ్యమయే కీర్తి శిఖరాల్ని అధిరోహించిన వుడ్ ఒక్కసారిగా గర్వపడిపోయాడు మధ్య పశ్చిమీయ సాదృశ్యం పేర అతను పారిస్ న్యూయార్క్‌ల కళా సిద్ధాంతాలని మొండిగా ఖండించాడు అంతేకాదు అతను ఒక జాతీయ ప్రచారోద్యమాన్నికూడా లేవదీశాడు, నలిగి పాతగిలిన రెండు ఎర్ర ఫ్లానెల్ అండరువేర్లని విషయంగా తీసుకుని అతను ఒక చిత్రం చిత్రించాడు అతను అసహ్యించుకుంటూన్నట్లు నటిస్తూన్న కళాప్రపంచమే అతన్ని తీవ్రంగా నిరసిస్తూ ఒక పెద్ద గాలి దుమారం లేవదియ్యగా అతను చాలా కంగారు పడిపోయాడు దానితో ఇంతకుముందు చిత్రిస్తూన్నటుగా దృఢ సంకల్పంతో భావనా శక్తితో చిత్రరచన చెయ్యడం అతనికి అసాధ్యమైపోయింది చనిపోయేముందు తన ఏభయ్యోవ ఏట అతను థామస్ బెంటన్‌తో "నేను మళ్ళీ పూర్తిగా కొత్త శైలిలో చిత్ర రచన చెయ్యబోతున్నా" నని చెప్పాడు

మిస్సూరీకి చెందిన థామస్ బెటన్ (1889– ) కాన్సాకి చెందిన జాన్ స్ట్యూవర్ట్ కర్రీ (1897–1964) ప్రాంతీయతావాద ఉద్యమ నాయకత్వంలో వుడ్ కి భాగస్వాములయారు మూలసిద్ధాంతాలు చాలా ఉత్తమమైనవే – చిత్రకారుడు తనకి సుపరిచితమైన ప్రపంచాన్నే చిత్రించాలి– కాని ఈ సిద్ధాంతం అడుగున దురభిమానపూరితమైన ప్రాంతీయత కరడుగట్టింది, వారి ఉద్దేశ్యంలో అమెరికాఅంటే ఒక్క మధ్యపశ్చిమమే అమెరికా ఒక్కటే కళా సృష్టికి అనువైన ప్రదేశం పారిస్ న్యూయార్క్‌లు

కళా విషయికంగా పతనావస్థలో ఉన్నాయి మధ్య పశ్చిమమం సాంస్కృతికంగా వెనుకబడి ఉన్న విషయము ఆర్థిక మాంద్యాన్నుంచీ, ఉరకలెత్తుతుంటూ వస్తూన్న యుద్ధాన్నుంచీ రక్షింపబడడానికి స్థానిక స్వర్గం వంటిది అవసరమనే విషయం గుర్తించకుండా ప్రాంతీయతావాదులు చిత్తంవచ్చినట్టల్లా మాట్లాడసాగారు వుడ్ బెంటన్ కర్రీలు ఈవాదాన్ని తమ సహచరులంత తీవ్రంగా కొనసాగించక పోయినా వారు మాతృదేశ విషయాల్నే ఎక్కువఉత్సాహంతో స్వీకరించారు ఈ ముగ్గురూకూడ నాజూకు కళని సాధించడానికి మొదట్లో ప్రయత్నించి విఫలులైన తరువాతే ఈ మార్గాన్ని తొక్కారు తమ వాదాన్ని అసలైన కళాదృష్టికోణంతో వారు సుస్పష్టం చెయ్యలేక పోయారని కూడా చెప్పొచ్చు ఈ ఉద్యమం బాగా ఉధృతంగా ఉన్న రోజులలో బెంటన్ చిత్రించిన చిత్రాలు జానపదగీతాల ధోరణిలో రూపొందాయి ఐతే వాటి జానపదీయతలో కృత్రిమత్వం బాగా కనిపిస్తోంది. వాటిలో ఒక విధమైన మోటు కదలిక తేవడం కోసం నిర్మాణశక్తిని చూపించడం కోసం భావతత్వం, ఆకారతత్వం త్యాగం చెయ్యబడ్డాయి అదృష్టవశాత్తు "జూలై వట్టి గడ్డి" (చిత్రం 41) వంటి తరువాతి చిత్రాలు గంభీర ప్రశాంత భావాన్ని వ్యక్తపరుస్తాయి

ఛార్లెస్ బర్చ్‌ఫీల్డ్ (1893 – ) సంస్కృతి ప్రతిష్ఠల కోసం మధ్య పశ్చిమాన్ని విడిచిపెట్టి ఎన్నడూ బయటికి వెళ్లలేదు ఐనా అతను శుద్ధ ప్రాంతీయవాదానికి అంతగా వశమైపోలేదు క్లీవ్‌లాండ్ లో కళాధ్యయనం చేసిన తర్వాత అతను తన జన్మస్థలమైన ఓహియోలోని సాలెంకి తిరిగి వచ్చాడు జీవికకోసం ఎకౌంటెంట్‌గా పనిచెయ్యసాగాడు ఇతర చిత్రకారుల సంపర్కానికి పూర్తిగా దూరమైపోయి అతను తన బాల్యస్మృతులలో విహరించసాగాడు. అతనుఅన్నట్లుగా "చీకటిలో భయపడడం వంటి భావాలనీ, తుపానుకి ముందు పువ్వుల అను భూతులనీ, క్రిమికీటకాదుల ధ్వనులలోని సంగీతాన్నీ వ్యక్తపరచడానికి" అతను ప్రయత్నించాడు చర్చి గంటల మ్రోతలనీ, తుపానుగాలి హోరునీ కళ్లకి కట్టేట్లా చెయ్యడానికి అతను వాంగో కృతులని అనుకరిస్తూన్నట్లుగా సహజ ప్రాకృతిక ఆకారాల్ని భయంకరమైన భావపూర్ణ రూపాలలో చూపడం ద్వారా విచ్చి

త్తిని కల్పించాడు. ఐతే వాంగో చిత్రాల్ని బర్చ్‌ఫీల్డ్ ఎన్నడూ చూడలేదు కొన్ని సంవత్సరాలు తర్వాత చదునైన అర్ధవ్యక్త అలంకరణ చిత్ర నిర్మాణంలో తను చరమ సీమల్ని అందుకున్నట్లు అతను భావించాడు "నేను చతుర్భుజాల్ని తల్లక్రిందులు చేశాను ఇకముందెంతమాత్రం కుత్రతనంగా ప్రవర్తించకూడదని నేను నిశ్చయించుకున్నాను ఆధునిక అమెరికన్‌దృష్టి కోణంతో జీవితాన్ని దర్శించ యత్నించాను ఐతే అకస్మాత్తుగా జీవితం కఠోరంగానూ, కష్టమయం గానూ, కన్పించింది",

మధ్య పశ్చిమ నగరం అతని దృష్టికి వ్యంగ్య విషయంగా ఉపయోగించేట్లా కన్పించింది ఐతే షేర్‌వుడ్ అండర్సన్ రచన 'విన్స్‌బర్గ్ ఓహియో' చదివిన తర్వాత అతనికి దైర్య గుణంలో ఉన్న విశిష్ట కావ్యత్వం విశదమైంది, ఆ వాస్తవిక కదలికలలోని అత్యుక్తితో కూడిన వ్యంగ్యాన్ని వ్యక్తి పరచాలనే తహతహలో కూడ విశిష్టతఉంది వంకర టింకర వీధుల్లో ఒకదాన్నొకటి తోసుకుంటూన్నట్లుగా ఉన్న విచిత్ర భవనాలు అతనికి సజీవసహవాసులుగా కన్పించేవి షట్టర్ల కనురెప్పలతో కూడినగవాక్షనేత్రాలతో ఏవోవ్యక్తిత్వాలు అతనికి తొంగిచూస్తున్నట్లనిపించేది ఆ వ్యక్తిత్వాల్లో మంచీ చెడుగూ అపశ్రుతీ సంగీతం అన్నీ అతనికి గోచరించేవి 1921 లో అతను న్యూయార్క్‌లోని బఫెల్లోకి మారాడు అదిసరిగా అతనికి తన జన్మస్థానమైన ఓహియోలా కనిపించింది క్రమక్రమంగా అతను తనయవ్వనకాలంలోని విచిత్రకల్పనాలోకంలోకి జేరుకున్నాడు అతను తన అర్ధవాస్తవిక కాలంలో తనుసాధించిన చక్కనినైపుణ్యాన్ని దానికి జతపరిచాడు. 'శిశిర శోభ' (చిత్రం 42) పక్షుల గానంతో మనని మంత్ర విముగ్ధుల్ని చేసే దృశ్యచిత్రం

వుడ్, బెంటన్‌లు మధ్య పశ్చిమ జానపద రీతుల్లో యుద్ధానంతర భయాందోళనకి ఒక మంచివిరుగుడు కనిపెట్టారు బర్చ్‌ఫీల్డ్ విశ్వప్రేమ సిద్ధాంతాన్ని వ్యక్తపరిచాడు ఇతర చిత్రకారులు కూడ రకరకాలుగా వ్యవహరించారు స్టూవర్ట్ డేవిస్ (1894–) తన సంపూర్ణ అధికారానికి లోబడి ఉండేపద్ధతిలో ఒకవ్యక్తిగతప్రపంచాన్ని సృష్టించుకున్నాడు బెన్ షాన్ (1898 –) వాస్తవిక ప్రపంచాన్ని తన స్వప్న జగత్తుకి సమీపంగా

తెచ్చేందుకి పరిశ్రమించాడు ఇవాన్ లీ లొరైన్ ఆల్ బ్రైట్ (1897 -) వింత ఆకారాలలో భయంకరత్వాన్నీ జాలినీ వ్యక్త పరచాడు

డేవిస్ తన చిన్నతంలో హెన్రీతో శిక్షణ పొందాడు 'హూరి గుడి సెల శైలి' లో చాల ప్రతిభాశాలిగా ప్రసిద్ధి కెక్కాడు ఆర్మరీ ప్రదర్శనంలో ఫ్రెంచి చిత్రాల్ని చూసి "ఏమైనా సరే, నేను తప్పక ఆధునిక చిత్రకారుడుగా తయారవా"లని సంకల్పించుకున్నాడు మెస్సాచూసెట్స్ లోనూ పారిస్‌లోనూ అతను తన వాస్తవిక దృక్కోణాన్ని అతికష్టం మీద నశింపజేసుకున్నాడు 'గాస్‌లైట్‌లో న్యూయార్క్' (చిత్రం 43) ఒక స్థలాన్ని గాని సన్నివేశాన్ని గాని వ్యక్త పరచకుండా అంబరచుంబిత భవనాలలో కూడిన నేటి యుగానికీ, పంతొమ్మిదవ శతాబ్ది సౌందర్యానికీ మధ్యగల తేడాని మనకి బాగా చూపిస్తోంది ఈ చిత్రంలో వివిధప్రాకృతిక వస్తువులు సరళ పరచబడి శృతిభంగాన్ని కల్పించబడి, సమ్మిశ్రిత మొనర్చబడి, మృదుమధుర వర్ణలేపనంతో అప్రాకృతిక ఆలంకరణ విధానంలో సమకూర్చబడాయి, డేవిస్ తనకళని సౌందర్య సిద్ధాంతాలతో గాక వైజ్ఞానిక సిద్ధాంతాలతో వ్యక్త పరిచాడు, భౌతిక వాస్తవికతకి రేఖాగణిత విధానాలు ఉహా సిద్ధాంతాలపై నిర్మితమైన తర్కపూర్ణ నిర్మాణాలద్వారా సృష్టించ బడతాయని అతను గుర్తించాడు "రూప కల్పనలు అసంఖ్యాకంగా ఉన్నాయి నా రూపకల్పన చాలా సరళమైనది. స్థలం స్థిరమైనదీ ప్రకృతి అస్థిర మైనదీ అనే సిద్ధాంతంపై అది ఆధారపడి ఉంది. వర్ణ్య విషయాలలోని ఆకారాలు ప్రత్యక్ష ప్రకాశంయొక్క క్రమబద్ధ ఆధారాల విభిన్న కోణాలమీదుగా రూపొందుతాయి విభిన్నకోణాల వ్యక్తీకరణలోనే వర్ణ పరిమాణ, ఆకార, ప్రాకారాలకి సంబంధించిన అద్భుత రూపకల్పన ఇమిడి ఉంది" అని అతను చెప్పాడు. ప్రకృతి శాస్త్రంతో ప్రత్యక్ష సంబంధం కలిగి ఉండడంవల్ల డేవిస్‌కళ ఇరవయ్యో శతాబ్దానికి ఎక్కువఅనుకూలమైనదిగా కనిపిస్తుంది కాని, ప్రకృతిసత్యంగాక వ్యక్తిగతవ్యక్తీకరణలక్ష్యంగా కలిగిఉండడంవల్ల అదిప్రకృతి శాస్త్రానికికొంత విరుద్ధమనికూడా చెప్పవలసి ఉంటుంది అతనన్నాడు, "చిత్రకారుని పక్ష్యం ప్రకృతిలోని వస్తువుల్ని అనుకరించడంకాదు వాటితో సమాన

మైన కొత్త వస్తువుల్ని సృష్టించడం మాత్రమే ప్రతి వస్తువులోనూ, వ్యక్తిలోనూ కొన్ని ప్రత్యేక విశేషాలుంటాయి ఐతే అవి కావాలని నిర్మించుకున్నవికావు వాటంతట అవే వాటికి సిద్ధించాయి తన చిత్రిత విషయంలోని ఆ ప్రత్యేకతలకి ప్రాముఖ్యత నివ్వడమే చిత్రకారునిపని" దేవిస్ ఒక వ్యక్తిగత ప్రపంచానికి నియంతృత్వం వహించాడు తను నిర్మించిన నియమాన్ని పాలించిననాడే అతను ప్రకృతికి ఆ సామ్రాజ్యంలో ప్రవేశం ఇస్తాడు దర్శకుడి విషయంలోకూడా ఇదే నియమాన్ని విధించాడు

బెన్ షాన్ ప్రారంభిక జీవనం వెబర్ జీవితం లాగే గడిచింది లిధుయానియాలో పుట్టి బాల్యం నుండి బ్రూక్‌లిన్ లోనే పెరిగాడు పారిస్‌లో అతను సరికొత్త ట్రిక్కులు నేర్చుకున్నాడు అక్కడి నుండి తిరిగి వచ్చిన తర్వాత వ్యక్తిగత సౌందర్య భావనని అతను నిరసించాడు "ఇదిగో నా మాతృదేశం తిరిగివచ్చాను ముప్పైరెండేళ్ల వాడిని నా తండ్రి ఒక కార్పెంటర్ ఫ్రెంచి శైలి నాకెంతమాత్రం పట్టదు" కొన్ని సిద్ధాంతాల్ని ప్రచారం చెయ్యడానికి తమకళని అంకింతంచేసిన అభ్యుదయ చిత్రకారులవలె షాన్‌కూడ తనబొమ్మల్లో తన సాంఘిక నమ్మకాల్ని ప్రచారం చేశాడు, వర్గ సమానత, కార్మిక సంఘ ప్రాముఖ్యత, సాంఘికన్యాయం – వీటికోసం అతను తన చిత్రాల్లో పాటుబడ్డాడు సామాన్య జనానికి అందుబాటులో ఉండడం కోసం అతను తన రంగుల్లోనూ, ఆకారాల్లోనూ అవసరమైన మార్పులు తీసుకువచ్చాడు సహజత్వానికి కావలసినంత వరకూ అతను తన దృక్కోణాన్ని మార్చుకొన్నాడు అతని చిత్రాలు కొన్ని పై భాగంలో ఊరికే అక్షరాలు రాయడం ద్వారా మంచి పోస్టర్‌లుగా తయారయాయి ఉదారమానవతా వాదంలో అతని విశిష్ట రాజకీయ సిద్ధాంతాలు తాదాత్మ్యం పొందాయి తను ప్రచారంచేసి సిద్ధాంతాలు చారిత్రిక గ్రంథాలలో పడి నిద్రపోతున్నా షాన్ కళాతత్త్వాలకి ఎట్టిలోటూ కలుగలేదు, "గనుల పనివాళ్ల భార్యలు" (చిత్రం 44) లో ఒక స్త్రీ తనభర్త చనిపోయిన వార్తని అప్పుడే అందుకుంటుంది ఏ గనుల వాస్తవిక దుర్ఘటన సంగతోవిని చిత్రకారుడు. నిస్సందేహంగా కుపితుడై ఉండవచ్చు అతని

హృదయంలో కరుణా సముద్రం పొంగిపొరలి ఉండవచ్చు కాని చిత్రాన్ని అతి వాస్తవికంగా చెయ్యడానికి బొగ్గు గనులలోని అసలు పరిస్థితుల జ్ఞానం చిత్రకారునికి అవసరంగా కన్పించలేదు ఈ శోకాకులిత స్త్రీ తన మండుతూన్న కళ్లతోనూ బాధచే బిగించిన పిడికిళ్లతోనూ దేశకాల పాత్రావధుల్ని దాటిపోయింది హృదయ విదారక క్రూరత్వం చేత దలితమైన సంపూర్ణ మానవజాతికి ఒక చిహ్నంగా ఆమె రూపొందింది ప్రపంచాన్ని ఉత్తమ స్థలంగా చెయ్యవచ్చుననే వ్యక్తియొక్క వాస్తవిక కోపాన్ని షాన్ కళ ప్రతిబింబింపజేస్తుంది జీవితాన్ని ప్రతిఘటించడంలో ఆల్ బ్రైట్ శాంతి పూర్ణమైన నిర్లిప్త విధానాన్ని అవలంబించాడు షాన్ కంటె ఎక్కువ ఆశావాదిగా ప్రారంభించి అతను నిరాశావాదిగా అంతమయ్యాడు బాలకుడుగా ఉన్నప్పుడే ఆల్ బ్రైట్ 19వ శతాబ్దపు సంతృప్తి వాతావరణంలో ఉక్కిరిబిక్కిరయాడు అతని తండ్రి భావుకత్వంలో బాల్యలీలలని చిత్రించే ఒక చిత్రకారుడు. గేలంతాడుతో చేపల్నిపట్టే అల్లరిపిల్లల చిత్రాలకోసం అతని తండ్రి అతన్ని నిరంతరం పోజులలో నిలబెట్టేవాడు ఆ తరువాత ఒక కఠోరమైన సంఘటన జరిగింది మొదటి ప్రపంచ యుద్ధంలో మెడికల్ ఆఫీసర్లు అతనికొక భీకరకార్యాన్ని అప్పజెప్పారు ప్రపంచ పాపాలకోసం అసువులుబాసే అమాయిక యువకుల యుద్ధగాయాల్ని రంగులలో రికార్డు చెయ్యమన్నారు ప్రతీమానవ జీవితం అర్థంలేని దుఃఖాంత నిరాశావాదం అనే విశ్వాసంతో అతను చికాగో ప్రాంతాలకి తిరిగి వచ్చాడు పూర్వకళా చార్యుల అతి నిపుణత్వంతో ఉపయోగించుకుంటూ ఆల్ బ్రైట్ దర్శకుని కళ్లు భౌతిక అస్తిత్వాన్నే గ్రహించేట్టా చేశాడు "నేను చూస్తూన్న వస్తువుకి అతి చేరికగా ఉన్న ఒకానొకమూర్తి సాక్షాత్కారం" అని భౌతిక అస్తిత్వాన్ని అతను వివరించాడు అతని అమెరికన్ అనుభవం ఫ్రెంచి సర్రియలిజానికి అతన్ని అతన్ని అతి దగ్గరగా తీసుకొని పోయింది

"నెం 203 గది" (చిత్రం 45) ఒక పెద్ద హోటల్ గదిలో బాగా అలసిపోయిన ఒక వృద్ధుడు తన దుస్తుల్ని మార్చుకుంటూన్నట్లు చూపే చిత్రం ఇందులో అన్ని వస్తువులపై ఆవరణలూ అతి చక్కగా చూప

బడ్డాయి జీర్ణమైన శీర్ణమైన శయ్యా, అండర్ వేర్ యొక్క తెగిపోతున్న దారాలూ, అన్నిటికంటె ముఖ్యంగా శ్మశానంలో కుళ్ళి పోవడానికి తయారుగా ఉన్న అసహ్యమైన మాంసకండరాలూ అన్నీ సవివరంగా చూపించబడ్డాయి చూసే చూడ్డంతో ఈ చిత్రం సమస్త మానవ జాతిమీదికీ అమానుషంగా జరిసే ఒక దాడిలాగా కనిపిస్తుంది కాని ఆ మొదటి భావోద్వేగం చల్లారిన తర్వాత ప్రేమా, జాలీ మనలో మేల్కొంటాయి ఇక్కడ మనకి ఆల్ బ్రైట్ "ఒక వ్యధాపూర్ణ రోగగ్రస్థ శరీరంలో ఒక అమర ఆత్మ చిక్కుకు పోయింది పాశవిక ఆవశ్యకతల తీర్చుకోడంలో అది అసహాయస్థితిలో ఎడిపోయింది పరిచిత ప్రపంచానికి దూరమై అది విముక్తికోసం తహతహలాడుతోంది ఆఖరిక్షణం వరకూ అతిధైర్యంతో యాత్ర సాగిస్తోంది" అని చెప్తాడు ఇటువంటి కొన్ని చిత్రాలద్వారా జీవితం యెడల తన తీవ్ర దృష్టికోణాన్ని వ్యక్త పరుస్తూ ఆఖరికి ఆల్ బ్రైట్ తన కుంచెని జీవితంయొక్క చరమ సత్యం మృత్యువు వైపు తిప్పుతాడు "చెయ్యవలసి ఉండి కూడా నేను చెయ్యనిది' అనే చిత్రాన్ని చిత్రించడానికి అతను పది సంవత్సరాలు తీసుకున్నాడు ఒక జీర్ణ కవాటంమీద ఒక శవహారం వ్రేలాడ దయబడిఉన్న ఈ చిత్రం మృత్యు భయాన్నీ ఆకర్షణనీ జడవస్తువులద్వారా అతి దక్షతతో వ్యక్తపరుస్తోంది

అధమ పక్షం ప్రసిద్ధ అధునిక అమెరికన్ చిత్రకారుల పేర్లెయినా ఇవ్వడం స్థలాభావం వల్ల అసంభవమవడం వల్ల కొందరు విమర్శకులు చిత్రకారుల్ని నిశ్చితమైన కొన్నివర్గాలుగా విభజించడంద్వారా తమకార్య భారాన్ని తగ్గించుకోడానికి ప్రయత్నించారు తత్ఫలితంగా మన నోరు తిరగని కొన్ని వాదాలూ ఇజములూ వికసించాయి వీటిలో అతి అధునాతనమైనది ఇంట్రా సబ్జెక్టివ్స్ రకాలూ, విభాగాలూ, ఉపవిభాగాలూ, ప్రశ్నార్థక వివరాలూ మొదలైన దీని లక్షణాలన్నీ ప్రాచీన చిత్రకళ కంటే ఆధునిక చిత్రకళ ఎక్కువ వివిధతలతో కూడుకున్నదీ, క్లిష్టతరమైనదీ అనేవాదాన్ని బలపరచడానికి ఉపకరిస్తాయి, నిజానికి చెట్లకిబదులు అడవుల్ని చూసే మనస్తత్వంతో కూడిన అతి సన్నిహితదృష్టికి ఇటువంటి రూపాలు సువ్యక్త మౌతాయి

మన పూర్వపు తరాల కళను మనం ఇప్పుడు అర్థంచేసుకుంటూన్నట్లుగా రాబోయే తరంవారు మన కళనికూడ అర్థం చేసుకోగలుగుతారనే మనం ఆశించవచ్చు నిజానికి పెద్ద పెద్ద మ్యూజియములూ, అందుబాటులో ఉన్న ఫోటోగ్రఫీ ఉత్తమ కళాసాహిత్యం, సత్వర యాత్రా సదుపాయాలూ, ఇంతకు ముందెన్నడూ ఎరుగని అనేకరకాల శైలులకి దోహదకరమయాయి కాని ఇరవై ఒకటో శతాబ్దంవారికి ఇవి అంత ఆశ్చర్యకరమైనవిగా ఉండవు అనుకరణకారులు ఎప్పుడూలాగే అప్పుడూ విస్మృతి గర్భంలోకి వెళ్లిపోతారు కాని అంతరిక భావనాశక్తిని ప్రస్ఫుటం చేసే చిత్రాలు చిత్రించే మౌలిక చిత్రకారులు శాశ్వతంగా ఉండిపోతారు ఫ్రాంక్లిన్ సి వాట్కిన్స్ (1894–) రీతివాదుల్నీ జోన్ కార్బినో (1905-) నీ, రూబెన్స్ నీ ఒక జాతీయ శైలులలోకి ఇమిడ్చారు ఇరవయ్యో శతాబ్దపు ప్రథమార్ధంలోకి అమెరికన్ విచారధారని ఆజాతీయ వాచ్యం చక్కగా వ్యక్తపరుస్తుంది

క్యూబిజం చేత ఎక్స్ప్రెషనిజంలోని వర్ణాకృతుల అపశ్రుతికి విరుగుడుగా ఏర్పడ్డ నిర్మాణ విధానాన్ని జాతీయ వ్యక్తిగత తత్వాలతో రంగరించడమే ఈ జాతీయవాచ్య లక్ష్యం యూరపియన్ చిత్రకారులను సరించిన ప్రాకృతికా కారాల అధికృతాపశ్రుతితో కూడిన మన సంఘానికి సరిపడేట్లు కన్పించదు రెండుయుద్ధాల మధ్యకాలంలో కృషి చేసిన తీవ్రాతితీవ్ర అమెరికన్ చిత్రకాలకి కూడా వాస్తవికత నుండి ఈ పలాయనమూ శుద్ధ కల్పనాలోకాన్వేషణమూ వారి సాధనా పథంలో ఒక మజిలీ మాత్రమేకాని సాధనాసిద్ధికాదు రెజినాల్డ్ మార్ష్ (1898–1954) వంటి వారి కృతులలో నేల విడిచి సాముకి వ్యతిరేకు లయిన పూరిగుడెసెవాదుల శైలి ప్రముఖ స్థానాన్ని పొందింది అలెగ్జాండర్ బ్రూక్ (1898– ) తన సహచరులతో పాటు ప్రాకృతిక మూర్త్యంకన విధానాన్ని జయప్రదంగా కొనసాగించాడు క్రొత్త జాతీయ శైలిచే పరిపుష్టమైనంతవరకే ఈరీతులు సజీవంగా ఉన్నాయి నవ్యయుగాన్ని లక్ష్యపెట్టకుండా పాత ధోరణిలో చిత్రరచన సాగించేవారి చిత్రాలకి మంచి అమ్మకం ఉంది పాత సిద్ధాంతాల్ని మక్కికి మక్కి దింపేవారి చిత్రాలన్నిటి వలెనే ఇవికూడ త్వరలో

విస్మృతి గర్భంలో విలీనమవడం నిశ్చయం నిజానికి ఈ మితవాద చిత్ర కారులకి నవ్యచిత్రకారులతో సరితూగ గల శిష్యులెవరూ ఏర్పడనే లేదు అభ్యుదయ వాదులు ఆధునిక చిత్రకళాన్వేషణల మీదే తమ అనుభూతుల్నీ అనుభవాల్నీ ఆధారపచారు

రెండవ ప్రపంచ యుద్ధం అణుబాంబ్‌లవల్ల నవ్యచిత్రకారులు సాధించవలసిన లేక నిరాకరించవలసిన దృశ్య చిత్రం ఇంకా వెనక బడి పోయింది వుడ్ బెటంన్‌ల ప్రాంతీయతావాదం అమెరికన్ జానపదీయ రీతుల్లో తలదాచుకుందా మనని కలలు గంటూనే నశించిపోయింది కాని కొందరు యువచిత్రకారులు వాస్తవికతకి పూర్తిగా విరుద్ధమైన కాల్పనిక వస్తు జగత్తులో మునక లెయ్యడానికి ప్రయత్నించారు ఆదర్శ దృష్టికోణం తోనూ రచనా నైపుణ్య దృష్టితోనూ సరళమార్గాన్ని అవలంబించక తమ సంకుచిత దృష్టి కనుగుణ్యమైన మార్పూ అభివృద్ధీలేని పాత పద్ధతుల్లో వారు నిలువద్రొక్కుకు పోయారు దేవదారు వృక్షాలకంటె నాచు నవ నవలాడుతూ అతి త్వరగా పెరుగుతుంది తీవ్రకళావాదులు ఈ పాతపద్ధతుల్ని పలాయన దృష్టికోణంతోగాక సాధనా మాత్రాలుగా తీసు కున్నారు

మత పట్టుదల గల మోరిన్ గ్రేవ్స్ (1910–) వాషింగ్టన్ రాష్ట్రంలో ఒక ఏకాంత సముద్రతీరాన ఋషి జీవితాన్ని గడుపుతున్నాడు ఐతే అవసరమైనప్పుడు అతను సాంఘిక జీవితంలో ప్రముఖపాత్రనే వహించాడు. అమెరికన్ మెయిల్ లైన్‌లో కేడెట్‌గా పనిచేస్తూ అతను మూడుసార్లు ప్రాచ్యదేశయాత్రచేశాడు ప్రాచ్యకళాజీవితాలచే చాలా ప్రభా వితుడయాడు న్యూయార్క్‌యాత్ర అతనికి నిరుత్సాహాన్నే కలిగించింది నడివీధిలో చనిపోతూన్న ఒక పావురం అతని హృదయాన్ని బాగా కల చేసింది ఉన్నత సౌధాల బారి నుంచీ, జన సమ్మర్దం బారి నుంచీ తప్పిం చుకోవడం కోసం అతను "స్వర్గం" అనబడే ఫాదర్ డివైన్స్ హార్లెం లో తలదాచుకున్నాడు. అక్కడ నివసించే "దేవతల" కి అతను పరిచ ర్యలు చేశాడు రెండవ ప్రపంచ యుద్ధం అతనికి అతి ఘోరంగా కన్పిం చింది. మత విషయక విశ్వాసాలు అతన్ని అందులో పాల్గొనకుండా

చేశాయి. "చిత్రకారుని హోదాతో జపాను చిత్రకారుల పరిచయం పొందడం కోసం, ప్రపంచశాంతి కోసం. ప్రాచ్య ప్రతీచి కళా శక్తుల్ని సంఘటితపరచడం కోసం" యుద్ధం ముగిసిన తర్వాత అతను "గగ్గెన్ హీమ్ ఫెలోషిప్' కోసం ప్రయత్నించి సంపాదించాడు కాని ఆక్యుపేషన్ అధికారులు అతన్ని జపాన్ లో అడుగుపెట్టనియ్యలేదు

అనకోర్టెస్ తీరంలో అతను తన చుట్టూ ఉన్న పక్షుల్ని చిన్న జంతువుల్నీ చిత్రించాడు. హింసాత్మక క్రీడా ప్రియుడైన ఆడుబన్‌ని అతను ప్రతిఘటించాడు చిత్రించడం కోసం పక్షుల్నీ మృగాల్నీ చంపే అధికారం చిత్రకారుడికి ఉందని ఆడుబన్ వాదన శాంతి సామ్రాజ్యం (వర్ణ చిత్రం) అనే నీతిబోధక చిత్రాన్ని చిత్రించిన మత బోధకుడు హిక్స్ భావాలతో గ్రేవ్స్ భావాలుసరిపోతాయి "అంతర్యదృష్టికి కన్పించే అపురూపపు పక్షి" (చిత్రం 47) వంటి శీర్షికలు చూస్తే గ్రేవ్స్ మానవ బాహ్యప్రకృతినీ, అంతర్య ప్రకృతినీ చక్కగా గ్రహించగల శక్తిశాలి యన్న విషయం మనకి వ్యక్తమౌతుంది చం దుడికేసి చూస్తూ పాడుతూన్న చిన్నపక్షీ రెక్కల్ని రెపరెపలాడిస్తూన్న నీటి పక్షినీ చూసి అతనిహృదయం ఉప్పొంగిపోయేది ఆక్షణంలో ప్రపంచసృష్టి రహస్యం అతనికి అవగతమైపోయేది. జపాన్ డిజైన్‌నీ, యూరపియన్ ఆధునిక కళనీ సమ్మిళితంచేయడం ద్వారా అతను పలచనికాయితాల మీద చక్కని చిత్రాల్ని చిత్రించాడు. ప్రకృతి యొక్క కఠోరబాహ్యావరణక్రింద దాగి ఉండే భావనామార్దవం అతని చిత్రాల్లో తొణికిసలాడుతుంది అసలైన కళాతత్వం భావనా మార్దవమేనని అతని విశ్వాసం అతని గుడ్లగూబలు ప్రాచ్య యోగీశ్వరులలా ధ్యానమగ్నాలై యుండగా వాటి రెక్కల్లోంచి ఎలుకలు నిర్భయంగా పరుగెత్తుతాయి అతి సూక్ష్మమైన సంయమితమైన చిత్రకళని చేపట్టిన గ్రేవ్స్ సౌందర్య చరమసీమల లోతుల్లోకి వెళ్లలేదు, ఐనప్పటికీ నేడు అతను సంయుక్తరాష్ట్రాలలోని మౌలిక ప్రతిభావంతులలో ఒకడు

యువకళాకారులకి భావనాత్మక కళ సహజంగా సిద్ధిస్తుంది అందుచేతే గ్రేవ్స్ వంటి భావనాత్మక చిత్రకారులు వాస్తవికతా వాదులకంటె

ముందుగా పరిపక్వత చెందారు వర్తమాన యుగ సాంఘిక సమస్యల కోలాహలంలో భావనాత్మక కళనినిరసించే చిత్రకారులు పూర్తి పరిక్వత చెందినగాని సుస్థిరత నందలేదు. ఆల్టన్ పికెన్స్ (1917—) కృషి తది తర అభ్యుదయ చిత్రకారుల కృషివలెనే ఆకర్షణీయమైనది ప్రథమ ప్రపంచ యుద్ధకాలంలో సీటిల్‌లో జన్మించిన పికెన్స్ మాంద్యకాలంలో కౌమారాన్నందుకున్నాడు నవ్య సంఘర్షణా కాలంలో ప్రౌఢవయస్కు డయాడు. శారీరక తత్వాన్ని బట్టి యుద్ధంలో పాల్గొనడానికి వీలు పడక పోయినా యుద్ధక్షేత్రంలో వున్నతనసహపాఠలని అతను మరచిపోలేదు. "నార్మండీ దాడి సమయంలో చర్చికి సంబంధించిన చిత్రాల్ని నేను ఎం దుకు చిత్రించానని అడగడం అన్యాయం ముందే మనకి వస్తుందని తెలి సినా మనం కోరుకుంటే ఆగిపోయే యుద్ధంలో పాల్గొన్న యువకులు సృష్టికి అవసరమైన స్థిరబుద్ధినీ విశ్వాసాన్నీ సంపాదించడం కష్టం ఐనా సృష్టి ఆగడంలేదు అందులోనే మానవత్వం యొక్క అద్భుత రహస్యం ఇమిడి ఉంది"

తుపాకీ పుచ్చుకున్న వ్యక్తి కంటె కుంచె పుచ్చుకున్న వ్యక్తి యుద్ధా నికి ముందు తయారవాలని పికెన్స్ నమ్మినా అసలు శత్రువుమీదికి ప్రత్య క్ష్యంగా కళాదృష్టుల్ని ప్రసరింప జేయడం తేలికైన పనికాదు "కుర్రత నపు సైన్స్ హాస్య పుస్తకాలోంచి ఒక పేజీని చింపేసి లెవర్‌తో ప్రపం చాన్ని పేల్చి పారెయ్యమని మనసు ఉసికొల్పే ఈ ఆత్మఘాతుక యుగా నికి'' ఎవరు లేక ఏది బాధ్యత వహిస్తుంది? సత్యాన్నుంచి అసత్యాన్ని విడదీయలేని మన అసమర్థతని పికెన్స్ నిందించాడు "మనిషి కొన్ని కథా శృంఖలలని నిర్మిస్తున్నాడు, వాటి ఆధారంతో జీవిస్తున్నాడు పైకి కనిపిస్తూన్న ఆకారాన్నే వాస్తవమనుకొని నేను చిత్రాల్ని చిత్రించలేను వాస్తవం ఇలా ఉండాలని చూపించడానికి కూడ నేను చిత్రరచన చేయ లేను. వాస్తవికతనీ కల్పననీ ఒకే ఆవరణ క్రింద బంధించి ఒక పరిమిత రూపంలో వాటిని చూపించడానికి ప్రయత్నిస్తాను. నా కల్పనాశక్తి పరి ధులూ, నా నైపుణ్యపు పరిధులూ ఈ పరిమిత రూపంలోకి సూక్ష్మతను రేఖల్ని ఎన్నుకునేందుకు నన్ను బాధ్యుణ్ణి చేస్తాయి. ఒక్కొక్కప్పుడు ఈ

పరిమిత రూపం యొక్క అర్థంలేని విచిత్ర తాంత్రిక రీతులను వ్యక్త పరచడంతోనే నేను తృప్తిపడతాను. నా ప్రయత్నాలన్నింటికీ అట్టడుగున అనంత విశ్వభావనా కాంక్ష, మానవజీవిత చరమ సత్యాన్వేషనా ఇమిడి ఉన్నాయి"

స్పష్టంగా ఆలోచించేట్లా మనను భయపెట్టడం కోసం పికెన్స్ "కార్నివాల్" (చిత్రం 48) వంటి భయంకర ఆకారాల్ని మనముందు సాక్షాత్కరింపచేస్తాడు ఈ చిత్రంలోని తలలు తెగి అర్థంలేని అంగ వైకల్యాలతో అసహ్యాకరంగా కన్పించే శరీరాలూ, నీలి ముఖంతో కిరీటధారియైన ఆది మానవుడూ మన్ని భయపెడతారు ఈ అణు బాంబ్ యుగంలో భావి సంతతి భాగ్యం కోసం చిత్రించాలనేది జాలిపడదగ్గ భ్రమ అని అతనంటాడు లోకానికీ సమయానికీ తగినసందేశమివ్వడం చిత్రకారుని పని అంటాడు ఐతే అతనిచిత్రం జుగుప్సాకరంగానే ఉంది సంభ్రమవాదం, ఒకవిధమైన భావోన్మాదం అతని లక్ష్యాల్ని తలక్రిందులు చేశాయి నిజానికి తనహృదయంలోని సంఘర్షణలకి సిద్ధాంతపూర్వకమైన సమగ్ర కళా స్వరూపాన్ని అతను ఇంకా రూపొందించుకోలేదు ఐనప్పటికీ కార్నివాల్ ఇంతకంటె అందంగా తయారైన స్థిరమైన చిత్రాలకన్న గొప్పదని చెప్పొచ్చు నిర్భయంగా ఒక భయంకర యుగాన్ని ఎదిరించి నిల్చి సుస్పష్టమైన శైలిలో తనభావాల్ని సువ్యక్తపరచే ప్రయత్నంలో పికెన్స్ కటిబద్ధుడై నిలిచాడు కష్టసాధ్యలక్ష్యాలతో కళాసాధన చేస్తూన్న చిత్రకారుల్లో అతనొకడు

అమెరికన్ యువచిత్రకారుల శ్రేణీ నిర్ణయం ఇప్పట్లో చెయ్యకలగడం అసంభవం ఇది ఈ యుగపు చిత్రకారులే నిర్ణయించాలి ఈ నాడు ప్రసిద్ధులుగా భావించబడిన చిత్రకారులు రేపు పడిపోతున్నారు, విస్మృతి గర్భంలోంచి పేరూ ఊరూలేని చిత్రకారులు నవ్యాన్వేషణలతో ఉన్నతి శిఖరాల్ని అధిరోహించ డానికి ముందుకి రావచ్చు. సంయుక్తరాష్ట్రాలంతటా వ్యక్తి గతావశ్యకతల కనుగుణంగా ప్రతిభాశాలురైన చిత్రకారులు ముందంజ వేస్తారు అదునులో పంట కోతకి వస్తుంది,